# భారత జనాభా

## కుటుంబ నియంత్రణ

రచయిత

**డాక్టర్ ఎస్. చంద్రశేఖర్**

అనువాదం

**అద్దేపల్లి వివేకానందాదేవి**



పబ్లిషర్సు: అద్దేపల్లి అండ్ కో
సరస్వతీ పవర్ ప్రెస్
రాజమహేంద్రవరము

# POPULATION AND PLANNED PARENTHOOD IN INDIA

BY

S. CHANDRASEKHAR

Director, Indian Institute for Population Studies,
Nuffield Foundation Fellow, London School of Economics.



Translated by
**A. VIVECANANDA DEVI, B. A.,**

First Edition 5,000 Copies – June 1959 – Price Rs 1–50

PUBLISHED UNDER THE AUSPICES OF
THE SOUTHERN LANGUAGES BOOK TRUST

Telugu Publication rights



Publishers: ADDEPALLY & CO.

SARASWATHI POWER PRESS

RAJAHMUNDRY (A. P.)

## అంకితం

దూరదృష్టిలేని మాతృత్వంతో బాధపడుతూన్న
భారతదేశంలోని తల్లులందరికీ

# పరిచయము

ప్రజాసామాన్యానికి ఆకర్షకంగా, విశేషోపయోగకరంగా ఉండే పుస్తకాల ప్రచురణను ప్రోత్సాహం చెయ్యాలనే సంకల్పంతో దక్షిణభారత పుస్తకసంస్థ లోగడకొన్ని పుస్తకాలను ప్రచురింపచేసింది. ఆప్రచురణవలన కలిగిన అనుభవంతో ఇప్పుడు మరికొన్ని పుస్తకాలను వివిధ ద్రావిడభాషలలోకి అనువాదం చేయించి ప్రచురింపజేస్తూంది. పాఠకులలో భిన్నభిన్న అభిరుచులకు తగినట్టు ఈపుస్తకాలను శ్రద్ధగా ఎన్నికచేశారు. అందువల్ల మానవజీవితానికి సంబంధించిన వివిధవిషయాలను గురించిన రచనలు ఇందులో ఉండటం సహజం. భారతమహానాయకుల జీవితచరిత్రలు, వారుచేసిన ఘనకార్యాలు వివరించే గ్రంథాలు ఈ ద్వితీయ గ్రంథపరంపరలో ఒకశాఖ. మన దేశశ్రేయస్సు కోసం, అభ్యుదయంకోసం ఆ మహాపురుషులు ఏమిచేసినది, వారికి తామెంత ఋణపడియున్నది, ప్రజలకు ముఖ్యావశ్యకములైన హక్కులను సంపాదించటానికి వారెన్నెన్ని పాట్లుపడినది ముందుతరాలవారంతా తెలుసుకుని ఉండటం మంచిదిగద !

తత్త్వశాస్త్రం, మతం, విజ్ఞానశాస్త్రం, సాహిత్యం— ఈగ్రంథపరంపరలోని ఇతరశాఖలు. కథానికలు, ప్రాచీన కళాసంపదలను అభివర్ణించే గ్రంథాలుకూడా ఇందులో ఉండటం ముదావహం. నాటకకళ, శిల్పశాస్త్రం, పురావస్తు పరిశోధ

నలు, నిరతాద్భుతావహాములైన దాక్షిణాత్య దేవాలయాలను గురించిన గ్రంథాలు ఈపరంపరలో ఉన్నవి. విజ్ఞాన వికాస దాయకములైన భిన్నభిన్న విషయాలను గురించిన ఈగ్రంథాలు ప్రజలను విశేషంగా ఆకర్షింపగలవని, ఆవిధంగా ఇట్టి ప్రచురణలకు ముందు ముందు విస్తార ప్రచారం కలుగగలదని నా విశ్వాసం.

దక్షిణభారతభాషలలోని ఉత్తమగ్రంథాలు కొన్నింటిని మిగిలిన దాక్షిణాత్యభాషలలోకి అనువదింపచేయుటం ఈ ద్వితీయ గ్రంథపరంపరలోని మరొక ప్రశంసనీయమైన విశేషం. ఈపుస్తకాలన్నీ పూర్తిగా వెలువడినప్పుడు, విద్యావంతులలో ఎక్కువమందిని వివిధవిషయాలను గురించిన జ్ఞానాసక్తిగల పాఠకులుగా ఆకర్షించి ఆ జ్ఞానపిపాసను తృప్తిపరచటానికి యోగ్యమైన గ్రంథాలనుకూడా వారికి అందజేసినట్టు అవుతుంది.

ఈ దక్షిణభాషాపుస్తకసంస్థ ఆశయాలు శీఘ్రగతిని సఫలం కాగలవని ఆశిస్తున్నాను.

మదరాసు,<br>7-10-58.

ఎ. ఎల్. ముదలియార్,<br>వైస్ ఛాన్సెలర్<br>మద్రాసు విశ్వవిద్యాలయం.

# పరిచయం

డా॥ జూలియన్ హక్స్లీ.

దినదినం పెరుగుతూన్న ప్రపంచ జనాభానిచూచి కలవరపడుతున్న వారందరికీ ప్రఖ్యాత భారతీయుడైన డాక్టరు చంద్రశేఖర్‌గారు తన గ్రంథంలో భారతజనాభా సమస్యల్ని సవిస్తరంగా తెలుపడమేగాకుండా, కుటుంబ నియంత్రణ యొక్క ప్రాముఖ్యాన్ని చక్కగా వెల్లడించడం వల్ల ఒకనూతన ఉత్సాహం కలుగుతుంది.

ప్రపంచ దేశాలన్నిటిలోనూ భారతదేశం జనభా సమస్యల్లో చాలా కారణాల వల్ల ముందుకు వస్తూంది. ప్రపంచమంతటిలోనూ మొట్టమొదటిసారిగా జాతీయ ప్రణాళికల్లో సంతాన నిరోధాన్ని అమలుపరిచింది భారత ప్రభుత్వం కావడం చేతకూడా ఈ దేశానికి ప్రపంచంలో అగ్రస్థానం లభిస్తుంది. బడుగుదేశాల అభివృద్ధి, అభ్యున్నతీ పాశ్చాత్యదేశాల విజ్ఞానంపైనా, సాంకేతిక సహకారంపైనా ఆధారపడివున్నా, ప్రాచ్యదేశాల సాంస్కృతిక, సాంప్రదాయాలకు భంగం వాటిల్లకుండా అధునాతన పద్ధతుల్ని అమలు పరచడానికి పూనుకున్న దేశం భారతదేశం.

పై విషయాల్ని వొకదాని తరువాత వొకటి చర్చించుదాం. ప్రపంచంలో చైనా తరువాత భారతదేశంలోనే యెక్కువ జనాభావుంది. పాకిస్థాన్ విడివడిన తరువాతకూడా 370 మిలియన్ల జనాభాతో భారతదేశం ప్రపంచ అధిక జనాభా దేశాల్లో అరవదిగావుంది. ప్రస్తుతం బ్రిటిషుదీవుల జనాభా సంతటినీ కలిపినా వుండసంత జనసంఖ్యకన్నా హెచ్చుగా భారతదేశ జనాభా గత పదిసంవత్సరాల్లోనూ పెరిగింది. దీనికి కారణం ప్రతీయేడూ పది మిలియన్లు జనం పెరుగుతూ వుండడమే. ప్రతీయేడూ ప్రపంచ జనాభా నూటికి 1·3 శాతం పెరిగినట్టే భారతదేశ జనాభాకూడా పెరుగుతూంది. మిగిలిన దేశాల జనాభా పెరుగుదలతో పోల్చి చూస్తే భారతదేశం జనాభా పెరుగుదల హెచ్చుకాకపోయినా, దేశంయొక్క పరిస్థితులనుబట్టి యీ పెరుగుదల పెద్దసమస్యగానే పరిణమించుతూంది. గణితశాస్త్రరీత్యా "శాతం"బట్టి చూస్తే యీ అధికజనాభా హెచ్చుగా కనబడకపోయినా, సామాన్యమైన సంఖ్యల్లోచూస్తే జనాభా ఎంతగా పెరుగుతూన్నదీ తెలుస్తుంది. దేశీయ ఆరోగ్య ప్రణాళికలో, మలేరియా మొదలైన యితరరోగాలు నిరోధించబడితే ప్రస్తుత జనాభా పెరుగుదల 'శాతం' కూడా యెక్కువైతీరుతుంది. ప్రభుత్వ అధికారనిపుణుల

సంఘం "భవిష్యత్తులో రోగనిరోధక పథకాలు సామాన్యంగా అమలుజరిపినా యేటేట యీ పథకాలవల్ల 3 మిలియన్ల మంది సంరక్షింపబడినట్లయితే మనజనాభా 8 మిలియన్లు వరకూ పెరిగే అవకాశాలున్నా" యని అధికార రీత్యా ప్రకటించారు. ప్రతీ 4 సెకండులకూ వొక శిశువు జన్మిస్తున్నదన్నమాట 20,000 జనాభా కలిగిన వొక పట్టణం ఒకరోజులో ఉద్భవిస్తున్నదని పై లెక్కల్నిబట్టి అంచనా వేసి చెప్పవచ్చు.

దీనికి తగ్గట్టు, జీవన ప్రమాణంకూడాచాలా అథమస్థితిలోవుంది. దీనివల్ల వుండవలసిన విద్యగాని, ఆరోగ్యంగాని, శ్రమించే శక్తిగాని లేకుండా పోయినవి. ప్రపంచ ఆరోగ్యసమితివారి 1952 సం॥లోని ఆహార విలువల పట్టీ ననుసరించి ప్రతి వ్యక్తికీ కనీసం 2200 క్యాలరీల ఆహారం కావాలని అంచనావేయబడింది. స్విట్జరులాండు, కెనడా దేశాల్లోని ప్రజలకు 3000, 3200 క్యాలరీల ఆహారం లభిస్తుంటే మనప్రజలకు అథమం 1600 క్యాలరీల ఆహారంకూడా లభించడం కష్టంగావుంది. దీని పర్యవసానం భారతదేశంలోవున్న 370 మిలియన్ల ప్రజలకూ నిత్యం, నిస్సారమైన, పుష్టిహీనమైన ఆహారమే దొరకడంవల్ల, బలవంతులుగా ధృఢగాత్రులుగా తయారయ్యే అవకాశాలు లేవనడం అసత్యంగాదు. దీనిఫలితం, నిస్సత్తువేగాక ఉత్పత్తి శక్తికూడా నశించిపోవడం జరుగుతుంది. వీటివల్ల యింకా విషమపరిస్థితులు ఏర్పడుతున్నాయి. మనిషికి సగటున 2.8 ఎకరాల నేల రష్యాలో ప్రతివ్యక్తికీవుంటే, కెనడాలో 3½ ఎకరాలుంది. తనతిండి తనే పండించుకుంటున్న, కృషిప్రధానమైన భారతదేశంలో మనిషికి సగటున ఎకరానికి తక్కువగా పొలంవుంది. ఈ పరిస్థితులుకుతోడు తరతరాలుగా వ్యవసాయం చేయడంవల్ల భూమి సారం తగ్గిపోయి, శాస్త్రీయమైన ఎరువులవల్ల యీ లోటు తీర్చబడపోగా, మొక్కా, మోళ్లూ లేకపోవడంవల్ల, గాలిదుమారాల్లో భూమిపై పొరకొట్టుకుపోయి, సహజమైన యెరువూ పేడకూడా పొయ్యిలోకి వుపయోగించబడడంవల్లా భూమి మరీ నిస్సారమై పోతూంది. దీనికి తగ్గట్టు జనాభా సాంద్రతవల్ల పెద్దపెద్ద అడవుల్ని నరకిపారవేయడం, వ్యవసాయానికి ఉపయోగించకూడని పర్వత సరిహద్దు భూముల్ని సాగుచేయడంవల్లకూడా యిబ్బందులు యెక్కువై విషమపరిస్థితులు యేర్పడుతున్నాయి,

ప్రస్తుత పరిస్థితుల్లో గుడ్డికో మెల్లలా పలసరాజ్యాలకి తరలిపోవడంవల్ల యెక్కువ లాభం లేకపోయినా తాత్కాలికంగా కొంత ఉపశమనం వస్తుంది. దేశంలోని జనాభాసమస్యలన్నీ, కొత్తనీటిపారుదల ప్రాజెక్టులవల్లా, లఘు భారీపరిశ్రమల స్థాపనవల్లా, సాముదాయక కృషివల్లా, పల్లెపట్టణ ప్రాంతాల్లో వృత్తి విద్యాభివృద్ధివల్లా. తీరిపోతాయనుకోడం పొరపాటు. పరిశీలనవల్లా, సరియైన లెక్కల

వల్లా తేలిన పర్యవసానమేమిటంటే, త్వరలోనే మన జనాభా పెరుగుదలను అరికట్టే మార్గాలు అన్వేషించకపోతే, యెన్ని ప్రాజెక్టులు నిర్మించినా, యెన్ని పరిశ్రమలు స్థాపించినా అవన్నీ వృథా అయిపోవడమేగాక, యీ సమస్య మనతలకు మించినదై కూర్చుంటుంది. ఈ విషయాలన్నిటినీ దృష్టిలో వుంచుకుని భారత ప్రభుత్వం ప్రథమ పంచవర్ష ప్రణాళికలోనే భారతజనాభా పెరుగుదల నరికట్టే మార్గాల నన్వేషించే భారాన్ని ప్రభుత్వ ఆరోగ్యశాఖ భుజంపైన వుంచింది. సంతాననిరోధ మార్గాల పరిశోధన నిమిత్తం, కుటుంబ నియంత్రణావశ్యకతను గూర్చి సలహాలనూ, సహాయాన్నీ యీయడం కోసం, సామాన్యప్రజల్లో సంతాన నిరోధకతావశ్యకతను ప్రచారంచేయడం కొఱకు, ప్రస్తుతం వున్న సంస్థల్లో సంతాననిరోధం, కుటుంబనియంత్రణాపద్ధతిని అమలుజరపడానికి ప్రభుత్వం భారీమొత్తాన్నే ఖర్చుచేయడానికి పూనుకుంది. కాని కొందరి దృష్టిలో ప్రభుత్వం యేమీచేయనట్టు కనబడుతుంది.

ప్రపంచ ఆరోగ్యసమితి సహకారంతో (రిథమ్ పద్ధతి) సహజకాల సంయమన పద్ధతి ననుసరించి రెండుపెద్ద ప్రణాళికల్ని భారతప్రభుత్వం ఆరంభించింది. అమలుజరపగానే యీపద్ధతివల్ల యెంతవరకు సంతాననిరోధం జరగగలదో అర్థమయింది. ఈ పద్ధతివల్ల కొంతమేలూ జరగకపోలేదు. భారతదేశ గ్రామాల్లో స్త్రీ, పురుషుల యిద్దరికీకూడా కుటుంబనియంత్రణవల్ల కలిగేలాభాలు తేలికగా చెప్పవచ్చునని రుజువైనది.

ఆరంభదశలో యివన్నీ తెలుసుకోడం అవసరం కావచ్చు కాని యింత మాత్రం కృషిచాలదు. ఈ 'సహజకాల సంయమన' పద్ధతివల్ల జనాభాని అరికట్టలేమని తేలిపోయింది.

కొద్ది సంవత్సరాలనుంచీ అధికంగా పండుతున్న పంటల్నిచూసి సంతోషంతో (మోసపోయి అంటే మంచిదేమో!) దినదినాభివృద్ధి చెందుతున్న పరిశ్రమల వల్లా, నిరుద్యోగసమస్య తీరిపోవడమేగాక, దైనందినజీవన ప్రమాణం పెరుగుతున్నదని తలచి ప్రభుత్వంకూడా పారిశ్రామికాభివృద్ధికోసమే పాటుపడుతున్నది గాని జననసంఖ్య పెరగకుండా తీసుకోవలసిన నిరోధక చర్యల ఆవశ్యకతను గుర్తించడంలేదు.

ప్రణాళికలు విజయవంతంగా కొనసాగుతున్నాయని మనంఅనుకున్నా, నేల యీనినట్లు పెరుగుతున్న యీ జనాభాను అరికట్టే విషయంలో, సంతాన నిరోధ పథకాల్ని అమలు పరచడం విషయంలో గట్టి ప్రయత్నాలు చేయకపోతే ఈకృషి అంతా వృథా అయిపోతుంది. ప్రభుత్వ ఆరోగ్యశాఖలో కుటుంబనియంత్రణకీయవలసిన ప్రాధాన్యం ఈయలేదుగాబట్టి యీ శాఖనుంచి కుటుంబనియంత్రణను

వేరుచేసి క్రొత్తమంత్రిత్వశాఖ ఏర్పాటుచేసి జనాభా విషయాలన్నీ దానిపైన ఉంచడం మంచిదని నాఅభిప్రాయం.

భారతదేశ ఆర్థిక, సామాజిక, మతసాంప్రదాయక విషయాన్ని దృష్టిలో వుంచుకుని, విపులంగా వైజ్ఞానిక శాస్త్రదృష్ట్యా యీ గ్రంథాన్ని రచించారు చంద్రశేఖర్‌గారు. వైద్య విషయాల్లోనూ, రాజకీయంగా, మానసికంగా పరిపాలనా విషయికంగానూ కూడా కుటుంబనియంత్రణను అమలుపరచడమెంత కష్టదాయకమో వారెరుగనిదికాదు. అయినా యేవో కొన్ని చిక్కులూ, యిబ్బందులూ వున్నాయని యీ విషయాన్ని అమలుజరపక అశ్రద్ధచేయడంవల్ల చాలాదారుణమైన ఫలితాలు కలుగుతాయని నొక్కిమరీ చెప్పవలసివస్తూంది.

కేవలం ఒక్క భారతదేశాన్నేగాక సర్వ ప్రపంచాన్నీ కలవరపెడుతున్న జనాభాసమస్యను గురించి వ్రాసి గ్రంథకర్తగారు గొప్పసేవచేశారు.

—జూలియస్ హక్స్లీ

# ఉ పో ద్ఘా త ం

ఈ గ్రంథం దక్షిణభారత పాఠకులకు అందుబాటులోకి వస్తున్నందుకు సంతోషం. మొదట ఇది వ్యాసరూపంలో, బొంబాయిలో జరిగిన ఒక సభలో నా అధ్యక్షోపన్యాసంగా తయారు చేయబడింది. పిమ్మట కొన్నాళ్ళకు, ప్రస్తుతరూపంలో లండన్, న్యూయార్కు నగరాల్లో (ఆంగ్లంలో) ప్రచురింపబడింది. మొత్తంమీద ఈ గ్రంథంలో చర్చించబడిన సమస్య అత్యంతక్లిష్టమైనది. ఇది మనదేశం లోని ఇతరప్రాంతాలవారందరికి వలెనే, దక్షిణభారతంలోని మనకు కూడా ముఖ్యమైన సమస్య.

మనకు జనాభా సమస్య అంటూ ఉన్నదా? మనదేశంలో ఉండ తగనంత జనాభా ఉన్నదా? - అంటూ ఇరవై సంవత్సరాలక్రిందట మనం చర్చించుకుంటూ ఉండేవాళ్ళం. ఇప్పుడీవిషయాలు మనం చర్చించవలసిన అవసరంలేదు. మనకు జనాభా సమస్య ఉన్నదని మనీషులంతా ఒప్పుకుంటున్నారు. ఒక వంక మన జనసంఖ్యకు వారి ప్రధానావసరాలకు, మరొక వంక మనకు, లభ్యమవుతున్న - ముందు ముందు అనుభవంలోకి తెచ్చుకొనడానికి వీలున్న - సౌకర్యాలకూ ఎక్కడా పొంతన కుదరడంలేదు. పైగా, ప్రజలందరికీ ఇప్పటికన్న ఎక్కువ జీవనసౌకర్యాలు కలుగజేయాలని, అవిధంగా మనకు ఉన్న ఆహార వస్త్ర వసతి విద్యా వైద్య సౌకర్యాలలో ప్రతివ్యక్తికి ఇప్పటికన్న ఎక్కువభాగం లభ్యంకావాలనీ ప్రస్తుతం మన ఆదర్శం. కాని, ఎప్పటికప్పుడు జనాభా పెరిగిపోతూండడంవల్ల, జీవనప్రమాణాలను వృద్ధిచేసుకొనడానికి మనం చేస్తూన్నప్రయత్నాలన్నీ వమ్మైపోతున్నవి. నేడు మన దేశపు జనాభా సుమారు ౪౨ కోట్లు. ఈమొత్తం సాలుకి

50 లక్షల చొప్పున పెరిగి పోతుంది. అంటే, ఒక ప్రక్కన మనం ఆహారోత్పత్తులను వృద్ధిచేసుకుంటున్నా, మరోప్రక్కన దానికోసం తెరుచుకొని ఉండే నోళ్ళసంఖ్యకూడా పెరిగిపోతూంది. ఆ విధంగా, మనం అధికంగా ఉత్పత్తిచేసిన ఆహారమంతా ఈ అదనంగా పెరుగుతున్న జనాభాకే సరిపోతూంది. అందువల్ల, మన జీవనప్రమాణాలు ఎప్పటివలె తక్కువ స్థాయిలోనే ఉండిపోతున్నవి. కనుక, మన జనాభా పెరుగుదలలను అదుపులో ఉంచుకొనడం, మన కుటుంబ పరిమాణాన్ని పరిమితం చేసుకొనడం అవసరమయింది. ఇదే కుటుంబ నియంత్రణ, ప్రస్తుతం, మనదేశంలో కేంద్రప్రభుత్వం, రాష్ట్ర ప్రభుత్వాలుకూడా ఈకుటుంబనియంత్రణ కార్యక్రమాలను శ్రద్ధగా అమలు జరుపుతూండటం శుభసూచన. కాని, ప్రజాసహకారం లేనిదే ప్రభుత్వాలు విజయం సాధించలేవు. కనుక, ఈదేశ పౌరులైన మీరు ఈసమస్యను గురించి శ్రద్ధగా యోచించి, మీ వ్యక్తిగత కర్తవ్యాన్ని మీరు. నిర్వహించాలి.

మద్రాస్,<br>4 - 9 - 1958.

ఎస్. చంద్రశేఖర్.

# విషయసూచిక

# ఒకటవ అధ్యాయం

## భారత జనాభా అభివృద్ధి

నేటి మానవుణ్ణి యెదుర్కొంటున్న గడ్డుసమస్యల్లోకల్లా ముఖ్య మైంది అనునిత్యం పెరిగిపోతున్న జనాభా సమస్య. వ్యక్తిగతంగా, జాతీయంగా, తుదకు అంతర్జాతీయంగాకూడా యీ సమస్య మానవుడి సాంఘికజీవితాన్ని బాధిస్తుంది. కుటుంబాల శాంతిసుఖాల కిదినొక నిరోధం. జాతి ఆర్థిక సాంఘిక జీవనాల కిది వొక అడ్డు. జనాభా సమస్యకీ, శాంతియుద్ధాలకీ సన్నిహితత్వం వుండడంవల్ల తుద కీసమస్య అంతర్జాతీయశాంతి భద్రతలకుకూడా బాధాకరంగానే వుంది.

స్వతంత్ర దేశాల్లోనూ, అభివృద్ధిజెందిన దేశాల్లోనూ, వలస దేశాల్లోనూ, వెనుకబడిన దేశాల్లోనూ - అన్ని దేశాల్లోనూ కూడా మిగిలిన ఆర్థిక సాంఘిక సమస్యలన్నిటికన్నా జనాభా సమస్యే యెక్కువ వొత్తిడి కలిగిస్తుంది. ఒక దేశంలో జనాభా అధికమయిందంటే (పండితులు దీన్ని యెలానిర్వచించినాసరే) ఆ దేశంలోవున్న సహజసంపదలకన్నా అధికం జనంవున్నారన్నా, లేదా, వున్నపదార్థాలకన్నా తినేవా రెక్కువ వున్నారన్నా వొకటే. సహజసంపదలులేవు; వున్నే నేల సరిపడదు; అందుచేత జనాభాసమస్య పుట్టిందన్నా, లేక సంతానాభివృద్ధివల్ల జీవనప్రమాణం తగ్గిపోతుందన్నా; కావలసినంతగా పారిశ్రామికాభివృద్ధి కావడం లేదన్నా; అన్నిటికీ మూలకారణం, సాంఘిక ఆర్థిక సమస్యలకు తావూ, పెరుగుతూన్న జనా

భాతోపాటు పెరగకుండావున్న జీవనప్రమాణమే కారణం. వీనికితోడు రాజకీయ ముద్రలూ, మతాల అడ్డులూ, నల్లా తెల్లా బేధాలూ, వలస యిబ్బందులూ, సాంస్కృతిక పు టడ్డులూ మొదలైన వింకా యెన్నో యీసమస్యని మరీ క్లిష్టం చేస్తున్నాయి. ప్రపంచ దేశాలన్నిటిలోనూ ముఖ్యంగా మన దేశంవంటి వెనకబడిన దేశాల్లో అమలుపరచబడే విద్యా ప్రణాళికా, గ్రామీణాభివృద్ధీ, ప్రజారోగ్య ప్రణాళికలు సత్ఫలి తాల్నివ్వకుండా చేస్తున్న దీజనాభావొత్తిడి సమస్యే!

ప్రపంచ చరిత్రలో యెన్నడూ యిప్పుడున్నంత జనాభా లేదు. క్రీ.శ. 1040 లో 540 మిలియన్లు వుండే జనాభా యిప్పుడు 2,547 మినియన్లయింది. ఇంతేగాక, సంవత్సరానికి ప్రపంచ జనాభా 25 మినియన్ల చొప్పున పెరుగుతూవుంది. 5 మిలియన్ల చొప్పున భారత దేశంలోనూ చైనాలోనే జనం పెరుగుతున్నారు. సంవత్సరానికి వాకశాతం 1% చొప్పున పెరిగినా యెప్పుడో భవిష్యత్తులోగాక మన యెదుటే మనబిడ్డల కాలంలోనే ప్రపంచజనాభా 4,000 మిలియన్లు అవుతుంది.[1]

అనుక్షణం పెరుగుతూన్న జనాభామాట అటుంచి, ప్రస్తుత ప్రపంచ జనాభా లెక్కల్లో రెండు ముఖ్యమైన విషయాలు మన దృష్టిలోకి వస్తాయి. అన్ని దేశాల్లోనూ, అన్ని జాతుల్లోనూ యీ సంతాన జననం ఒకేవిధంగా వుండక, . కొన్ని చోట్ల మరీ హెచ్చుగానూ, మరికొన్ని చోట్ల మరీ తక్కువగానూ కనబడుతుంది. . ప్రపంచంలో అధిక జనాభా వున్న దేశాల్లో (మన దేశం కూడా యిందులోదే) జనం పెరుగుతున్నంత త్వరగా జీవనప్రమాణం, ఆదాయం పెరగకపోవడం ఆందోళన

1. "జనాభా ఆధిక్యత కావశ్యమైన విషయాలూ, అవరోధాలూ దాని ఫలితాలూ" (న్యూయార్క్. యునైటెడ్ నేషన్స్, 1953) పే.160-161.

కలిగిస్తుంది. దినదినాభివృద్ధి చెందుతున్న విజ్ఞానశాస్త్రం వల్లా, అమలుజరపబడుతున్న ప్రణాళికలవల్లా, పారిశ్రామికాభివృద్ధివల్లా ప్రపంచంలో సగం మందికైనా తిన తిండీ, కట్ట బట్టా దొరకడం లేదు. చాలా పాశ్చాత్య దేశాల్లో ముఖ్యంగా ఆగ్నేయాసియా, లాటిన్ అమెరికా దేశాల్లో జనాభాసమస్య లేకపోగా అసలు సంతానజననమే తగ్గిపోయింది. కొన్ని దేశాల్లో వ్యవసాయాభివృద్ధికి బదులు నానాటికీ పంటలు క్షీణించిపోతున్నాయి.[1] సహజవాతావరణ పరిస్థితుల వల్లా, భూసారం తగ్గిపోయి పంటలు అధికం కాకపోవడంవల్లా జనం పెరిగినంతత్వరగా పంటలు పెరగడంలేదు.

ఇటీవల పెరుగుతున్నంత త్వరగా జీవనప్రమాణం, ఆదాయం పెరగక, యీ కొద్ది సంవత్సరాల్లో మరీ హెచ్చుగా పెరుగుతూన్న భారతజనాభాని చూస్తే యీవిషయం బాగా అవగత మౌతుంది. మిగిలిన దేశాల్లోకన్నా భారత దేశంలో జననసంఖ్య అధికంగా వుండే సావకాశాలు హెచ్చుగా వున్నాయి. దీనికి తోడు యిదివరకుకన్నా మరణసంఖ్యకూడా మన దేశంలో చాలా తగ్గింది. యితర దేశాల్తో పోల్చి చూస్తే మనదేశం యొక్క జీవనప్రమాణం చాలా తక్కువ. అందుచేత సంవత్సరానికి 5 మిలియన్లు జనమే పెరుగుతున్నా యితర దేశాల్లో వలెగాక మనం జాగ్రత్తపడవలసిన అవసరం వుంది. అసలే బీదదైన మనదేశం యిక యేమాత్రం జనం పెరిగినా మరీబీదదై పోవడమేగాక చాలా కష్టనష్టాల పాలౌతుంది.

---

1. "వ్యవసాయపరిస్థితి, తిండిగింజలు, 1953" (రోమ్ FAO, 1953), పే.1, విలియమ్‌వోగ్ట్, "రోడ్ టు సర్వైవల్" (లండన్, గొల్లాన్జ్; 1948).

భారత దేశంలో, ముఖ్యంగా పల్లెప్రాంతాల్లోనూ, పట్నాల్లోని మురికి ప్రాంతాల్లోనూ, సంతాన జననం మరీ అధికంగా వుంది. ప్రస్తుత దేశపరిస్థితుల ననుసరించి యింకా జనం పెరగడం యేమాత్రం క్షేమకరంకాదు.

ఆడామగా, పిన్నాపెద్దా అనే భేధం లేకుండా ప్రతీవానికి నిత్య జీవితావసరాలైన తిండీ, బట్టా, తలదాచుకునేచోటు, ప్రాథమిక ఆరోగ్యరక్షణా, అక్షరాస్యతా, పరిశ్రమా, విరామం మొదలైన వన్నీ వుంటే హిందూదేశంవంటి పెద్ద దేశంలో సంవత్సరానికి 4 లేక 5 మిలియన్లు జనం 10 సంవత్సరాలకి 50 మిలియన్లు జనం అధికం కావడం అంత గొప్ప విషయంకాదు. పైగా యింతహెచ్చు జనాభా వుండడం కూడా దేశానికొక పెద్దవుపయోగంగా నేవుండేది; కాని మన దురదృష్టవశాత్తు పెరుగుతున్న జనాభానిబట్టి నిత్యావసరాలూ, సంపదలూ పెరగడంలేదు గనక మన జీవనప్రమాణం పెరిగేంతవరకైనా మన జనాభా పెరగకుండా జాగ్రత్తపడవలసిన అవసరంవుంది. మనదేశ ఆర్థిక, సాంఘిక, సామాజిక పరిస్థితులవల్ల యీజనాభాని అరికట్టడమే గాకుండా ప్రపంచ పరిస్థితుల దృష్ట్యాకూడా యీపనిచేయడం యెంతో అవసరం.

### అధిక జనాభా

16 వ శతాబ్దంలో భారతదేశంలో 100 మిలియన్లు జనం వుండేవారు. 19వ శతాబ్దానికి 150 మిలియన్లు అయ్యారు. 1871 వ సంవత్సరంలో జనాభా లెక్కలు అంతంతమాత్రంగా తీసుకోబడినా అప్పటికే 254 మిలియన్ల పైచిలుకు జనం వున్నారు దేశంలో. 1931 సంవత్సరం లెక్కలనుబట్టి, అంటే

వైవెల్. లండన్ గొలాంజ్, 1948.

సుమారు 60 సంవత్సరాలకి (275.52 మిలియన్ల మైళ్ళ విస్తీర్ణంగల దేశంలో) 353 మిలియన్ల జనాభా వున్నారు. 1941 నాటికి 389 మిలియన్లు మంది జనం అయ్యారు. ఒక్క-భారత దేశంలోనే 314.88 మిలియన్లు మంది ప్రజవున్నారు. దీన్నిబట్టి 1931 సంవత్సరం కన్నా 15% శాతం జనం పెరిగారన్నమాట, లేదా 50 మిలియన్లు జనం అధిక మయ్యారన్నమాట. 1951 సంవత్సరానికి ప్రస్తుత భారతదేశ జనాభా 362 మిలియన్లు వుంది. 1941 వ సంవత్సరపు జనాభా పట్టీమీద 13.5% పెరుగుదల చూపుతుంది. 1941-1951 సంవత్సరాల్లో (314.88 విస్తీర్ణంగల విభక్త భారతదేశం) అంటే 10 ఏళ్ళలో 43 మిలియన్లుజనం పెరిగారట. పాకిస్థాన్, జమ్మూ కాశ్మీర్ మినహా, మనజనాభా 235.5 మిలియన్లు. అరశతాబ్దంలో 121.3మిలియన్లు లేదా నూటికి 5 మంది చొప్పున జనాభా పెరిగింది. ప్రస్తుత భారత జనాభా, పూర్వ ఐక్య భారత జనాభా, క్రింద పట్టీ చూస్తే తెలుస్తుంది.

మొదటి పట్టీ

భారత దేశపు జనాభా లెక్కలు 1901 — 1951

| సంవత్సరం | మిలియన్లు | క్రిందటిశతాబ్దంలో తగ్గా హెచ్చు | తగ్గా, హెచ్చు శాతంలో |
|---|---|---|---|
| 1901 | 235.50 | — | — 0.2 |
| 1911 | 249.05 | 13.55 | 5.8 |
| 1921 | 248.18 | 0.87 | — 0.4 |
| 1931 | 275.52 | 27.34 | 11.0 |
| 1941 | 314.88 | 39.36 | 14.1 |
| 1951 | 356.83 | 41.95 | 13.5 |

కాశ్మీరు జమ్మూల జనాభా 1951 లో 4.41 మినియన్లువుంది. అది యిందులో మినహాయించ బడింది.

రెండవ పట్టీ

విభజనపూర్వం భారతదేశం జనాభా లెక్కలు 1871 – 1951

| సంవత్సరం | మిలియన్లలో | శాతం |
|---|---|---|
| 1867-72 | 203.4 | — |
| 1881 | 250.1 | 0.9 |
| 1891 | 279.4 | 11.8 |
| 1901 | 283.9 | 1.5 |
| 1911 | 303.0 | 6.8 |
| 1921 | 305.7 | 0.9 |
| 1931 | 338.1 | 10.6 |
| 1941 | 389.0 | 15.0 |
| 1951 | — | — |

1951 మార్చినెలనాటికి భారతదేశం జనాభా 361.8 మిలియన్లు వుంది. 1.27 మిలియన్ల మైళ్లు విస్తీర్ణంగల జమ్మూ కాశ్మీరు యొక్క జనాభా 4.41 మిలియన్లు అని అంచనా వేయబడింది. ప్రభుత్వాధికారం, అజమాయిషీ చాలాకొద్దిగా వుండడంవల్ల అస్సాంలోని నాగజాతివారు 1.56 మిలియన్లు వుంటారని అంచనా వేయబడినా 1951 సంవత్సరపు జనాభా లెక్కల్లో వీరిని కలపలేదు.

1951 జనాభా లెక్కల ప్రకారం 92,780 చదరపు మైళ్ళ

విస్తీర్ణం గల జమ్మూ కాశ్మీరులను మినహాయిస్తే యీక్రింది విధంగావుంది జనాభా.

| విభజన | మొత్తం |
|---|---|
| 1951 లో మొత్తంజనసంఖ్య | 356,829,485 |
| 1941 ,, ,, (ప్రస్తుత విస్తీర్ణానికి మదించబడింది) | 314,766,380 |
| 1941—1951మధ్యఅధికమైనసంఖ్య | 42,063,105 |
| దశాంశపద్ధతిని అధికమైన సంఖ్య | 12 5% |
| శాత ప్రకారం అధికమైనసంఖ్య | 13.4% |
| మొత్తం వైశాల్యం | 1.18 మిలియన్ల చ॥ మైళ్ళు |
| సాంద్రత 1951 సం॥లో | 303 మంది చొప్పున చదరపు మైలుకు జనం వున్నారు. |

భారత దేశంలో జనం మరీ హెచ్చుగా పెరుగుతున్నట్లు కన పడినా, నిజానికిది యేమంత అధికమైంది కాదు. 1872-1941 మధ్య జనాభా లెక్కల్ని చూస్తే నూటికి 54 మంది పెరిగినట్లు కనబడుతుంది. అమెరికాలో నూటికీ 56 మందీ, జపానులో నూటికీ 136మందీ జనం అధికమయ్యారు. దీన్నిబట్టి చూస్తే మనజనాభా పెరుగుదలఆట్టే హెచ్చు కాదని తేలుతుంది. ఈఅభివృద్ధికూడా యెప్పుడూ వొకేవిధంగా లేదు. ఇటీవల మరణసంఖ్య చాలా పడిపోవడంవల్ల కూడా జనాభా అధికమైనట్లు కనబడుతుంది. యుద్ధాలూ, కరువుకాటకాలూ తగ్గిపోవడంవల్లకూడా జనాభా లెక్కల్లో మార్పువచ్చింది. సాధారణంగా యుద్ధంవంటి వుప ద్రవాలున్నప్పుడు జనాభా తగ్గిపోవడం, యిటువంటి వేవీ లేనప్పుడు జనాభా పెరిగినట్లు కనబడడం మామూలు. సంతాన నిరోధంవల్ల జనాభాసంఖ్యలో యేవిధమైన మార్పూరాలేదు.

1901 సంవత్సరం వరకూ మనజనాభా లెక్కల్లో అట్టే గుర్తుంచుకోవలసిన మార్పులేమీ జరుగలేదు. 1891-1921 మధ్యకాలంలో మాత్రం జనాభా విపరీతంగా పెరిగిపోయింది. ఈ 30 సంవత్సరాల్లోనూ 12,200,000 జనం పెరిగారు. కాని తరువాత 30 సంవత్సరాల్లోనూ, అంటే 1921-1951 మధ్యకాలంలో 10.6%, 15%, 13.4% శాతం మాత్రమే పెరిగింది. అంటే సంవత్సరానికి 1.4% శాతం లేదా 27,400,000 మంది జనం అధికమయ్యారన్నమాట. 1891-1921 మధ్య కాలంలో పెరిగిన జనంకన్నా 1921-1951 మధ్య పెరిగినజనం రెట్టింపు. ఆరోగ్యశాఖవారిచే అనారోగ్య నిరోధక చర్యలు అమలుజరుపబడి, కరువుకాటకాలుగాని లేకపోతే 1961 సంవత్సరం నాటికి మనజనసంఖ్య మరీ పెరిగిపోతుంది.

అనుదినం పెరుగుతున్న జనాన్నిగురించి భారతదేశంలోనే ఆలోచించి పరిష్కరించాలిగాని, సంవత్సరానికి యెంతశాతం అధికమౌతున్నదన్న విషయం గురించిగాదు మనం విచారించాల్సింది. ఇంగ్లాండు వేల్సు దేశాల మొత్తం జనాభా కన్న హెచ్చుగానే మనజనాభా పెరుగుతూవుంది. 10% లేక 15% నూటికి పెరిగినా, సంవత్సరానికి జర్మనీ, రష్యాల మినహాయించి యూరపుదేశంయొక్క జనాభాఅంత (అంటే 50 మిలియన్లు) జనం మనదేశంలో అధికంగా పుడుతున్నారన్నమాట. 1931-1941 లెక్కల్ని, అతి నెమ్మదిగా పెరుగుతున్న మనదైనందిన జీవనప్రమాణాన్నీ పోల్చి చూస్తే, యీ జననసంఖ్య చాలా భయంకరమైన సమస్యలకు దారితీస్తుందని తోస్తుంది. మనిషి సగటు ఆదాయం అధికం చేయాలని ప్రభుత్వం

చేస్తున్న కృషీ, ప్రభుత్వ ఆరోగ్యమంత్రిత్వశాఖ గ్రామీణపున రుద్ధారణకై చేస్తున్న ప్రయత్నాలూ అన్నీకూడా దినదినం పెరుగుతున్న మనజనాభావల్ల బూడిదలో పోసిన పన్నీరులా రాణించే అవకాశాలు లేకుండా పోతున్నాయి. ప్రస్తుత విషమ పరిస్థితులవల్ల భారతజాతి జీవనప్రమాణం అధికం చేయాలని పడుతున్న పాట్లకూ, పెరుగుతూన్న జనాభా లెక్కలకీ యెక్కడా సామరస్యం కుదరడంలేదు.

## సంతానజనకశక్తి

ఒక దేశంలోవున్న సంతానజనకశక్తిమీదే, జనాభాకి సంబంధించిన సమస్యలు ఆధారపడి వుంటాయి. ఈశక్తి అన్ని దేశాల్లోనూ వొకే విధంగా వుండదు. ఆయా దేశకాల పరిస్థితుల్నిబట్టి యీ జననశక్తికూడా మారుతూ వుంటుంది. భారత దేశంలో సంతాననిరోధాన్ని అమలుపరచడానికి అన్ని ప్రాంతాలకూ వొకేవిధమైన ప్రభుత్వప్రణాళికలు పనికిరాక పోడానికి కారణం, దేశంలోవున్న ఆర్థిక, సాంఘిక, సాంప్రదాయిక, నైతిక, మత, సాంస్కృతికమైన విభేధాలే కారణం.

వెయ్యిజనానికి వున్న సంతానజనకశక్తి ననుసరించి జనాభా లెక్కలు దామాషాగా తీసుకోబడ్డాయి. ఒకేజాతిలో లేక సంఘంలో పెళ్ళిచేసుకుంటున్న వారందరి వయసూ వొకటే అయితే, వారికి పుట్టే బిడ్డలుకూడా వొకే కాలంలో పుట్టడం తటస్థపడితే మనం తీసుకుంటున్న లెక్కలకి కొంతవరకూ అర్థముంటుంది. కాని పైచెప్పిన విషయాలు యెప్పుడూ, యెక్కడా వొకేలా వుండడం సంభవించదు. అందుచేత

సంతానజనన, మరణసంఖ్యల్ని బట్టి కాక మనలెక్కలు సంతా నానికీ సంతానానికీ మధ్య వున్న తేడాలనూ, ఎంతెంత వ్యవధిలో సంతానం కలుగుతున్నారో అన్న విషయాల్ని బట్టి లెక్కలు తీసుకోవడం మంచిది.

1,000 మంది స్త్రీలలో 15-45 యేళ్ళ మధ్యవయసు గలిగిన వారికి పుట్టిన ఆడపిల్లల సంఖ్యను తీసుకుంటే యీ లెక్కలు సరిగ్గా వుంటాయి. ఆడపిల్లల్ని కంటున్న ఆడవాళ్ళ వయసులో కొద్ది తేడాలున్నా జనాభా లెక్కలకి యీ లెక్కలే దగ్గిరిగా వుంటాయి. ఒకే వయస్సులో వున్న 1,000 మంది ఆడవాళ్ళకి ఒకే సంవత్సరంలో పుట్టిన ఆడపిల్లల్ని లెక్కతీసుకుంటే సరియైన 'సంతానజననశక్తి' (Specific Fertility) తెలుస్తుంది. 20 సంవత్సరాలున్న స్త్రీల సంతానశక్తీ, 30 ఏళ్ళు వున్న స్త్రీ సంతానశక్తికీ తేడా వుంటుంది. అందుచేత అన్ని వయస్సులలో వున్న స్త్రీల సంతానశక్తీ తీసుకుని మొత్తంచేస్తే, దేశంలోని అసలు 'సంతానజననశక్తి' యెంత వుందో తెలుతుంది. దీన్నే వేరేమాటల్లో చెప్పితే ఒక స్త్రీ తన జీవితకాలంలో ఎంతమంది బిడ్డల్ని కనగలదో తెలిపే దాన్నే 'సంతానజననశక్తి' అంటారు.

దురదృష్టవశాత్తు, రకరకాల లెక్కలు తీసుకుని అంచనాలు వేయడానికి వీలైన పరిస్థితులు మన భారతదేశంలో లేవు. అందుకని సదుపాయం కోసం, వొక స్త్రీకి తన జీవితంలో పుట్టిన ఆడపిల్లల సంఖ్యగాక మొత్తం పుట్టిన పిల్లల సంఖ్య లెక్కల్లోకి తీసుకుంటే బాగుంటుంది. కాని 20—25, 30—35 మధ్యవయసులో వున్న స్త్రీల సంతానజననశక్తిలో కూడా

తేడా వుంటుంది. తిరువనంతపురం, కొచ్చిను రాష్ట్రాల్లో 1951 సంవత్సరంలో తీసుకున్న జనాభా లెక్కల్లో యీ విషయమై కూడా కొంత తెలుసుకోబడింది. పిల్లలు పుట్టడం ఆగిపోయి, లెక్కలనాటికి బ్రతికి, భర్తగలిగివున్న 45 యేళ్ళ స్త్రీల 'సంతానజననశక్తి' 1951 వ సంవత్సరంలో తిరువనంతపురంలో తీసుకుంటే వొక్కొక్కరికీ 6.6 మందిపిల్లలు పుట్టారనీ, అందులో యిద్దరు లెక్కలకు పూర్వమే చనిపోయారనీ, లెక్కలనాటికి 4.6 మంది బతికి వున్నారనీ తేలింది. ఈ లెక్కలు భారత దేశాని కంతటికీ వర్తిస్తాయా అన్నది సమస్య. పైగా అన్ని చోట్లా పుట్టిన పిల్లలింత హెచ్చుగా పోతారా అన్నదికూడా తేలని విషయమే!

భారత దేశంలో లెక్కలు సరియైనవి కావనీ, సరియైన లెక్కలు తేలే సావకాశాలు లేవనీ, వూహించి వాటిని కొంత వరకూ సరిచేసిన, తరువాత లెక్కల్ని బట్టి చూస్తే భారత దేశంలో 1,000మందికీ 35 లేక 45మంది పిల్లలు పుడుతున్నారని తేల్తుంది. 1941-50 సంవత్సరాల్లో అంటే యీ10యేళ్ళలోనూ 1,000 మందికీ 40 మందే పిల్లలు పుట్టారు. దీనితరువాత లెక్కల ప్రకారం 1,000 కి 27.2 పుట్టుకలే వున్నట్లు కనబడుతుంది. మన దేశంలో బిడ్డ పుట్టగనే రిజిస్టరు చేయడంగాని, చేయించు కోడంగానీ యింకా బాగా అమలులోకి రాలేదు. భారత ప్రభుత్వాధికారులు మొత్తం దేశంమీద 1,000 కి 40 పుట్టుక లున్నాయని 1950 సంవత్సరపు లెక్కల్లో రికార్డు చేశారు. ప్రాంతీయ భేదాల్ని బట్టి కొన్నిచోట్ల 1,000 కీ 36—44 మధ్యే పిల్లల సంఖ్య వుండవచ్చు. మధ్యభారతంలో 1000 కీ 44

మంది వుంటే దక్షిణ భారత దేశంలో 1,000 కీ 36 మంది వున్నారు. మన జననసంఖ్యతో పోల్చి చూస్తే యీజిప్టులో 1950 వ సం॥ లో 44.4, 1953 సం॥లో పాలస్తీనా 'జ్యూస' (Jews) లో 31.8, 1953 సం॥లో పోర్టోరికోలో 35.1, 1953 సం॥లో బ్రెజిల్‌లో 42 మందీ, 1952 సం॥లో మెక్సికోలో 43.9 మందీ పిల్లలు పుట్టారు.

మూడవ పట్టీ

భారత దేశంలో జనన మరణ పట్టీ, 1901 – 1950

| | రిజిస్టరు అయిన | | బతికున్నవారి లెక్కలనుబట్టి వెనక్కి లెక్కలు కట్టే పద్ధతిని | |
|---|---|---|---|---|
| | జననాలు | మరణాలు | జననాలు | మరణాలు |
| 1901-10 | 37 | — | 48.1 | 42.6 |
| 1911-20 | 37 | 34 | 49.2 | 48.6 |
| 1921-30 | 33 | 26 | 46.4 | 36.3 |
| 1931-40 | 34 | 23 | 45.2 | 31.2 |
| 1941-50 | 28 | 20 | 39.9 | 27.4 |

ప్రపంచపు సగటు జననసంఖ్యకన్నా భారత దేశపు జననసంఖ్య అధికంగాలేదు. కాని గత 50 సంవత్సరాల్లోనూ యీ సంఖ్య యేమాత్రం తగ్గకపోవడమే గమనించతగ్గ విషయం. పైనున్న పట్టీచూస్తే క్రిందకి చూసినకొద్దీ సంఖ్యలు తగ్గినట్టు తెల్ల మవుతాయి. అధికారుల నిర్లక్ష్యంవల్లా, సరియైన లెక్కలు తీసుకోబడక పోవడంవల్లా యీజననసంఖ్య తగ్గిందో లేక వాస్త వంగానే యీసంఖ్య తగ్గిపోయిందో, లేదా పెద్దసంఖ్యలవల్ల

మొత్తం తగ్గినట్లుందో, యేదో యిదమిత్థంగా చెప్పడానికి వీల్లేకుండా వుంది.

ప్రపంచ పట్టణ పల్లె ప్రాంతాల్లో జనాభా లెక్కలు యెలా వున్నాయో, భారత దేశపు పల్లె పట్టణ ప్రాంతాల్లోనూ అలాగే వున్నాయి, ఏదో కొద్దిమార్పుతో! పాశ్చాత్య దేశాల్లో మొదట పట్టణ ప్రాంతాల్లో జననసంఖ్య తగ్గింతరువాతనే చాలాకాలానికి పల్లె ప్రాంతాలలో జనన సంఖ్య తగ్గడం మొదలుపెట్టింది. పట్టణ ప్రాంతాల్లో జననసంఖ్య తగ్గిపోడానికి కారణం, కుటుంబ నియంత్రణ అన్నిప్రాంతాల్లో హెచ్చుగా అమలు జరపడమే నని అభిప్రాయపడుతున్నారు. ముందు ముందు భారత దేశంలో కూడా యిలా జరిగితే జరుగవచ్చునేమో గాని ప్రస్తుతం మాత్రం యిది నిజంగాదు. పట్టణ ప్రాంతాల్లో స్త్రీలజనసంఖ్య తక్కువగా వుండడం, పల్లెలనుంచి తమ భార్యల్ని పట్టణాలికి కాపరానికి తీసుకురాకపోవడమే మన పట్టణ ప్రాంతాల్లో తక్కువజనం వుండడానికి కారణాలు. పల్లెల్లో యే కరువో కాటకాలోవస్తేతప్ప అక్కడిజనం సాధారణంగా పట్టణాలికి రారు. అందుకని సర్వసాధారణంగా భార్యాపిల్లలు వెంట లేకుండానే వస్తూంటారు. పల్లెల్లో మళ్ళీ వ్యవసాయ సదుపాయాలు హెచ్చితే తిరిగి యీరకం పారిశ్రామికులు, వ్యవసాయానికీ, పశుసంపద పెంచుకోడానికి తిరిగివెళ్ళిపోతూవుంటారు. పట్టణాల్లో మరణసంఖ్య రిజిస్టరు కాకపోవడంవల్లకూడా పట్టణ పల్లె జనాభాలెక్కల తేడాకి కారణం కావచ్చు. అందుచేత యీ తేడా సంతాన నిరోధంవల్ల వచ్చిందో మరే యితర కారణాలవల్ల వచ్చిందో చెప్పలేం. 1951 జనాభా లెక్కలు

తీసుకున్న కమీషనరు ఆనాటికి వొకబిడ్డ తల్లి అగు పుణ్య స్త్రీగా వున్న స్త్రీలనందర్నీ యీ లెక్కల్లోకి తీసుకొని, అప్పుడు పల్లె పట్టణాల మధ్య వున్న తేడా కట్టినట్టు చెప్తున్నారు. ఇదివరలో చెప్పినట్లు తిరువనంతపురం కొచ్చిన్ పల్లె ప్రాంతాల్లో జననసంఖ్య 6.6 వుంటే, పట్టణాల్లో 6.4 జనన సంఖ్య మాత్రమే వుంది. పల్లె పట్టణాల జననసంఖ్యలో హెచ్చు తేడాలేదు కాబట్టి యీ తేడానంత యెక్కువ లెక్క చేయ నవసరం లేదనికూడా వారు చెప్పారు.

ఆదాయాన్నీ, వృత్తివ్యవస్థనీబట్టి జననసంఖ్య తీస్తే, అధిక ఆదాయం కలవాళ్ళకి తక్కువమంది పిల్లలుంటారని తేలింది. సర్వసాధారణంగా అధిక ఆదాయం గలవాళ్లు యెక్కువ విద్యావంతులూ, పెద్దవుద్యోగులూ, హెచ్చు డబ్బుకలవాళ్లు కావడంవల్ల వారి జీవనప్రమాణం కూడా హెచ్చుగానే వుంటుంది. వీరికి తక్కువ సంతానం కలగడానికి కారణం సంతాన నిరోధమేనని చెప్పడానికి వీల్లేదు. ఈవిషయంలో సరియైన లెక్కలు లేకపోయినా యీ తక్కువ జననాలకి కారణం విధవావివాహాలు లేకపోవడమే చాలావరకూ నని వూహించవచ్చు. ధనవంతుల కుటుంబాల్లో వితంతు వివాహాలు నిషేధం గనక చాలామంది వయసులోవున్న స్త్రీలు తమ సహజ మాతృధర్మాన్ని వహించడానికి వీల్లేకపోతుంది. తక్కువజాతి కుటుంబాల్లో వితంతు వివాహాలూ, విడాకులూ నిషేధాలు కాకపోవడంవల్లకూడా జననసంఖ్య అధికంగా వుండి వుండవచ్చు. హెచ్చుజాతి కుటుంబాల్లో వితంతోద్వాహం, విడాకులూ లేకపోయినా ధనాధిక్యతవల్ల జీవన ప్రమాణం

హెచ్చుగా వుండడం, దానివల్ల ఎక్కువకాలం బతికి మరణ సంఖ్య తగ్గిపోవడం మామూలు. ఎక్కువ జాతివాళ్ళకు ఆర్థిక స్తోమత హెచ్చుగా వుండడంవల్ల మగవారేగాక, అన్నివయసులవాళ్లూ హెచ్చుకాలం బతకడం, వారుసంసార సుఖం అనుభవించడం, హెచ్చుమందిబిడ్డల్ని కనడంకూడా జరగవచ్చు.

ఎక్కువజాతి స్త్రీలలో 15-45 మధ్యవయసులో వున్న పుణ్యస్త్రీలకు హెచ్చుమంది పిల్లలువుండే సావకాశాలు హెచ్చుగా వున్నాయని దీన్నిబట్టి తేలుతుంది. వీరిలో వితంతు వివాహాలు లేకపోయినా, పెండ్లిచేసుకున్నవారు ఆర్థికస్తోమత వల్ల హెచ్చుకాలం బతుకుతూవుండడంచేత, ఎక్కువమంది వితంతువులయ్యే అవకాశాలు కూడా తక్కువగా వున్నాయి. ఇక రెండో విషయమేమంటే, తక్కువజాతి వారిలో వితంతువులసంఖ్య అధికంగా వున్నా వారు తిరిగి పెళ్ళిచేసుకునే అవకాశాలు హెచ్చుగావున్నాయి. కాబట్టి వారిలో సంతానం కూడా హెచ్చుగా వుంటుంది.

### సంతానాధిక్యతకూ లేమికీ కొన్ని కారణాలు.

| అధిక సంతానం | తక్కువసంతానం |
|---|---|
| 1. బాల్యవివాహాలు. | 1. ఆలస్యంగావివాహం చేసుకోవడం. |
| 2. తక్కువ మరణసంఖ్య. | 2. అధిక మరణసంఖ్య. |
| 3. పెళ్లిచేసుకొన్నవారి మరణ సంఖ్య తగ్గడంవల్ల వితంతువులుతగ్గడం. వయసుముదిరిన పిదప వితంతువులు కావడం. | 3. ఆరోగ్యరక్షణా, జీవనప్రమాణం అధికం చేసుకోవాలనే కోర్కెవల్ల కుటుంబ పరిమితి కావాలనే కోర్కె హెచ్చుగా వుండడం. |
| 4. ఆర్థికపరిస్థితులబాగువల్ల జీవనప్రమాణం అధికమై హెచ్చుమంది సంతానంకలిగే సావకాశాలు వున్నాయి. | 4. కొత్తపన్నులేసేప్పుకో డానికి హెచ్చుకాలం వినియోగించడంవల్లా పెద్ద పెద్ద చదువులవల్లా. |

| | |
|---|---|
| 5. చంటిపిల్లలా, పిల్లలూ మరణ సంఖ్యతక్కువగా వుండడం. | 5. నాగరికత అధికం కావడం. |
| 6. వితంతువివాహాలపై నిషేధం పోయి, వితంతు వివాహాలు చేయడానికి ప్రోద్బలం ఈయడం. | 6. సంతాన నిరోధ ఆకాంక్షే కాక, దాని నిరోధనకు కృత్రిమ సాధనాలూ, స్వాభావిక విధానం, సురక్షిత కాలవిధానం మొదలైనవి అమలులో పెట్టడం. |
| 7. మత, సాంస్కృతిక, సాంప్రదాయక నియమాలు పూర్వమంతగా లేకపోవడం. | |
| 8. కుటుంబనియంత్రణా, సంతాన నిరోధం పాటించకపోవడం. | |

---

అధికసంతానప్రాప్తికీ, సంతాన అవరోధానికీ మధ్య చెప్పుకోతగ్గ కారణాలులేవు. ఏవో కొన్ని ప్రాంతాల్లో కొద్దిగా జనసంఖ్య తగ్గిపోవడంవల్ల, అదే పెద్ద చిక్కుసమస్యగా తయారయ్యే అవకాశం భారతదేశంలో లేకపోగా దీనివల్ల మొత్తం జనాభాకూడా అట్టే యెక్కువగా తగ్గదు. ఆర్థిక సాంఘిక పరిస్థితు లీవిధంగానే యికముందూ వుంటే, సంతాననిరోధం వల్ల యేర్పడే బాధలు మనల్ని బాధపెట్టవుగాని, పుట్టిన పసికందుల మరణసంఖ్య మాత్రం మనల్ని చీకాకుపెట్టి తీరుతుంది. భావిభారత భాగ్యోదయం కోరేవారందరూ, యీవిషయాన్ని గుర్తుంచుకోవాలి.

కొన్ని ప్రాంతాల్లో జరిపిన పరిశోధనలవల్లా, సరియైన లెక్కలు తేలకపోవడంవల్లా, వున్న జనాభాలెక్కల్నిచూసీ, భావిలో మనదేశంయొక్క (fertility) సంతానాభివృద్ధి యెలావుంటుందో చెప్పడం కష్టం. సరియైన లెక్కలు తేల్చ

దల్చుకున్నవారు, పక్కపేజీలో యిచ్చిన జనన మరణ సంఖ్యా మాత్రం దృష్టిలో వుంచుకోక తప్పదు.

## మ ర ణ స ం ఖ్య

గతశతాబ్దంలోవున్న జనన మరణసంఖ్య నూసిగాని ప్రస్తుత జనాభాసంఖ్య తేల్చగూడదు. సాధారణంగా మరణసంఖ్యని నిర్ణయించేవి, కరువుకాటకాలూ, యుద్ధాలూ వాటివల్లకలిగే అనర్థాలూ (యివి గత అరశతాబ్దంలో అట్టేలేవు.) సాధారణపరిస్థితుల్లోకూడా, ప్రజారోగ్యంపట్ల నిర్లక్ష్యంచేతా, పుష్టికరమైన ఆహారం లభించకపోవడంవల్లకూడా మరణసంఖ్య హెచ్చుగానే వుంటుంది. అనావృష్టీ, అతివృష్టీవల్ల పంటలు లేక కరువులేర్పడికూడా మరణసంఖ్య అధికమౌతుంది. నిజం చెప్పాలంటే నిన్నమొన్నటివరకూ మనదేశంలో మరణ సంఖ్యని నిర్ణయించేవి ముఖ్యంగా కరువుకాటకాలే! భారత దేశంలో 1000 కి 30 మంది చచ్చిపోతున్నారు. వుద్యోగులు సరియైన లెక్కలు తీసుకునే పరిస్థితులు లేకపోవడంవల్ల యీ అంకెలు సరియైనవి కావు అని చెప్పక తప్పదు. 1941–50 మధ్య సంవత్సరాల లెక్కలు తీసుకుని వాటి సగటు తీసుకుంటే వెయ్యికి 27 మంది చనిపోతున్నారని తేలింది. కొన్ని ప్రాంతాల్లో యీ సంఖ్యకు మించీ, కొన్నిప్రాంతాల్లో దీనికి తక్కువగానూ మరణసంఖ్య వుండవచ్చు. మధ్యప్రదేశ్‌లో 1000 కి 34 మరణసంఖ్య అయితే దక్షిణ భారతంలో 21 మంది మాత్రమే చనిపోతున్నారు. ప్రతీయేడూ మన దేశంలో మొత్తంమీద 10 మిలియన్లు మంది జనం చచ్చిపో

తున్నారు. వయసు వచ్చినవారి మరణసంఖ్యే యింతవుంటే, పసిపిల్లల మరణసంఖ్య చూస్తే మరీ భయంకరంగా వుంటుంది. భారతదేశపు మరణసంఖ్యని చూస్తే కనిపించేవి ముఖ్యంగా మూడు భయంకర విషయాలు; అందులో వొకటి పసిపిల్లల చావులు, రెండోది, ప్రసవించలేక పోయే స్త్రీల సంఖ్య, మూడోది ప్రసవానంతరం, పిల్లల్ని కనే వయసులో పోయే వారి సంఖ్యా!

భారతదేశంలో పుట్టే ప్రతీ 10 మంది పిల్లల్లోనూ సంవత్సరం తిరగకుండానే వొకరు పోతున్నారు. ప్రతీ 1000 మందికీ 116 మంది పిల్లలు గత అరశతాబ్దంలో చనిపోతూవుండేవారు. 1951 వ సంవత్సరంలో పసిపిల్లల మరణాలు చాలా తగ్గినా 1918 వ సంవత్సరంలో మాత్రం 1000 కీ 261 మంది పిల్లలు పోయారు. 1900 సంవత్సరంలో 232 పోతే 1951 సం॥ నాటికి సరిగా దానిలో సగం అంటే 116 మరణాలే వున్నాయి. వేల్సు దేశంలో వెయ్యికీ 154 మరణసంఖ్య 1900 సం॥ నాటికి వుంటే, 1951 నాటికి ఆసంఖ్య 30 వరకూ తగ్గించబడింది. అలాగే అమెరికాలో 1900 సంవత్సరంలో 122 మరణసంఖ్య అయితే 1951 సం॥ నాటికి 21 కి దిగిపోయింది.

పసిపిల్లల మరణాలు రెండు రకాలు. పుట్టగానే, పురిటిలోనే పోయేవారు మొదటి తెగకి చెందుతారు. సంవత్సరం వరకూ పెరిగి పోయేవాళ్ళు రెండవ తెగకు చెందుతారు. మొదటి తెగకు చెందిన పిల్లలు, గర్భంలో వున్నప్పుడే తగిన సంరక్షణలేక, పుట్టినతరువాతకూడా సంరక్షింపబడకా, పోతూవుంటారు. ఇక రెండవ తెగకు చెందిన పసిపిల్లలు చని

పోడానికి చాలా కారణాలే వున్నాయి. ప్రసవించిన తరువాత తగిన జాగ్రత్తలేకపోవడం వొక కారణం కావచ్చు, రెండవది పాలు సరియైన పద్ధతిలో పోయకపోవచ్చు, మూడు స్రావిరి తిత్తులూ, కడుపూ చెడిపోయి పోవచ్చు, లేదా వాతావరణ పరిస్థితులు సరిగా లేకా పోవచ్చు, అంటురోగాలవల్లకూడా పోయే అవకాశాలున్నాయి. మన దేశంలో పసిపిల్లల అధిక మరణాలకు పై మూడు కారణాలే గాక యింకా యితర కారణాలుకూడా వున్నాయి. ముఖ్యంగా గర్భిణీస్త్రీకి సరియైన తిండిలేకపోవడం, ఆవిడ తీసుకోవలసిన సంరక్షణ తీసుకోక పోవడం, అసలు యెలాంటిజాగ్రత్త అవసరమోకూడా యెరక్క పోవడం, యెప్పుడూ వైద్యులకు చూపించుకోకపోవడం; తెలిసీ తెలియని మంత్రసానులూ, దాయీలు గర్భిణీస్త్రీకి సలహాలివ్వడం, నాటుమంత్రసాన్లు కాన్పు చేయడంవల్లకూడా పసిపిల్లల మరణసంఖ్య అధికమౌతున్నాయి. పసిపిల్లల మరణ సంఖ్యనే ప్రమాణంగా తీసుకుని ప్రజారోగ్య ప్రణాళికలూ, శుభ్రతా, సంక్షేమ ప్రణాళికల విలువ నిర్ణయించితే మన దేశం యెంతో వెనకబడి వుందని చెప్పకతప్పదు. యితర దేశాల్లో అంటే 1952వ సం॥లో నార్వేలో నూటికి 22, న్యూజిలాండ్‌లో 22, స్వీడనులో 20, హాలెండులో 22 వరకూ మరణసంఖ్య తగ్గిపోయింది; అల్లాగే మన దేశంలోకూడా తగ్గి పోయే సావకాశాలు లేకపోలేదు.

మన దేశంలో ప్రసవకాలంలో మరణాలుకూడా చాలా దారుణంగా వున్నాయి. అక్కడక్కడా జరిపిన నమూనా

పరిశోధనా సంఖ్యలవల్ల వెయ్యికి 23.5[6] స్త్రీలు ప్రసవకాలంలో పోతున్నారని జనాభాల డైరెక్టరు జనరలుగా పనిచేస్తున్న శ్రీ జాన్ మిగా గారన్నారు. దీనివల్ల 1000 మంది ప్రసవాల్లో 25 మంది స్త్రీలు చనిపోతున్నట్లు తేలింది. ఇదే విషయాన్ని వేరుగా చెప్తే మనదేశంలో ప్రతీ సంవత్సరం 200,000 స్త్రీలు ప్రసవించలేక చనిపోతున్నారని చెప్పవచ్చు.

సంవత్సరానికి 1000 పిల్లల్లో 27 మరణాలైతే అందులో 7 గురు సంవత్సరం లోపునా 11 మంది 5 ఏళ్ళ లోపునా పోతున్నారు. 100 కి 50 మందిపసిపిల్లలు 10 ఏళ్ళ లోపు వాళ్ళు మనదేశంలో చచ్చిపోతూంటే యింగ్లాండు, అమెరికా, వేల్సు దేశాల్లో 100 కి 12 మంది మాత్రమే పిల్లలు చచ్చిపో తున్నారు. జన్మిస్తున్న 100 మంది చంటిబిడ్డల్లోనూ 50 మంది చనిపోతూవుంటే అందులో సగంమందికి పైగా నెల లోపులో పోతున్నారు. 5 యేళ్ళు వచ్చేప్పటికి 40 మందిని యేరోగిమో తనపొట్టని పెట్టుకుంటే 20 యేళ్ళు వచ్చేప్పటికి మిగిలేది 100 కి 50 మంది మాత్రమే! 60 యేళ్ళు పైబడేవరకూ బతికి వుండేది 15 మందికన్నా యెక్కువ వుండరు.

---

6 "సర్ జాన్ మిగా" గారు భారతీయ గ్రామీణ జనాభా లెక్కల్ని గురించి జరిపిన పరిశోధన (ఢిల్లీ 1933) పేజి63. డాక్టరు జె. జహాంగీరు గారి అభిప్రాయప్రకారం బొంబాయిపట్టణంలో 1937 సం॥లో 1000 కి 13.5 మంది ప్రసవించి పోయారనీ గర్భిణీగావున్నప్పుడు చనిపోయినా, ప్రసవానంతర ప్రసవవేదనవల్ల కొద్దికాలానికిపోయినా లేదా ప్రసవానికిసంబంధించినటువంటి రోగంవల్లచచ్చిపోయినా ప్రసూతిమరణంకింద జమకట్టాలిఉన్నారు" బొంబాయినగరంలోజరిగిన ప్రసవమరణ కారణాల సంఘసని వేదిక నుంచి (న్యూఢిల్లీ -- భారతప్రభుత్వప్రెస్ 1941)

పసితనపుచావులూ, ప్రసవమరణాలూ, సాధారణ మరణాలూ చాలావరకు మనజనాభాని పెరగకుండా అరికడుతున్నా; యింకా మనదేశంలో 4 మిలియన్ల జనం చొప్పున సంవత్సరానికి పెరుగుతూనే వున్నారు. గత 20 సంవత్సరాల్లోనూ చెప్పుకోతగ్గంతగా మరణసంఖ్య తగ్గకపోయినా కొద్దిగా తగ్గుముఖమే పట్టింది. 1930 సం॥ నాటికి 1000 కీ 181 మంది పిల్లలు పోతూవుంటే 1951 సం॥ నాటికి 1000 కీ 116 వరకూ మరణాలు తగ్గాయని జనన మరణ సంఖ్యల రిజిస్ట్రార్లు చెపుతున్నారు. పూర్వంకన్నా వైద్యసహాయం లభించడంవల్లా, కొత్తకొత్త మందుల వాడకంవల్లా, హాస్పటళ్ళు హెచ్చుగావడంవల్లా ప్రభుత్వ ప్రజారోగ్యశాఖ రోగనిరోధక ప్రణాళికలవల్లా మరణసంఖ్య చాలావరకూ తగ్గింది. పంచవర్ష ప్రణాళికలు పూర్తిగా అమలులోకి వచ్చి ప్రభుత్వ ప్రజారోగ్యశాఖారక్షణ సూత్రాలన్నీ ఫలిస్తే మరణసంఖ్య యింకా పూర్తిగా కిందికి పడిపోయే అవకాశాలున్నాయి. ప్రస్తుతం, అనారోగ్య నిరోధక చర్యలవల్లా గ్రామీణ ప్రాంతాల్లోకి మంత్రసానులు వెళ్ళడంవల్ల ప్రతీయేడూ 3 మిలియన్లు మంది పసికూనలు మృత్యుముఖాన్నించి బయటపడతారని అంచనా వేయబడింది. పైన చెప్పిన ప్రణాళికలన్నీ అమలు జరిగిననాడు 3, 4 మిలియన్లుగాక 8 మిలియన్లువరకూ జనాభా పెరుగుతుందని అంచనా వేయబడింది. 1941—51 మధ్య 43 మిలియన్ల జనాభా హెచ్చితే ఇందులో సగం కాలంలోనే యింతమంది జనాభా హెచ్చే పరిస్థితు లేర్పడవచ్చు. వీటివల్ల మనకు స్ఫురించేదేమంటే, అనుదినం పెరిగిపోతున్న జనాభా

నరికట్టడానికి, సంతాననిరోధం, కుటుంబనియంత్రణా మొదలైన నిరోధక చర్యలుగాని అమలు జరుపబడకపోతే భారత దేశ ఆర్థికపరిస్థితులు కొద్దికాలంలోనే భయంకరమైన స్థితికి వస్తాయి.

కొన్ని వందల సంవత్సరాలనుంచీ జనన సంఖ్యకన్నా మరణసంఖ్య అధికంగా వుండడ మొక సాధారణ విషయంగా అన్ని వెనకబడిన దేశాల్లోనూ అనుకున్నట్టుగానే భారత దేశంలోనూ తలచబడేది. మనపూర్వ జనాభాచరిత్రతోగాక నేటి అభ్యున్నత పాశ్చాత్యదేశాల జనాభా చరిత్రతో మనం పోల్చిచూస్తే మనస్థితి మరింత హీనంగా కనబడుతుంది. మరణసంఖ్య ఒకేసారి యింత యిదిగా పడిపోవడం చాలా సంతోషకరమైన విషయమైనా అన్నివిధాలా ఆలోచిస్తే సంతానాభివృద్ధివల్ల జనాభాసమస్య మరింతక్లిష్టమై వత్తిడి కలగజేస్తుంది. మాతృదేశంలో తల్లీబిడ్డల అభివృద్ధికై పాటు పడే సాంఘికసేవాపరాయణులకూ, తదితరులకూ, మరణ సంఖ్యా జననసంఖ్య సమానంగా వుండేట్లు చేస్తున్నకృషికి ఆనందంగా వుంటుంది.

కాని దురదృష్టవశాత్తు మనదేశంలో యింకా జననసంఖ్య కన్నా మరణసంఖ్యలే హెచ్చుగా వున్నాయి. దుఃఖమయమైన, అనవసరజననష్టాన్ని గురించి ఏమీా ప్రస్తావించదల్చు కొనలేదు. ఇంతేకాదు, కోట్లమీాదా లక్షలమీాదా వున్న జనం, శక్తిహీనంగా, అనారోగ్యంగా సంతోషం ఎరుగ కుండానే జీవచ్ఛవాలుగా పడివుంటున్నారు.

మన దేశంలోని జననమరణ సంఖ్యలే సత్యదూరంగా వున్నాయనుకుంటే రోగాల్ని గురించిన వివరాల అంకెలు యింకా అయోమయమైన పరిస్థితుల్లో వున్నాయి. భారత దేశంలోవున్న 558,089 గ్రామాల్లోనూ 100 కీ 83 ముగ్గురు మంది పల్లెల్లో నే తలదాచుకుంటున్న యీపల్లెలోనూ సరియైన వైద్యసహాయంగాని, ఆస్పత్రిగాని, అధమం మంచి ఔషధా లిచ్చే ఔషధాలయాలుగాని లేవు. కాబట్టి యెందరు రోగా లతో నిరుపయోగంగా బాధపడుతున్నారో అంచనా వేసి చెప్పడం చాలాకష్టం. అక్కడక్కడా వున్న పట్టణాల్లో మాత్రం కొద్దిగా లెక్కలు దొరుకుతున్నాయి. వీటిని నాల్గ యిదు సార్లు హెచ్చిస్తే మన పల్లెప్రాంతాల మొత్తంరోగాల సంఖ్య షుమారుగా తేలవచ్చు.

భారత దేశంలో మలేరియాతో సంవత్సరానికి 1 మిలియను మంది చనిపోతున్నారని భారత మలేరియాం శాఖవారు తమ లెక్కల్ని బట్టి అంచనా వేస్తున్నారు. మన దేశంలో సరియైన లెక్కలు తేలే పరిస్థితులు లేవు గాబట్టి ఈ జ్వరంవల్ల వొక మిలియనుగాక షుమారు 3 మిలియన్లు మందైనా చనిపో తున్నారని లెక్క గట్టవచ్చు. సంవత్సరానికి 3 మిలియన్లు మంది యీ జ్వరంతో చచ్చిపోతున్నారంటే షుమారు 10 మిలియన్ల మందైనా యీ జ్వరంతో బాధపడుతున్నారని అనుకోవచ్చు. ఈజ్వరపీడితులు మంచి వైద్యులవద్ద లేదా నాటువైద్యులవద్ద మందు పుచ్చుకుంటున్నారని అంచనా

వేసినా, వీరి అనారోగ్యకారణంగా ఆఫీసుల్లో, పరిశ్రమాగారాల్లో, పొలాల్లో ఎన్నిగంటలపని సాగడం లేదో లెక్కగట్టినట్లయితే చాలా హెచ్చుకాలమే వుంటుంది. మలేరియావల్ల నీరసించిపోయి తరువాత పుష్టికరమైన ఆహారం లేకయింకా క్రొత్తక్రొత్తరోగాలకి ఎర అవుతున్నారో మనదేశపు పల్లెప్రజలు లెక్కల్లో చెప్పడం చాలాకష్టం. జబ్బులవల్లపోయే వాళ్ళుపోయినా మిగిలినవాళ్ళ ఆరోగ్యంకూడా యేమాత్రం అభివృద్ధిచెందదు. భారతదేశంలోని బలాఢ్యులు, ఆరోగ్యవంతుల పట్టీ తయారుచేయడానికి పూనుకుంటే శక్తివంతులసంఖ్య అంతంతమాత్రంగానే వుంటుందని వేరే నిరూపించి చెప్పనవసరంలేదు.

మలేరియాయే గాక, కలరా, మశూచి, వుబ్బురోగం, జిగటవిరోచనాలు, క్షయా, కొంకిపురుగుల జబ్బు, బోదా, నారిపురుగులు, సిఫ్లిస్‌వంటి సుఖరోగాలవల్లకూడా చనిపోయే జనసంఖ్య హెచ్చుగానే వుంటుంది. ఇవేగాక, కుష్ఠూ, గుడ్డి, రేచీకటీ, పిచ్చీ వంటి యెన్నోరోగాలవల్లకలిగే బాధలుకూడా చాలావున్నాయి. భారతదేశంలో వైద్యవృత్తిలో వున్నవారు బహుకొద్దిమంది వుండడంవల్లా, ప్రవీణవైద్యులు లేకపోవడంవల్ల, సంఘ ఆరోగ్య ప్రణాళికలు లేకపోవడంచేతా, పెద్ద భారీయెత్తున పైరోగాల్ని నిరోధించడానికి వీలులేకుండా వుంది. పెద్దగా ఆరోగ్యప్రణాళికలు అమలు జరుపబడకపోయినా రోగనిరోధక చర్యలవల్ల కొంతవరకూ యీసమస్యల్ని యెదుర్కోవచ్చు. మన ప్రజల ఆర్థికదుస్థితి బాగుపడనంతకాలం, వారు విద్యావంతులు కానంతకాలం, ప్రాథ

మిక ఆరోగ్యసూత్రాల్ని అమలు జరపనంతకాలం, అజ్ఞానం వల్ల రోగాల్ని నిరోధించే సావకాశాలు కల్పించుకోనంతకాలం యెంతవైద్య సహాయం లభించినా మన పరిస్థితు లంతంత మాత్రంగానే వుండకతప్పవు. మన మరణసంఖ్య అధికంగావుండ డానికిగల నిజమైనకారణాలు తెలియకపోయినా 1950 సం॥లో సరిచూడబడిన జనాభా లెక్కల పట్టీని కిందచూస్తే కొంత వరకూ విషయాలు అర్థమౌతాయి. 1000 మందిలో చని పోయే 27 గురూ యేరోజబ్బులవల్ల పోయారో తెలియజేయ బడింది. మన దేశంలో చాలాచావులు; మరణసంఖ్యల రిజిస్ట్రారు దగ్గరవున్న లెక్కల్లోకి చేరవు. ప్రజలు అధికారుల దృష్టిలో కీవిషయం తీసుకువచ్చే అలవాటు లేదు. 1950 సం॥లో 1000 కీ 19.4 మరణసంఖ్య. కాని సరిచూడబడిన లెక్కలప్రకారం యిది 1000 కీ 27 వరకూ సంఖ్య పెరిగింది. వైద్యుడు చూడని చావు లన్నీ జ్వరంవల్లపోయిన చావులుగానే లెక్కలు వేయబడుతూ వుంటాయి. మన దేశంలో జ్వరంఅనే ముసుగులో చాలా రోగాలే దాక్కొనివుంటాయి. సరియైన పరిస్థితులు లేకపోవడం చేత ప్రజారోగ్య శాఖవారు మరణాల్ని అరికట్టాలన్నా వీల్లే కుండా యేకారణంవల్ల మనుష్యులుపోయారోకూడా తెలియ కుండావుంది.

సరియైన కారణాలు తెలియవనే నెపంతో ప్రజారోగ్య శాఖవారు తమపనిలో అశ్రద్ధచూపకుండా మరణకారణాలు తెలుసుకోడానికి అధికంగా కృషిచేయాల్సివుంటుంది. మరణా లకి సరియైన కారణాలు తెలిసిననాడు, వారు పడే శ్రమకు సత్ఫలితాలూ, అయ్యే ఖర్చుకు సద్వినియోగం జరుగుతుంది.

## నాల్గవ పట్టీ

| 1000 మందికీ చావులు | కలరా | మశూచి | జ్వరం | జిగట విరోచనాలు | నీళ్లవిరోచనాలు | శ్వాసరోగాలు | దెబ్బలూ | యితర కారణాలు |
|---|---|---|---|---|---|---|---|---|
| | 0.4 | 0.2 | 13.0 | 0.1 | 0.9 | 1.8 | 10.6 | |
| మొత్తం సగటు సంఖ్య. | 1.8 | 0.9 | 58.1 | 0.5 | 4.1 | 8.1 | 26.5 | |

# రెండవ అధ్యాయం

## ఆర్థిక సాంఘిక పరిస్థితులు

ఒక ప్రాంతం యొక్క ఆరోగ్య పటం గీయడానికి ముందు, అక్కడి సాంఘిక పరిస్థితులూ, వీనిమీద ఆధారపడివుండే జనన మరణాలూ, వలసపరిస్థితులూ మొదలైనవన్నీ గుర్తుంచుకోవాల్సి వుంటుంది. ప్రతీవారూ పెళ్ళిచేసుకుతీరాలనే వుద్దేశ్యం, బాల వివాహాలూ, వితంతు వివాహాల నిషేధం, సమిష్టి కుటుంబాలు మొదలైనవన్నీ లేకుండావుంటే మన దేశంలో జనన సంఖ్య అధికం కావడంగాని, పురుషుల ఆధిపత్యానికి అనుకూల వాతావరణంగాని వుండక మన జనాభా పరిస్థితులు వేరువిధంగా వుండివుండేవి. మనజనాభాలో చాలామంది పై చెప్పిన, సాంఘిక, సాంస్కృతిక, మతవ్యవస్థల నవలంబించడంవల్ల మనపరిస్థితులీనాడింత హీనంగా తయారయ్యాయి.

'పెళ్ళిఅయితీరాలి', 'బాల్యవివాహాలు మంచివే' అనే భావాలవల్ల భారత సాంఘిక చరిత్రలో యెక్కువ గడ్డు సమస్యలకి కారణాలయినవి. భారతదేశంలో 12-15 ఏళ్ళ మధ్యనే కన్యలు పెద్దమనుష్యులు కావడంవల్ల, వారు దృఢగాత్రులై మానసికంగా వైవాహిక జీవితాన్ని ఆశించకపోయినా, శారీరకంగా బిడ్డల్ని కనడానికి సంసిద్ధంగా వుండడం సంభవిస్తుంది. 1929 లో అమలులోకివచ్చిన శారదా

చట్టంప్రకారం పెళ్ళిచేసుకోదల్చిన ప్రతీ యువకుడికీ కనీసం 18 సంవత్సరాలూ, ప్రతీకన్యకీ 14 సంవత్సరాలూ వుండాలని నిర్ణయించబడినా, దీనికి వ్యతిరేకంగా జరిగితే శిక్ష విధించబడుతుం దని ప్రకటింపబడినా 1951 సంవత్సరం జనాభా లెక్కలనాటికి 2,833,000 పురుషులూ, 6,118,000 స్త్రీలూ 66,000 మంది భార్యపోయినవాళ్ళూ, 134,000 వితంతువులూ, 5-14 ఏళ్ళ మధ్య వయసులో వారంటే ఆశ్చర్యంగా వుంది! దీనిని బట్టి 1951 లెక్కలనాటికి 9 మిలియన్లు మందికి 14 యేళ్ల లోపునే పెళ్ళి జరిగిపోయిందన్నమాట. 1951 సం॥నాటికి ప్రతీ 100 మంది 15 యేళ్ళ కన్యల్లో 6 గురు మాత్రమే అవివాహితలు; అలాగే 15 యేళ్ళు వున్న ప్రతీ 100 మంది యువకుల్లోనూ 20 మందే వివాహంకానివారు. బ్రిటనులోనూ, అమెరికా లోనూ 1951 సంవత్సరంనాటికి 100 కి 27-26 మంది బ్రహ్మ చారులు. 1940 సం॥లో బ్రిటనులోనూ, అమెరికాలోనూ 100 కి 33 గురూ, 27 మందీ బ్రహ్మచారులుండేవారు. బాల్య వివాహాలు చాలావరకూ తగ్గిపోయినా (14 యేళ్ళ లోపున పెళ్ళి అయిన 6 మిలియన్లమందీగాక) 15-20 యేళ్ళ మధ్య వున్న చాలామంది కన్యలకే పెళ్ళి అయిపోయింది. పల్లె సీమల్లో పిల్ల పెద్దదికాగానే పెళ్ళిచెయ్యడంవల్ల వారికి వ్యవధి లేకుండానే వెంట వెంటనే పిల్లలుకలగడం, తల్లులు నీరసించి పోవడం, దీనివల్ల అకాలమరణాలు సంభవిస్తున్నాయి. బాల్య వివాహాలూ, ప్రసూతి మరణాలు, శిశుమరణాలూ అన్నీ వొకదానివెంట వొకటి వుంటాయి.

ప్రతీవారూ పెళ్లి చేసుకుతీరాలనేది రెండవ విషయం.

భారతీయుల్లైన వాళ్లు ప్రతీవాడూ యెప్పుడో వొకప్పుడు పెళ్లి చేసుకుంటూవుంటారు. పెళ్లి చేసుకోవడం మత విషయమైన బాధ్యతగా భావించబడుతుంది. ఎవరికి వారు స్వయంవరం చేసుకోక పోవడంవల్లా, ఆర్థిక సుస్థితి పెళ్లికి అడ్డుగాకపోవడంవల్లా, ధనసంపాదాలనే యిచ్ఛా సంపాదించితేగాని పెళ్ళి చేసుకోననే నిర్ణయం పెళ్ళికి ఆటంకాలుకావడంలేదు. దేశం మొత్తం మీద ప్రతీమగవాడూ, ప్రతీ 5 గురులోనూ ముగ్గురుస్త్రీలూ పెళ్ళి అయినవాళ్ళే. 14 యేళ్ళ పిల్లలకెందరికి పెళ్ళి అయిందో, 15, 16, 17 యేళ్ళ మొగపిల్లలకెందరికి పెళ్ళి అయిందో తెలిపే లెక్కలు మనకి లేవు. 15, 16, 17 వయసు లోపు మగవాళ్ళు పెళ్ళిచేసుకుంటే చట్టప్రకారం, నేరంగాని 14 యేళ్ళ ఆడపిల్లకి పెళ్ళిచేస్తే నేరంగాదు. 15 యేళ్ళలోపున పెళ్ళిఅయిన స్త్రీపురుషుల్ని శిక్షించదల్చుకుంటే మొత్తం 9,200,000 మంది జనం అవుతారు.[7] 1951 లెక్కల నాటికి 100 కీ 20.3 ముగ్గురు 15 యేళ్ళ మగాళ్ళూ, 100 కీ 6.4 మంది 15 యేళ్ళలోపు ఆడపిల్లలూమాత్రం పెళ్ళిగానివారని తేలింది. 1951 సంవత్సరంలో బ్రిటిషు దేశంలో 100 కీ 26.9, 25.5 మధ్యా పెళ్ళిగానివారి సంఖ్యవుంది. లెక్కలు తీసుకునేనాటికి పెళ్ళిగాకపోయినా తరువాత పెళ్ళిచేసుకునే వారి సంఖ్య హెచ్చుగానే వుంటుంది. మనదేశ స్త్రీలలో ప్రతివంద మందిలోనూ 12.8 మంది వితంతవులూ, అలాగే 100 పురుషుల్లో 5 గురు భార్యలు పోయినవారు, విడాకులు తీసుకున్న వారు, సాధువులూ, బ్రహ్మచారులూ వున్నారు. వీరందరూ

7. భారత జనాభా 1951 – పేజీ 72.

పెళ్ళికావలసిన వయసువారే, వీరుకూడా పై జనాభా లెక్క-
ల్లోకి వస్తారు. చదువుకోడానికి పెళ్ళిచేసుకోరు కొందరు,
ఆర్థికస్తోమత చాలదని కొందరు పెళ్ళి ఆలశ్యంచేస్తారు, పారి
శ్రామిక శిక్షణపొంది హెచ్చు ఆదాయం సంపాదించాలని
కొందరు పెళ్ళిదూరంగా పెడతారు. సరియైన సంబంధం రాలే
దని కొందరు పెళ్ళిమాట తలపెట్టరు, పాశ్చాత్య దేశాల్లో,
కాని మన దేశంలోమాత్రం యిలాటివి జరిగే అవకాశాలు
లేవు. పై చెప్పిన సావకాశాలు యెంతశీఘ్రంగా మనదేశానికి
వస్తే అంతత్వరితంగా మన జనాభా సమస్యలు పరిష్కరించబడ
తాయి.

భారతదేశం జనాభాలో స్త్రీలసంఖ్య చాలాకొద్దిగా కన
బడుతుంది. భారతదేశ జనభా చరిత్ర తిరగవేసి చూస్తే
యెప్పుడూ స్త్రీలజనాభా తక్కువగానేవున్నట్లు తెల్లమౌతుంది.
1951 సం॥ లెక్కల ప్రకారం 1000 మంది మగవాళ్ళకీ 947
మంది ఆడవాళ్ళేవున్నారు. 1941 సం॥లో 1000 కి 934 నిష్ప
త్తిలోనూ 1931 నుండీ 1921 వరకూ 740 నిష్పత్తిలోనూ
వున్నారు. దీనికిపూర్వం తీసుకున్న లెక్కలప్రకారంకూడా
స్త్రీలసంఖ్య తక్కువగానేవుంది. 1901 సం॥ నుంచీ లెక్కలు
చూస్తే స్త్రీలసంఖ్య యింకాయింకా తగ్గిపోతున్నట్లు రుజువౌ
తుంది. 1931, 1941 సంవత్సరాల్లో యీతగ్గుదల కొంతవరకూ
ఆగినా, మొత్తంమీద స్త్రీలజనసంఖ్య తగ్గిపోతున్నట్లు జనాభా
లెక్కలవల్ల తేలుతుంది. 1941—1951 సంవత్సరాలమధ్య
స్త్రీలజనాభా కొంతవరకూ పెరిగింది. 1950 సం॥లో బ్రిటనులో
1000 మంది పురుషులకీ 1085 స్త్రీలుంటే, అదే సంవత్సరంలో

అమెరికాలో 1000కీ 1014 మంది స్త్రీలేవున్నారు. భారత దేశంలో స్త్రీలజనసంఖ్య యింత తక్కువగా వుండడానికి చాలా కారణాలే చెప్పబడుతున్నాయి. కొందరు తేలికగా స్త్రీలజనాభా లెక్కలు సరిగ్గా తీసుకోకపోవడమే దీనికి కారణమని అంటు న్నారు. ఇదివరలో యీమాట నిజమైనప్పటికీ గత అరశతా బ్దంలోనూ భారతజనాభా లెక్కలు చాలాసమర్ధతతో తీసుకో బడడంవల్ల, స్త్రీలసంఖ్య యిదివరకుకన్నా పెరగడానికిబదులు యింకాతగ్గినట్లు కనబడుతుంది. 1951 సంవత్సరపు జనాభా లెక్కలు ప్రజల సంపూర్ణ సహకారంతో కడుసమర్ధతతో తీసుకోబడ్డాయి. అక్కడక్కడా తీసుకోబడిన నమూనా లెక్క లతో యివి సరిచూడబడ్డాయి. 1951 సం॥లో అతిశ్రద్ధగా పట్టణాల్లో జనాభా లెక్కలు తీసుకోబడినా 1000 మంది పురుషు లకీ 860 మంది స్త్రీలే వుంటే పల్లెల్లో 1000 కీ 960 మంది స్త్రీలుండడమే విశేషం. పల్లెల్లోంచి మగవాళ్ళు పట్టణాల్లోకి పనులకోసం రావడం వల్ల, పట్టణాల్లో పురుషుల జనసంఖ్య యెక్కువైంది. వీటినిబట్టి మన దేశంలో పురుషజనాభాకన్నా స్త్రీల జనాభాయే తక్కువగా వుందని రుజువైంది.

దీనికి కారణమేమైవుంటుందని ప్రశ్న? అనాదినుంచీ యుద్ధ వీరులకు ప్రసిద్ధిపొందిన, ఆఫ్గనీస్థాన్, పాకీస్థాన్ (సింధు నదీ ప్రాంతం) వంటి దేశాల్లోకూడా పురుషులకన్నా స్త్రీలే తక్కువగా వున్నారు. పురుషత్వం అధికంకావడంవల్లే స్త్రీలు తక్కువైపోతున్నారనే కారణం శరీరశాస్త్రానికి విరుద్ధం. ఏది యెలావున్నా భారతదేశంలోమాత్రం స్త్రీలకన్నా పురుషులే అధిక సంఖ్యలో వున్నారు. ఉత్తరభారతంలోవాయువ్యమూలగా

వున్న పాకిస్థాన్‌వంటి ప్రదేశాల్లో స్త్రీలసంఖ్య తక్కువగా వుంటే దక్షిణభారతంలో స్త్రీ పురుషులు సుమారుమించు సమానంగానే వున్నారు. ఈ "జాతి నాశ" నానికి కారణం విజ్ఞాన శాస్త్రజ్ఞులుకూడా చెప్పలేకుండా వున్నారు. అత్యధిక బలశాలురని పేరుపడ్డ సింధీయులలోనే యీ స్త్రీ జాతి వినాశనం యేర్పడిందని చెప్పకతప్పదు, బలవంతులే నశించిపోవడమనేది సత్యదూరమైన విషయమనే వొప్పుకోక తప్పదు.

1921 లో బొంబాయి జనాభా కమీషనరుగారూ, 1931 లో భారతజనాభా రిజిస్ట్రారుగారు యీ నష్టానికి కొన్ని శరీరశాస్త్రరీత్యా కారణాలు చెప్పారు. భారత దేశంలో వున్న కులతత్వాలవల్ల, కులాంతర వివాహాలకి అవకాశం లేకపోవడం జాతిలోకి కొత్తరక్తం వచ్చే సావకాశాలు లేకపోవడంచేత, ఆ జాతి సంకరం చెందకపోవడమేగాక, ఆ జాతిలో వున్న గుణాలూ, అవగుణాలే మరింత హెచ్చుగా సంతానానికి ప్రాప్తించడం, కొత్తగుణాలు రావడానికి వీల్లేకపోవడంచేతా జాతివృద్ధీ, క్షీణతా త్వరగా మారుతూ వుండవచ్చు. బలమైన జాతే మరింత బలంగా తయారవడం, వారు కొన్ని రోగాలకూ, వాటికీ అతీతులు కావడంవల్ల యీ తేడా వచ్చిందేమోనని వారు అభిప్రాయపడ్డారు.[8]

ఇక రెండవవారు మొదటివారి వాదాన్ని అంగీకరిస్తూనే యిలా విమర్శించారు. పై చెప్పిన విషయాలన్నీ యధార్థాలైనా కాకపోయినా, కులాలు వున్నంతకాలం, యేకొన్ని

8. భారతజనాభా 1921. బొంబాయి రాష్ట్రం — మొదటిభాగం-1. సాధారణ రిపోర్టు—L. J, సెడ్జివిక్ (బొంబాయి 1922) పుట 103.

నియమాలవల్లా కారణాలవల్లా ఆజాతిలో స్త్రీలు అధికంగా వున్నారో, ఆనియమాలు ఆజాతి ఆచరించినంతకాలం ఆజాతిలో చివరివరకూ స్త్రీలే హెచ్చుగా వుండడం తటస్థపడుతుంది. హిందూమతంలో స్త్రీ సంతానానికన్నా పురుష సంతానానికే ప్రాముఖ్యం యీయడంవల్లా, యోగ్యపజాతి వారిలో ఈ నియమాలు మరీ హెచ్చుగా వుండడంవల్లా, కులాంతరవివాహాలు జాస్తిగా లేకపోవడంవల్లకూడా పురుషుల కన్నా స్త్రీలు తక్కువమంది వుండడం సంభవిస్తుంది.[9] ఈపైన చెప్పిన కారణాలన్నీ నిజంకావచ్చు. కాని హిందూ సంఘంలో సంతానవిషయంలో పైన చెప్పిన విషయాలన్నీ యథార్థమో కావో తెలుసుకునే ఆధారాలేమీలేవు. కులాంతరవివాహాలవల్ల వున్న లాభాలూ, కులంలోనే చేసుకున్నందువల్ల వున్న లాభనష్టాల విషయంలో పైన చెప్పిన విషయాలన్నీ యథార్థాలే కావచ్చు కాని సంతానంలో స్త్రీలకన్నా పురుషులు హెచ్చుగా పుట్టడానికివి యేమాత్రం కారణం కావు.

ప్రస్తుతం దొరికిన లెక్కల్నిబట్టి చూస్తే స్త్రీ సంతానం కన్నా పురుష సంతానం అధికంగా కలుగుతుందని తెలుస్తుంది. 1951 లెక్కల్నిబట్టి జనాభాల రిజిస్ట్రారు వుద్దేశ్యమేదైనా, నిజాని కీలెక్కలన్నీ సరియైనవని చెప్పడానికి వీల్లేదు. ఏమైనా స్త్రీ సంతానానికన్నా పురుషసంతానం కొద్దిగా హెచ్చుగా పుడుతున్నారని చెప్పకతప్పదు. భారతదేశ మంతటిలోనూ, ఆడపిల్లల మరణసంఖ్యకన్నా మగపిల్లల

9. భారతజనాభా 1931, 1 వాల్యూ. భారతదేశం–మొదటి భాగం. J. H. హట్టన్ గారి రిపోర్టు (ఢిల్లీ 1933) పే. 197.

మరణసంఖ్యే హెచ్చుగా వున్నట్లు లెక్కలు చెపుతున్నాయి. దీనినిబట్టి సంవత్సరాంతానికి ఆడ మగ పిల్లలసంఖ్య సమానంగానే వుంటాయి. 1–5 సంవత్సరాల మధ్య వయసులో మగ పిల్లలకన్నా ఆడపిల్లలే యెక్కువగా వున్నారని జనాభా లెక్కలు చెపుతున్నాయి. కాని 6–10 సంవత్సరాల మధ్యకి వచ్చేప్పటికి బాలికలకన్నా బాలురసంఖ్యే హెచ్చుఅవుతుంది.

సహజంగా ప్రకృతిలో బాలికలు బాలురకన్నా యెక్కువ బలంగావున్నా పోను పోను వారి ఆరోగ్యాన్ని నిర్లక్ష్యం చేయుడంవల్లా, తరుచు కాన్పులు రావడంవల్లా వారిసంఖ్య క్షీణించి పోతున్నదన్న విషయమే వీటన్నిటికన్నా యెక్కువ సహజంగా కనబడుతుంది. దీనికితోడూ ఆడపిల్లలకి వచ్చేవ్యాధి, ముఖ్యంగా చిన్నతనంలో వచ్చేరోగాల్ని (కావాలని అలక్ష్యం చేయకపోయినా) గురించి శ్రద్ధ తీసుకోక పోవడంవల్లకూడా మరణసంఖ్య హెచ్చుతుందనే చెప్పాలి. దీనికితోడు, బాల్య వివాహాలూ, పసితనంలోనే గర్భిణీరావడం, వ్యవధిలేకుండా కాన్పులూ, వీనివల్ల అకాలమరణాలూ, సంభవించుతూండడం వల్లకూడా స్త్రీలజనాభా తగ్గిపోతుంది. చైనాదేశంలోకూడా యిటువంటి పరిస్థితులే వున్నాయని డాక్టరు 'టూ–చెన్' గారు తనదేశంలో 'కుమ్' సరస్సు ప్రాంతాల బాలబాలికల సంతాన నిష్పత్తిని గురించి రాస్తూ యిలా అన్నారు. "పుట్టుకలో ఆడపిల్లలే మగపిల్లలకన్నా హెచ్చుగా పుట్టినా, పోను పోనూ ఆడపిల్లల మరణసంఖ్య హెచ్చుగా వుండడంవల్ల చివరకు రెండూ సమానంగానే వుంటాయి సంఖ్యల్లో. చైనాలో జరిగేదే తూర్పుదేశాలన్నిటిలోనూ జరుగుతుంది.

మగపిల్లవాడు వంశోద్ధారకుడౌతాడని, సాంప్రదాయాల్ని నిల
బెడతాడని ఎక్కువ ప్రేమతో పెంచబడతాడు. దీనివల్ల,
ఏం చేస్తున్నారో తెలియకుండానే ఆడపిల్లలు అశ్రద్ధగా
చూడబడడంవల్ల వారిమరణాలు హెచ్చుగా వుంటాయి.[10]
చైనాదేశ పరిస్థితులన్నీ యథాతథంగా భారతదేశానికి
వర్తించక పోయినా, మనపల్లె ప్రాంతాల్లో స్త్రీ సంతానాని
కన్నా పురుష సంతానాన్ని ఎక్కువ ప్రేమగా చూస్తా
రన్నమాట వాస్తవం. స్త్రీ పురుష సంతానాల పుట్టుకల్లో
వచ్చే భేదాన్ని మనం అరికట్టలేక పోయినా, సాంఘిక,
సాంస్కృతిక భేదాలు కల్పించి బాలికల జీవితాలు దుర్భరం
చేయకూడదు.

వితంతూద్వాహాలు లేకపోవడం కూడా భారతదేశానికొక
నష్టమేనని ఒప్పుకోవాలి. భారతదేశంలోని సాంఘిక పరి
స్థితుల ఫలితమే ఆరోగ్యపటము. మనసాంఘిక దౌర్బల్యాల
ప్రభావంవల్ల కొన్ని దురాచారాలు ప్రబలమౌతున్నాయి.
ఇలా ఒకదానికొకటి లంకెగా విషమ పరిస్థితులు తయా
రవుతున్నాయి. వితంతువులు పునర్వివాహం చేసుకోక పోవ
డంచేత భార్యాభర్తల మధ్యవయసులో చాలా తేడాలు కన
బడుతున్నాయి. భార్యపోయిన మగవాడు ఏ వయసులో
వాడైనా వితంతు స్త్రీలని పెళ్ళిచేసుకోక కన్యనే చేసు
కుంటాడు. దీనివల్ల ముసలి భర్తలూ, పడుచు భార్యలూ
హెచ్చుగా వుండడం, ముసలి భర్తలు త్వరగా మరణించడం

10. నవచీనాలోని జనాభా — రచయిత టూ-చెన్ చికాగోయూని
వర్సిటీ ప్రెస్–1941 పుట 19.

కొనసాగుతూ భారతస్త్రీలు అనవసరంగాను మరణిస్తుండడం ప్రసవించేపోవడం జరుగుతూవుంది.

స్త్రీ పురుషులమధ్య వున్న యీ సాంప్రదాయ [illegible] వల్ల స్త్రీలకి బాల్యవివాహాలు తప్పడంలేదు. [illegible] మలూ, భార్యపోయిన మగవాళ్ళూ యేవయస్సులోవున్న స్త్రీనైనా పెళ్ళిచేసుకోవడంవల్లకూడా యీవయస్సు తేడాలు పెరుగుతున్నాయి. ఈ తేడావల్లనే స్త్రీలు త్వరగా వితంతువులు కావడానికి మార్గాలేర్పడుతున్నాయి. వితంతుస్త్రీలు పునర్వివాహంచేసుకోక పోవడంవల్లా, భార్యపోయిన మగవాళ్ళు మళ్ళీ పెళ్ళికి సిద్ధపడడంవల్లా, అసలే తక్కువగావున్న స్త్రీల సంఖ్య మరీతగ్గిపోతుంది. దీనివల్ల యింకా విషమపరిస్థితు లేర్పడుతున్నాయి. ఇన్ని క్లిష్టపరిస్థితుల్లోకూడా పెరుగుతున్న జనాభా వొకవంకా, వృథాజననమరణాలు వొకవంకా, జనాభా విషయంలో విషమపరిస్థితులను కల్పిస్తున్నాయని గుర్తించుకోవడం అవసరం.

## మన జీవన ప్రమాణం

భారతదేశ విస్తీర్ణానికు 300 మిలియన్లోగాను, 600 మిలియన్ల జనాభావున్నా వారి జీవనప్రమాణం సాధారణంగా వుంటే మనకీసమస్యలే వుత్పన్నమయ్యేవికావు, కాని మనజీవన ప్రమాణం చాలా అధోగతిలోవుంది.

జీవన ప్రమాణమంటే యేమిటని కొందరు ప్రశ్నించవచ్చు! ఇతర దేశాల జీవనప్రమాణంతో మనదేశపు జీవనప్రమాణం పోల్చడమే పెద్దపొరపాటని కొందరి వుద్దేశ్యం. జీవనప్రమాణం

అనే పదాన్ని నిర్వచించడం చాలాకష్టం. "ప్రతిమనిషీ కొన్ని విషయాల్ని తన తృప్తిసంపన్న సుఖజీవనానికి ఆవశ్యకమైనవని తెలుస్తాడు; జీవితంలో యీ అవసరాల్ని కలిగివుండడాన్నే జీవనప్రమాణం అని అంటారు" అని ఆచార్య ఫెయిర్ చైల్డ్స్ అన్నారు.[11] అసలు ఈపదంయొక్క నిర్వచనం యెలావున్నా — సరిగానే వుందనుకుందాం — ప్రతీవ్యక్తికీ, కడుపునిండా తిండీ, కట్టుకోడానికి బట్టా, తలదాచుకోడానికి యిల్లూ, కొంత ప్రాథమికవిద్యా, అవసర వైద్య సహాయం, సాంస్కృతిక విజ్ఞానం మొదలైనవన్నీ పాశ్చాత్య దేశాల్లో వున్నంత హెచ్చుగా లేకపోయినా, మిగిలిన ఆసియా దేశాల్లోలా కొద్దిగాకూడా మన దేశంలో లేవు.

మన ఆహారసమస్య గడ్డుగానే గాదు మతికూడా పోగొట్టేదిగా తయారయింది. దీన్ని గురించి యిప్పుడు ప్రస్తావించవలసిన అవసరంలేదు. లక్షలాది ప్రజలు తిండిలేక, కరువు లేకపోయినా, కరువులోలా బాధపడుతున్నారు. రేషనుపద్ధతి యెత్తివేయబడి గోధుమా వరీ బాగా దొరుకుతున్నా, పప్పుదినుసుల వాడకం సగటున మనిషియొక్కడికీ చాలా కొద్దిమొత్తంలో వుంది. మనం కరువులనుంచి తప్పించుకోడానికి వీల్లేదు. ఋతుపవనాలమీద ఆధారపడినపంటలు మనవి. అందుకని వొకయేడు బాగా పంటలు పండినా, మరుచటియేడు బాగా పండితీరుతాయని సంతోషించడానికి వీల్లేదు. రేషనుపద్ధతి లేకపో

11. ప్రపంచజనాభా మహాసభలో H. P. ఫెయిర్ చైల్డ్స్ గారు "అధిక జనసంఖ్య" గురించి మాట్లాడుతూ యిలా చెప్పారు. (లండన్ 1927) పే. 75. మార్గరెట్ సెనగర్ యీపుస్తకాన్ని ఎడిట్ చేశారు.

యినా, పుష్టికరమైన ఆహారం కొనుక్కుని తినేపరిస్థితుల్లో లేం మనం. మన దేశంలో సగటున మనిషికి 1700 క్యాలరీలు తిండి మాత్రమే దొరికితే, కట్టుకోడానికి చాలీ చాలని 17 గజాల గుడ్డ దొరుకుతుంది. అక్కడక్కడా యేవో కొన్ని కొత్త నిర్మాణాలు తప్పితే, రాష్ట్రప్రభుత్వాలుగాని, కేంద్రప్రభుత్వం గాని గృహనిర్మాణ పథకాన్ని భారీగా అమలుపరచడం లేదు. పల్లెప్రాంతాల్లోనూ పట్టణప్రాంతాల్లోను లక్షలాది ప్రజలు నాగరికతా వాసన యెరగని పూరిగుడిసెల్లోనూ, బందిఖానాల వంటి యిరుకు కొంపల్లోనూ తలదాచుకుంటున్నారు. ఆరోగ్య ప్రణాళికల్నీ, ప్రాథమిక విద్యాప్రణాళికల్నీ, పూర్తిగా అమలుజరపడానికి మనవద్ద డబ్బులేదు. మొత్తం జనాభాలో 100 లో 15 మందికి చదవనూ వ్రాయనూ వస్తే 10 యేళ్ళ వయసువాళ్ళలో 100 లో 22 మందికే చదవనూ వ్రాయనూ వచ్చు. కళాశాలల్లోనూ, విశ్వవిద్యాలయాల్లో, ముఖ్యంగా సాంకేతికవిజ్ఞానకళాశాలల్లోనూ విద్యార్థులవొత్తిడీ ప్రతియేడూ సీట్లు దొరకక బాధపడేవారిబాధా ( అక్కడికే కళాశాలల్లో తీసుకోవలసినవారికన్నా హెచ్చుమందినే తీసుకుంటున్నారు. ) హాస్పటళ్ళల్లోనూ, ఔషధాలయాలల్లోనూ వందలాదిగా మూగే ప్రజల కష్టాలూ చూస్తూంటే మనవిద్యాసంస్థలూ, వైద్య సహాయ కేంద్రాలూ కావలసినన్ని లేవని బుజువవుతుంది. మన జీవనప్రమాణం చాలా తక్కువగా వుండడానికి కారణం మన దైనందిన ఆదాయం చాలా కొద్దిగా వుండడమేను. మనదేశంలో మనిషికి సగటున రు 225 ఆదాయం, సంవత్సరంలో వస్తుందని భారతప్రభుత్వ ప్రముఖ సంఘం

1943—1949 లో అంచనావేసి చెప్పింది.[12] మిగిలిన దేశాలతో పోల్చిచూస్తే మనజాతీయ ఆదాయం సరియైనదని చెప్పలేము. 1949 లో ప్రపంచ దేశాల జాతీయ ఆదాయాన్ని ఐక్యరాజ్య సమితి తీసుకుంది; బ్రిటనులో 833 డాలర్లనీ, అమెరికాలో 1453 డాలర్లనీ భారతదేశంలో 81 డాలర్లనీ అంచనావేశారు.[13] మన జీవనప్రమాణం చాలా తక్కువగా వుండడానికీ, మన అనర్థాలన్నిటికీ ఈ కొద్ది ఆదాయమే మూలకారణం. ఈ పరిస్థితుల్లోంచి యెలా బయటపడడమనేదే గట్టి ప్రశ్న?

### వ్యవసాయాభివృద్ధి

జీవనాధారమైన మనతిండిగింజల వుత్పత్తిమీదనే మన జనాభాసమస్యలన్నీ ఆధారపడి వుంటాయి.మన దేశంలో నూటికీ 70 మంది (69.8) జనం వ్యవసాయంమీదే బతుకుతున్నారు. 362 మిలియన్ల జనాభావుంటే 813 మిలియన్ల యెకరాల (81.3 కోట్లు) దున్నే నేల మాత్రమేవుంది. అంటే మనిషికి సగటున 2.25 యెకరాల నేల చొప్పున వస్తుంది. పెరిగిపోతున్న జనాభావల్ల ప్రతీయేడూ సగటున దున్నే నేల తగ్గిపోతుంది. 1891 సంవత్సరంలో మనిషికి 109 సెంట్ల పొలం వుంటే (100 సెంట్లువొక యెకరం) 1921 నాటికి 101 సెంట్లయింది. 1951 సంవత్సరం నాటికి 84 సెంట్లకి దిగజారిపోయింది.

12. జాతీయ ఆదాయపుటంచనా ప్రథమసంపుటం (ఢిల్లీ. భారత ప్రభుత్వం 1951) పే. 33.

13. 70 దేశాల జాతీయ ఆదాయపు లెక్కలు 1949 సం॥ (న్యూయార్కు, ఐక్యరాజ్య సమితి 1952) పే. 6.

మన్నే నేలేమో అధికం గావడంలేదు, పైగావున్న నేలకూడా ఆస్తి పంపకాలవల్ల చిన్న చిన్న ముక్కలుగా చీల్చివేయబడడంవల్ల వచ్చే ఆదాయంకూడా తగ్గిపోతుంది. నేల విషయంలోనూ చాలా యిబ్బందులూ, యిక్కట్లులూ వున్నాయన్న మాట మనం మరిచిపోకూడదు.

హెచ్చుమంది వ్యవసాయంవల్ల జీవించడంచేతా, పురాతన పద్ధతుల్లోనే యింకా వ్యవసాయం చేస్తూండడంవల్లా, పొలాలు చిన్న చిన్న చీలికలై పోవడంచేతా (ట్రాక్టర్లతో వ్యవసాయం చేయలేని పరిస్థితు లేర్పడ్డాయి. అసలు ట్రాక్టర్లు కొనుక్కునే స్తోమతకూడా మనదగ్గరలేదు.) సరియైన నీటి వసతు లేకపోవడం మూలంగా, వర్షాధారం మీదే వ్యవసాయం ఆధారపడి వుండడంచేతా మన భారత దేశంలో చాలా మంది ఆర్థికమైన యిబ్బందులకు గురికావలసి వస్తుంది. పొలం యజమానికి వుండగూడని హక్కులు వుండడంచేత, మధ్యవాళ్ళు దోపిడీవల్లా, దున్నేవాడికి నేలమీద నిలబడానికి అవకాశం లేకుండా చేస్తున్నాయి, మన మధ్యయుగంనాటి పన్ను వసూళ్ళపద్ధతులు. యీనాందారీ జమీందారీ పద్ధతుల్ని మనప్రభుత్వం రద్దుచేయాలని అదృష్టవశాత్తు సంకల్పించుకుంది.

పాతపద్ధతుల్లోనే సాగుచేయడం మూలంగా వ్యక్తిగత సంపాదన తగ్గిపోతుంది. చైనా జపాను దేశాల్తో పోల్చి చూస్తే మనస్థితి యెంత దిగజారిపోయిందో తేల్తుంది. దీనికి తోడు యీపద్ధతులవల్ల భూసారం పోయి, పొలాల్లో మొక్కా మోడూ లేక పొలాలు బీడుపడిపోతున్నాయి. వ్యవసాయం మిగిలిన వ్యాపారాలలా లాభసాటి కావడానికిబదులు మన రైతులపాలిటి పెద్దమ్మలా తయారై కూర్చుంది.

భారతదేశం యీపరిస్థితుల్లోంచి బయటపడి అధిక ఆహారోత్పత్తి చేసే సావకాశాలు లేవని నిస్పృహ చెంద కూడదు. 1951 [14]నాటికి దొరికిన వ్యవసాయభూముల లెక్కల ప్రకారం దున్నడానికి వీలుండికూడా దున్నకుండా వదిలేసిన నేల నూటికి 11 వంతులున్నదని తేలింది. 417 మిలియన్ల యెకరాల్లోనూ 100 టికి 66 ఎకరాల్లో పంటలు పండిస్తుంటే; 13 ఎకరాల్ని బీడుగా వదిలేస్తున్నారనీ 11 యెకరాల్ని దున్నడానికి వీలున్నా దున్నడం లేదనీ తేలింది. ఇదిగాక అసలు సాగుకే పనికిరాని నేల వుంది. 1926 లో వున్న వ్యవసాయ శాఖ కమీషనరుగారు అవిభక్త భారతంలో 150 మిలియన్ల యెకరాల భూమి, పంటలు పండించడానికి వీల్లేకుండా వుంది, లేదా నూటికి 22.5 యెకరాల నేల పంటలకాలంలో సాగు చేయడానికిఅనువుగా లేదని అన్నారు.

ఐదవ పట్టీ

భారతదేశంలో 1951 *నాటి వ్యవసాయపు నేల

| | మిలియన్లలో యెకరాలు | శాతం |
|---|---|---|
| సర్వే చేయబడిన భూమి | 781 | 100 |
| అడివి గావున్న భూమి | 109 | 14 |
| సాగుకు పనికిరాని భూమి | 225 | 33 |
| సాగుకు పనికివచ్చే భూమి | 88 | 11 |
| బీడు | 54 | 7 |
| మొత్తం సాగుచేయబడిన భూమి | 275 | 35 |

14. భారత వ్యవసాయ లెక్కలు వొకరాష్ట్రానికొకటి సంబంధం లేకుండా వున్నాయి. కారణం వ్యవహార పదాల్లోని తేడాలూ, తరుచూ మారుతూవుండే పద్ధతులూ కావచ్చు.

*మొత్తం భూమిలో 10% లెక్కల్లో యేవిధంగా వుపయోగింపబడేదీ తెలియలేదు.

అధిక సారవంతమైన నేలకాకపోయినా యింకా సాగుకు పనికివచ్చే భూమి మన దేశంలో యింకా మిగిలి వుంది. పురాతన పద్ధతులవల్ల కష్టపడి సాగుచేసిన నేలకూడా సారం కోల్పోతుంది. వానా వరదలవల్లా, గాలిదుమారాలవల్లా నేలపై పొర కొట్టుకునిపోకుండా కాపాడడానికీ, అడవిప్రాంతాన్ని కూడా సాగుచేయడానికి అనువుగానూ, యిదివరలో సాగుకు పనికిరాదనుకున్న భూమిని దున్నడానికి నేటి వ్యవసాయ విజ్ఞానశాస్త్ర పరిశోధనా ఫలితాలైన పనిముట్లవల్ల వీలౌతుంది.

ఆధునిక వ్యవసాయ పరికరాలవల్ల [illegible] అధికంగా ఆహారోత్పత్తిచేయగలిగినా, సాగుకనువైన భూమంతా సాగు చేయబడినాకూడా మన జనాభా సమస్యలు తీరిపోవడంగాని, మన కందిన జీవనప్రమాణం పెరగడంగాని సంభవించదు. అందుచేత మన జనాభాలో కొద్దిమందికైనా వేరే జీవనోపాధి కల్పించకతప్పదు.

## పారిశ్రామికాభివృద్ధి

పారిశ్రామికాభివృద్ధివల్లనే భారతజనాభా సమస్యలు తీరగలవని ఆశిస్తున్నారు. అతిత్వరితంగా స్థాపించడానికి వీలైన లఘు భారీపరిశ్రమలను గురించి చర్చించడాని కీపుస్తకంలో తావులేదు. పారిశ్రామికాభివృద్ధి కత్యవసరాలైన ముడిపదార్థాలూ, ఆర్థిక స్తోమతా, సాంకేతిక విజ్ఞానం, పనితనం, మార్కెట్టూ మొదలైనవి మన దేశంలో కొద్దోగొప్పో

వున్నాయి. గత 30 సంవత్సరాల్లోనూ పరిశ్రమలు యేన్నో కొంత అభివృద్ధిచెందుతూనేవున్నా మన జనాభా సమస్యల్ని పరిష్కరించే అంతగా మాత్రం అభివృద్ధిచెందలేదు. పరిశ్రమలు ఒకసిద్ధాంతాన్ననుసరించి అభివృద్ధి చెందకపోగా, హెచ్చు మంది జనానికి అందుబాటులేవు. 1951 సం॥ లెక్కలప్రకారం మొత్తం జనాభాలో నూటికి 10.5 మందే (వారిమీద ఆధారపడినవార్ని కలుపుకుని) పరిశ్రమలవల్ల బ్రతుకుతున్నారని తేలింది. పరిశ్రమలు సక్రమంగా నడుపబడకపోవడంచేతనూ, కొందరి యిష్టాయిష్టాలమీద ఆధారపడి వుండడంచేతనూ, పైగా చేతిపనుల నివి దెబ్బతీయడంవల్లా పల్లెల్లో నిరుద్యోగ సమస్య అధికం కావడంచేత జనాభాసమస్య మరింతక్లిష్టమైంది. రెండవ పంచవర్ష ప్రణాళిక అమలులోకి వచ్చినప్పుడు భారీ పరిశ్రమలు ఒకవంకా, కుటీర లఘుపరిశ్రమలు ఒకవంకా అభివృద్ధిచెందడంవల్ల, అనునిత్యం పెరుగుతున్న జనాభాకు కొంతవరకూ పని కల్పించడమేగాకుండా పల్లెలోంచి పట్టణాలకు పనికొఱకు వలస రావడం తగ్గి చాలామందికి సహాయం జరుగుతుంది.

కొన్ని దశాబ్దాలవరకూ భారతదేశం వ్యవసాయదేశంగా వున్నా పారిశ్రామికాభివృద్ధివల్ల, ముఖ్యంగా రెండువిధాలుగా మన జనాభా సమస్యలు పరిష్కరించబడగలవు. అత్యవసరమైన సరుకులకు దేశంలో యెంతో యిబ్బందిగావుంది, పరిశ్రమలవల్ల కొన్ని అత్యవసరమైన సరుకు ఉత్పన్నమయ్యే సావకాశాలు కలిగి క్లిష్టంగావున్న పరిస్థితి అధికంగా కాకపోయినా కొంతవరకు సద్దుకుంటుంది. కాని దీనికే ఆర్థికస్తోమతా, సాంకే

తీసే నిర్ణాన నిపుణత్వం చాలా అవసరం. మన రెండవవిషయం మేమింకా భారతదేశంలో పారిశ్రామికాభివృద్ధితోపాటు పారిశ్రామిక నగరాలుకూడా అభివృద్ధిచెందడంవల్ల, నాగరికత హెచ్చుగా ప్రబలి సంతానం తగ్గే అవకాశాలు వుంటాయి. సంతానాభివృద్ధి లేకపోవడానికి యిథమిద్ధంగా కారణం చెప్ప లేకపోయినా, పాశ్చాత్య దేశాలైన, బ్రిటను, అమెరికా, యూరపు దేశాల్లోనూ, ప్రాక్ దేశమైన జపానులోనూ ఈ విషయం అనుభవైకవేద్యంగా మాత్రముంది. పారిశ్రామికాభి వృద్ధివల్ల జీవనప్రమాణం హెచ్చడం, తదనుగుణంగా సంతాన జననం తగ్గడం మిగిలిన దేశాల్లో సంభవిస్తున్నప్పుడు మన దేశంలో దీనికి వ్యతిరేకంగా జరగడానికి వీల్లేదు.

---

# మూడవ అధ్యాయం

## వ ల సా వ కా శా లు

### ప్రాంతీయమైన వలస

భారతజనాభా సమస్యని పరిష్కరించడానికి వలసపోవడ మొందుకొకమార్గం కాకూడదని కొందరి ప్రశ్న. రాజపుత్ర స్థానంవంటి యెడారి ప్రదేశాన్ని నివాసయోగ్యంగా చేస్తే తప్ప భారత దేశంలో మరెక్కడా వలసపోయే స్థలాలే లేవు. ఎడారుల్ని మనం నివాసయోగ్యంగా చేయడం మాట యెలా వున్నా అవిమాత్రం మెలమెల్లగా మనస్థలాన్నికూడా ఆక్ర మిస్తున్నాయి. భారత దేశంలో కొన్ని ప్రాంతాల్లో జనసాం ద్రత కొద్దిగా వున్నమాట వాస్తవమే! దేశంలో సగానికి పైగా జనం, వున్నభూమిలో నాల్గోవంతులో నివసిస్తూంటే మిగిలినచోట్ల జనం అతిపల్చగా వున్నారు. గంగామైదానపు వుత్తర దక్షిణ భాగాలలో వున్నసాంద్రత మరెక్కడాలేదు. చదరపు మైలుకు 832 మందినుంచీ 681 మంది వరకూ నివ సిస్తూన్నారు. తూర్పు హిమాచలప్రదేశంలో చదరపు మైలుకు 118 మంది జనమే వుంటూ, అక్కడే యెడారి ప్రదేశాల్లో 46 మందే నివసిస్తూన్నారు. మిగిలిన రాష్ట్రాల్లో అస్సాముని బెంగాలు రాష్ట్రంతో పోల్చి చూస్తే అస్సాంలో జనసాంద్రత చాలా తక్కువగావుంది. క్రిందటి 20 యేళ్లలోనూ అస్సాంకు యితర రాష్ట్రాలనుంచి షుమారు అరమిలియనుమంది జనం

వలస వచ్చారు. 20 యేళ్ళలో శ్రీ సూలియను [illegible] [illegible]
యేదో సారంలేని నేల లభ్యంకావడం అనేది యీ మహా[illegible]
సముద్రంలో నీటిబొట్టులాంటిదే అవుతుంది.

అంతరరాష్ట్రీయ వలసల్లో కొన్ని సాధక బాధకాలున్నా,
యిటీవల కొద్దిగా వలస సాగుతుంది. గత 30 సంవత్సరాల్లోనూ
కొన్ని రాష్ట్రాల్లో యీవలస కొన్ని ప్రత్యేక కారణాలవల్ల
మిగిలిన ప్రాంతాలకి హెచ్చుగావున్నట్లూ అది పోనుపోనూ
హెచ్చుతూవున్నట్లుగా కనబడుతుంది. అస్సాం టీ తోటల్లో
పనిచేయడానికి చోటానాగపూరునుంచి జనం వలస వస్తే,
దగ్గిరేవున్న బెంగాలు రైతులు యీతోటల్లోకి పనికి రావ
డానికి యిష్టపడక, అధమం తమ దేశంలోని అనుము నిల్వల
కైనా పనికి వెళ్ళక యెక్కడో అస్సాం లోయల్లోవున్న సార
హీనమైన భూమి మున్నకోడానికే యిష్టపడతారు. ఇదే
విధంగా ఛోటానాగపూరు సమీపంలోవున్న బొగ్గుగనుల్లోకి
అక్కడి చుట్టుప్రక్కల ప్రజలు యెక్కరు కాని అక్కడికి
బీహారునుంచి జనం వలస వస్తూంటారు. ఇలానే యెందరో
దక్షిణాదివారు వుత్తరాదికి జీవనోపాధి నిమిత్తం వలసవస్తే,
వుత్తరాదివారు దక్షిణాదికి వ్యాపారనిమిత్తం వలస వస్తూం
టారు, కాని వీరి సంఖ్య అంచనావేసి చెప్పడానికి వీల్లేకుండా
వుంది. ఈ విధమైన ప్రాంతీయవలసల్లో యెందరు జనం
అక్కడికీ యిక్కడికీ వెళుతున్నారు చెప్పలేం సరిగదా, కొన్ని
కాలాల్లోమాత్రమే వుండే యీవలస పరిస్థితుల కేట్టఫలితా
లుంటాయోకూడా నిర్ణయించడం కష్టం. ఒక రాష్ట్రంలో
కొద్దిమంది వలసవెళ్ళినా వారిస్థానే మరికొందరు సమసిస్తూం

టారు. శాస్త్రీయమైన వలసలవల్లా, అంతరరాష్ట్రీయమైన వలసలవల్లా భూమిపత్తిడీ, జనాధిక్యతా అట్టే తగ్గవు.

వలసకి కారణం ధనాధిక్యతే అయితే భారతదేశంలో మరీధనాఢ్యమైన ప్రాంతాలూ బొత్తిగా నిరుపేద ప్రాంతాలు అట్టేలేవు. ఆర్థిక ఆకర్షణవల్ల వలస సాగుతుందనే దానికన్నా బీదతనంవల్లే వలస పోతున్నారనుకోడం మంచిది. వ్యవసాయం మిగిలిన వ్యాపారాలకన్నా లాభసాటిగా లేకపోవడం చేత రాష్ట్రీయ అంతరరాష్ట్రీయ వలసకు తగిన ఆకర్షణ లేకపోతుంది. "నీరు పల్లమెరుగు" అన్నట్లు గాకుండా వలసల్లో సాధారణంగా ధనంతో వున్నతంగా వున్న ప్రదేశాలకి ధనహీనంగా వున్న పల్లపు ప్రదేశాలునుంచే జనం వస్తూంటారు. ఇతర దేశాలకి వలసవెళ్ళే పరిస్థితులు లేనప్పుడు అంతరరాష్ట్రీయంగానే వలస సాగుతుంది. గత 30 యేళ్ళలోనూ భారతదేశంలో వలస సాగడానికి కారణాలు, కరువులవల్ల యేర్పడ్డ పరిస్థితులూ, పెద్దపెద్ద ప్రాజెక్టు నిర్మాణాలూ, కొత్తకొత్త నిర్మాణాలూ, నీటిపారుదల అధికంకావడంచేత సాగుకు నేల దొరకడం మాత్రమే అయివున్నాయి. వ్యవసాయ ప్రాజెక్టు నిర్మాణాలూ, కరువూ మొదలైనవి అప్పుడప్పుడు సంభవించేవి కాబట్టి వీటివల్ల వలసలు అభివృద్ధిచెందే సావకాశాలు లేవు.

అనాదిసిద్ధంగా భారతదేశంలోవున్న ఆర్థిక, సాంఘిక, సాంస్కృతిక, మత సంప్రదాయాలవల్లకూడా యిచ్చటి ప్రజలు వలసవెళ్ళడానికంతేయిష్టపడరు.

"పుట్టించోటే గిట్టుదాము" నే స్వభావం మనలో బాగా

పాతుకుపోయిందని జనాభా లెక్కలవల్ల తెలుస్తుంది. పాకి స్తాన్ విడిపోవడంవల్ల చాలామందిప్రజ లక్కడివారిక్కడికీ యిక్కడివారు కొద్దిమంది అక్కడికీ వలస వెళ్ళినట్లు తెలిసినా 1951 సం॥ రానికి ముందు తీసిన జనాభా లెక్కల ప్రకారం నూటికి 90 మంది పుట్టిన స్థలంలోనే నివసిస్తున్నారని తేలింది. మిగిలినవారిలో 100 కీ 5 మంది మాత్రం పక్కనున్న రాష్ట్రా ల్లోకీ, పట్టణాల్లోకీ పరిశ్రమల్లో పనిచేయడానికి వెళుతున్నారు. 1901 వ సం॥లో 100 కి 9.27 మంది మాత్రం వలస వెళ్ళినట్లు కనబడుతుంది. 1911 సం॥ నాటికి 100 కి 8.7 కి యీ సంఖ్య తగ్గిపోయింది. 1931 సం॥ నాటికికూడా యీనిష్పత్తే నిలచి వుంది. 1931–1941 మధ్య కాలంలోని వలస సంఖ్యలు తేలక పోయినా, యీమధ్యకాలంలో యేవిధమైన పరిణామాలూ (పాకిస్థాన్ విభాగంలాంటివి) జరగలేదు కాబట్టి వలస సంఖ్య అల్లానే వుండిపోయిందని వూహించాలి.

ఈ దేశంలో వలసలు తక్కువగా వుండడానికి గల ఆర్థిక కారణం చాలా తేలికగా చెప్పవచ్చు. వ్యవసాయదారుడు సాధారణంగా తనవున్న వూరినీ, దున్నే నేలని విడిచి వెళ్ళ డానికి యిష్టపడడు. వ్యవసాయం మనదేశంలో లాభసాటి వ్యాపారం కాకపోయినా, పట్టణాల్లోకి తర్లివెళ్ళడంవల్ల యేదో కొద్దిలాభంవున్నా, వ్యవసాయం వదిలి వెళ్ళిపోవలసినంత ఆకర్షణ బయట మరే యితరవ్యాపారాలకూ లేదు. అదే వలసలు లేకపోవడానికి కారణం. భారతదేశంలో వ్యవసాయా న్నొక వృత్తిగా అంగీకరించరు; జీవనాధారానికని వ్యవ సాయం చేస్తారు. తలమునకలుగావున్న అప్పులూ, తణకాలూ

కూడా మనస్తాపముని పల్లెలకు కట్టిపెట్టి వుంచుతున్నాయి. ఎవ
రైనాగాని తన వంశగతవృత్తి వ్యవసాయం మానుకుని వేరే
లాభకరమైన వృత్తిలో ప్రవేశించుదామని ఆశించినా, తగిన
వృత్తి దొరికేఆశ లేదుసరిగదా కొత్తవృత్తికి అనుగుణమైన
విజ్ఞానం, అలవాట్లు, నేర్పరితనం లేకపోవడంచేత అది
విజయవంతంగా కొనసాగడంలేదు.

పంటలులేని రోజులలో మాత్రం పల్లెలనుంచి పట్టణాల్లోకి
ధారావాహికగా జనం వలసవస్తుంటారు. వుత్సాహంగా. మన
స్ఫూర్తిగావచ్చిన వలసమాత్రంగాదిది. చేతిలో పైసాలేక,
పస్తులు మోతుకులకు, యేపనైనాసరే, పనంటూ దొరికితే అని
నిశ్చయించుకుని అప్పుడు పట్టణాలకు వలసవస్తుంటారు. అదైనా
మంచిరోజులు వచ్చినప్పుడు తిరిగిపల్లెలకు పోవచ్చుననే వుద్దే
శ్యంతో తాత్కాలికంగానే వలసవస్తారు. వెంట భార్యా
బిడ్డల్ని తీసుకురారు. అలా వాళ్ళైన తన వూరిగుడిసె వదలి
బందిఖానాలవంటి గూడుల్లోకో పట్టణం చేరుతారు.
తాత్కాలికమైన యీ వలసలే పట్టణాల్లో పురుషుల సంఖ్య
అధికంగావుండడానికి కారణం. భార్యాబిడ్డల్ని వొదిలి కడుపు
నింపుకు తీర్చుకోడానికీవిధంగా పారిశ్రామికులుగా పట్టణాల్లోకి
చేరడంవల్ల, వ్యభిచారం, దీనికిసంబంధించిన యింకా యెన్నో
సాంఘిక అనర్థాలు పుడుతున్నాయి.

కాన్ని మన సామాజిక పరిస్థితులవల్ల మనవారు స్వగ్రా
మాన్ని వదలలేకపోతున్నారు. ప్రాంతీయతా, భాషాభేదం,
కులం, మతం మొదలైనవికూడా పల్లెనీ, యిల్లునీ వదలితే

బాధపెడుతున్నాయి. పరరాష్ట్రానికి వెళ్ళడంమాట అటుంచి, వేరే పట్టణానికి వెళ్ళితేనే కొత్తరకం తిండీ, కొత్తపద్ధతులూ, కొత్త వేషభాషలూ బాధిస్తున్నాయి. వీటికితోడు యిప్పు డిప్పుడే తలయెత్తుతున్న భాషావైషమ్యాలూ, రాష్ట్రీయ వైషమ్యాలుకూడా వున్నాయి.

జనబాహుళ్యం తక్కువగావున్నచోటనే వలస లక్షణాలు హెచ్చుగావుంటాయి. ఎక్కడైతే జనం తక్కువగావుంటారో అక్కడ జనానికి సంబంధించినవారు హెచ్చుమంది బయట స్థలాల్లోనే వుంటున్నారు. 360 మిలియన్లు మంది భారత దేశంలో వున్నారంటే దేశం బహుకొద్ది వలసలకే అంగీకరించిం దన్నమాట కొంచెంవింతగానే కనబడుతుంది. అనాదిసిద్ధంగా వచ్చే ఆచారవ్యవహారాల్నీ, అలవాటైన పద్ధతుల్నీ పద్ధతుల్నీ వదిలి, యింకోచోట యింతకన్నా మంచి పరిస్థితులున్నా యన్నా వెళ్ళడానికి జనస్వభావం అంగీకరించదు. పర దేశా లకు వలసవెళ్ళడంవల్ల కలిగే లాభం ఆనందాలగురించికూడా కొంతప్రచారం చేయవలసిన అవసరం వుంది.

ప్రస్తుతపరిస్థితుల్లో అంతరరాష్ట్రీయ వలసలవల్ల మన జనాభాసమస్య లేమాత్రం పరిష్కరించబడవు. భారత దేశ విభాగంవల్ల యెందరో పాకిస్థాను నుంచి యిక్కడికి వస్తే యిక్కడివారు కొద్దిమందే అక్కడికి వెళ్ళారు. ఇప్పట్లో యింతభారీయెత్తున వలసలుపోయే అవసరాలురావు. పంచ వర్ష ప్రణాలికల్లో లఘు భారీపరిశ్రమలు స్థాపించబడితే అప్పుడు పట్టణాల్లోకి జనం ఆకర్షింపబడవచ్చును.

## భారతదేశం నుండి దేశాంతరం వలసపోయే సావకాశాలు

భారతప్రజలు, అంతర రాష్ట్రీయంగా గాని, పరదేశాలకు గాని వలసపోయే సావకాశాలున్నాయాయని ప్రశ్న ? సాంకేతిక విజ్ఞానసహాయంలోవున్న ఖనిజసంపదనీ, వున్న సారవంతమైన నేలనీ ప్రజల బాగుకుపయోగించుకొనే సాధనాలు ప్రపంచ దేశాలన్నిటిలోనూ సమానంగాలేవు. ఆకలితో అల్లల్లాడే ప్రజానీకంతోవున్న బీద దేశాలొకప్రక్కా, ధనధాన్యాలతో తులతూగే జనసాంద్రతలేని దేశాలొకప్రక్కా కనబడుతున్నాయి.

ధనవంతమై జనం తక్కువగావున్న దేశాలవారు, జనాభా హెచ్చుగావున్న దేశాల్నించి ప్రజల్ని తమ దేశాలకు తీసుకువెళ్ళడంవల్ల రెండు దేశాలకూ లాభంగావున్నా, కొన్ని రాజకీయ, సాంస్కృతిక, ఆర్థిక యిబ్బందులవల్ల వలసవెళ్ళడం కష్టమైపోతుంది. ముఖ్యంగా ఆసియా దేశాల కీచిక్కులు మరీ హెచ్చుగావున్నాయి.[15]

మనదేశవాసులు ప్రస్తుతం వలసపోవడానికేవిధమైన ఆస్కారంలేదు. ఆసియా ప్రజలకు అమెరికా, కెనడా, బ్రెజిల్ వంటి దేశాలు యెప్పుడో భవిష్యత్తులో తమదేశ ద్వారబంధాలు తెరుస్తాయని కూర్చోడానికి వీల్లేదు. ఆ దేశాలవారు

15. చంద్రశేఖరం గారి పుస్తకం — "ఆకలికడుపులు — ఖాళీభూములు" (Hungry people & Empty lands) [లండన్ — ఏలెన్ అండ్ యునెవిన్ 1954]. ఈ విషయాన్నిగురించి గ్రంథంలో చర్చించబడింది.

వలసను ప్రోత్సహించినా స్నేహభావంతో [illegible] మాత్రమే తావిస్తారు. సంవత్సరానికి 4 మిలియన్ల చొప్పున మనజనాభా పెరుగుతూంది. అటువంటప్పుడు ఎటువంటి జనసాంద్రతలేని దేశమైనా సంవత్సరానికి 4 మిలియన్ల జనాభాను తావుచూపించడమనేది జరగనిపని.

హెచ్చుజనం వలసవెళ్ళినా ప్రయాణపు ఖర్చులు భరించడంకూడా కష్టసాధ్యమైనపనే !

పూర్వం నావికులకు భారతదేశం ప్రసిద్ధిచెందింది. విలువైన సరకుల్ని భారతదేశం యితర దేశాలకు ఎగుమతి చేసేది. ఇంతకన్నా అధికంగా శాంతిమత ప్రచారం సాగింది. ప్రస్తుత ఆగ్నేయాసియా అంతా ఆనాటి వలస భూమిగానే పరిగణింపబడింది. ఆనాడు వలస వెళ్ళిన ప్రజలు, ధైర్యసాహసాలతో, నూతనమైన ఉత్సాహంతో, మతంకోసం వ్యాపారం కోసం వలసవెళ్ళేరేగాని జనాభా సమస్యలవల్ల వలస వెళ్ళలేదు. కాని యిటీవల చాలామంది భారతీయులు ప్రపంచం నాల్గు మూలలకీ, ముఖ్యంగా కామన్వెల్తు రాజ్యాలకు, పెద్దవుద్యోగాలనిమిత్తం, తమ అధిక ఆదాయం నిమిత్తం వలస వెళ్ళుతున్నారు. ప్రపంచదేశాల్లోవున్న భారతీయులు 4 మిలియన్లమంది. వీరందరూ ఆనందంగా వున్నారనుకోవడం పొరబాటు. ఇతర దేశాలెంతమంది మన జనానికి తావిచ్చినా మన దేశంలో జనాభా సమస్యమాత్రం అంత తేలికగా పరిష్కరింపబడదు. నేటి ప్రపంచ పరిస్థితుల్ని బట్టి మన జనానికి మన దేశంలోనే సదుపాయాలు కలగజేయకతప్పదు.

---

# నాలుగవ అధ్యాయం

## సంతాన నిరోధక విషయంలో కొన్ని నైతిక మత విషయిక దృక్పథాలు

"ఏ దేశంలోనైనా ప్రజాభ్యుదయ ప్రణాళికల్ని నిర్ణయించేముందు, ఆ దేశంయొక్క జనాభాని దృష్టిలోవుంచుకుని ప్రస్తుతజనాభా అధికంగావుందా, వుండవలసినదానికి న్నా తక్కువగావుందా, లేక యింకా అభివృద్ధి చెందాలా అనే విషయాల్ని సమగ్రంగా పరిశీలించినమీదటనే జాతీయ ప్రణాళికల్ని రూపొందించాలి" అని 30 సంవత్సరాలక్రితం జాన్ మేనార్డ్ కీన్సుగారు చెప్పారు.[16]

"భారతజనాభా సమస్యల పరిష్కారానికి ప్రణాళికల మాటేమిటి"? "మన దేశ వైశాల్యాని కెంతజనాభావుండడం ముదావహం"? ఈ మొదలైన విషయాలికి సమాధానం చెప్పాలంటే మనం రకరకాలుగా చెప్పవచ్చు, కాని యేది మనయొక్క లక్ష్యమో ముందు నిర్ణయించుకోవాల్సివుంటుంది. మనము ప్రజలకేది లాభదాయకం? ప్రయోజనకారి? అని నిర్ణయించే మరీ జనాభాయొక్క, పెరుగుదల, అరికట్టడం మొదలైన విషయాలు నిర్ణయించబడాలి. ఏది ప్రజలకు ఉపయోగకరం" అన్నదానికి వేరువేరు శాఖలవారు వేర్వేరు

16 "శాంతివల్ల ఆర్థిక ప్రయోజనాలు" జె. యం. కీన్సు గారు (లండన్) పే. 8.

నిర్వచనాల్నిస్తారు. అత్యధిక సంఖ్యాకులు సైనికులు కావాలి గనక యెక్కువ ప్రజ కావాలని రక్షణ శాఖవారనవచ్చు; సామ్రాజ్య వాదులు దృష్టిలో అధిక జనాభా వుంటే వలస రాజ్యాల్లో చౌకగా పరిశ్రమలు కొనసాగించవచ్చునని అభిప్రాయపడతారు; సంఘంలో వలసిన వస్తువులకు కొదువ లేకుండా బతకాలని సామాన్యుడనుకుంటాడు. ఏదేశానికైనా ఎంత జనాభా వుండాలీ అనే ప్రశ్నకి సమాధానం చెప్పడం తేలికైన విషయం కాదు. ఏ సంఘంలో, దేశంలో ప్రజలు హాయిగా ఆనందంగా, అంటే పారిశ్రామికంగానూ, రాజకీయంగానూ, ఆర్థికంగానూ, సాంఘికంగానూ అభివృద్ధిచెందినదై నందిన జీవనప్రమాణం అధికంగాకల్గి, సాంస్కృతిక, కళారంగాల్లో తమ విరామకాలాన్ని వుపయోగించుకోగల్గేట్లుగా వుంటారో అంతజనాభాయే ఆదేశం కల్గివుండడంమంచిది.

ఒక దేశాని కెంతజనాభా వుండాలి? అనే విషయాన్ని ఆయా దేశ పరిస్థితుల్నిబట్టి ఆదేశమే నిర్ణయించుకోవడం మంచిది. అలవిగాని జనాభావున్నా ఆజనాన్ని నాగరికుల్ని చేయడం సాధ్యంగాని పనేగాక వార్ని సంస్కారవంతులుగా చేయడ మసాధ్యం. సూక్ష్మాతిసూక్ష్మమైన జీవిని ఒకేసారి పెద్దజంతువుగా చేయడ మెంత అసాధ్యమైన కార్యమో యిదీ అలాంటిదే! శరీరశాస్త్రరీత్యా కొన్ని అవయవాల అభివృద్ధి యెంతపరిమితమో అదేవిధంగా కొన్ని దేశాల పరిస్థితుల్నిబట్టి అక్కడి జనాభా అభివృద్ధికూడా అంతపరిమితమే కావాలి. ఏనుగుకు పదింతల శరీరం గల జంతువే వుండడం సృష్టిలో తటస్థపడితే, అది కదలడానికి కూడా యెంత అవస్థపడుతుందో

అలాగే యే దేశమైనా భరించలేని జనం భారంతో వుంటే కూడా, బొత్తిగా హెచ్చుజనాభాని భరించలేదు. అల్లాగే, 200 మంది జనం వుంటేనే అది మహాగొప్ప జనసంఘంగా ఏర్పడదు.[17] భారతదేశాని కెంతజనాభావుంటే సుఖదాయకంగా వుంటుందీఅని యిప్పాను ప్రశ్న ? ప్రస్తుత పరిస్థితులను బట్టి మన జనాభా యిప్పుడు పెరుగుతున్నట్లు మరీ విపరీతంగా గాకుండా, మరీ తగ్గిపోకుండా వున్నజనాభా అలాగే వుంటే బాగుంటుంది.

జనాభా యెంత తక్కువగా వుంటే అంత అభివృద్ధి చెందడానికి అవకాశాలు వుంటాయి. జాతిదృష్ట్యా యీఅభివృద్ధి మంచికీ చెడుకూ కూడా పునాది వేస్తుంది. అభివృద్ధి అంటే యేమిటనే విషయంలో వివిధాభిప్రాయాలు వున్నాయి కాని యేది అభివృద్ధికరం కాదనే విషయంలో మాత్రం తగాదాలు లేవు. సంఘంలో నిష్ప్రయోజకులుగావున్న పిచ్చివాళ్ళనీ, రోగిష్టుల్నీ, దొంగల్నీ అభివృద్ధికి తీసుకువచ్చే ప్రణాళికల విషయంలో పేచీ యేమీలేదు. మన ఆరోగ్యవిద్యాశాఖల వివరాల్ని గురించి తెలిసిన ప్రతీవారూ మనం యెంత వెనుకబడి వున్నామో, యింకా యెంత అభివృద్ధికి రావాలో అన్న విషయంలో ఏకీభవిస్తారు. మనం యింత వెనకబడి వుండడానికి కారణం వంశపారం పర్యంగావచ్చిన లోపాలుకావనీ, మనలో బాగా వ్యాపించివున్న నిరక్షరాస్యతా, అనారోగ్యాలే కారణాలనీ తెలుస్తుంది.

17. జూలియన్ హాక్సలీగారి U. N. E. Sco యొక్క లక్ష్యం విధానం. ( వాషింగ్టన్ O. C. పబ్లిక్ ఎఫైర్సు 1947 ) పేజీ 15.

మనప్రజలు ఆరోగ్యవంతులై వర్ధిల్లాలంటే కనీసం ఆరోగ్యవంతమైన నివాసస్థలాలుండాలి. యదార్థానికటువంటి పరిస్థితులు కరువైయ్యాయంటే మనం యింకా యెంత వెనకబడి వున్నామో అర్థమవుతుంది. ఇక ఆహారసమస్యని గురించి చూద్దాం. అందరికడుపునిండా పట్టెడు మెతుకులు దొరికే స్థితిలోకేమనం యింకా రాలేకంటే, ఆహారవిధాన శాస్త్రజ్ఞులు నిర్ణయించిన పుష్టికరమైన ఆహారం పండించే స్థితిలోకుండా మనం లేమని వేరే చెప్పనక్కరలేదు. అనుదినం పెరుగుతున్న యీ జనాభాకి చాలినంత తిండి పెడుతూనే వారి జీవనప్రమాణాన్ని యెలా అభివృద్ధి చేయడమూ అనేదే మనల్ని నేడు యెదుర్కొంటూన్న గడ్డుసమస్య. మన సమస్య ముందు చూస్తే నుయ్యి వెనకచూస్తే గొయ్యిలా వుంది. అసలే అంతంత మాత్రంగా వున్న జీవనప్రమాణాన్ని యింకా దిగజారి పోకుండా వారికి ప్రత్యేక జాగ్రత్త పడాల్సిన అవసరం వుంది. దీనికితోడు రోజురోజుకూ పెరిగిపోతున్న జనాభాని అరికట్టి జీవనప్రమాణాన్ని వృద్ధిచెయ్యడంకూడా చాలా అవసరం. భారీయెత్తున పరిశ్రమల్ని స్థాపించకపోతే మనజనాన్ని పోషించలేం. జీవనప్రమాణం పెరగాలంటే జనాభా పెరగకుండా అరికట్టడం చాలా ముఖ్యం. అంతేగాక వున్న జనాభాని మంచిస్థితిలోకి తీసుకురావల్సి వుంటుంది.

## సంతాన నిరోధం

పెరిగిపోతున్న మన జనాన్ని అరికట్టాలంటే మనకి శరణ్యం సంతాన నిరోధం, కుటుంబ నియంత్రణా! సంతాన నిరోధం

మంచిదా చెడ్డదా అని విమర్శించే అవసరం మన దేశానికిలేదు. కృత్రిమ సంతాన నిరోధంవల్లవచ్చే లాభనష్టాల్ని గురించిన విమర్శలుకూడా చాలాకాలంకిందటే అణిగిపోయాయి. విజ్ఞానైన పెద్దలీ విషయాల్ని గురించి విపులంగా కూలంకషంగా విమర్శించడంవల్ల సంతాన నిరోధాన్ని సహ్యాలూ నొప్పుకోవడమేకాక విజ్ఞాన శాస్త్రరీత్యా దీన్ని అమలు పెట్టడానికి మార్గాలు కూడా అన్వేషించబడ్డాయి. ప్రపంచం యింత ముందుకుపోతున్నా యింకా మనవారు దీని వుచితా నుచితాల్ని చర్చించడంలోనే మునిగివున్నారు. అందుచేత దేశకాలపరిస్థితులననుసరించి సంతాన నిరోధాన్ని అంగీకరించేవారూ, అంగీకరించనివారూ చెప్పే కొన్ని విషయాల్ని గురించి యిక్కడ చెప్పడం అప్రస్తుతం కేమాత్రంకాదు.

## సంతాననిరోధమంటే యేమిటి?

అసలు సంతాననిరోధ మంటే యేమిటి? అని ప్రశ్న ప్రకృతిలో సహజంగా స్త్రీపురుషుల మధ్య వుండే ఆకర్షణ ఫలితంగా కలిగే మానసిక శారీరక వాంఛాతృప్తివల్ల కలిగే కొన్ని సమస్యలకు సమాధానంగా మానవుడు తనమేధాశక్తి వల్ల ప్రకృతిని జయించడానికి యెత్తిన ధ్వజమే సంతాన నిరోధం. అంతర్జాతీయ శాంతిసౌహార్ద్రాల కైతేనేమి, జాతీయ జనాభా సమస్యా పరిష్కారానికైతేనేమి సంతాననిరోధం యెంతో వుపయోగకరంగా వుంటున్నది ఆరోగ్యప్రణాలికల్లో. మానవహృదయాల్లోవున్న విభిన్నప్రకృతులకీ, అభిప్రాయాలకీ యిది చక్కని మధ్యవర్తి. సంతానకాంక్షకీ వాంఛాపూర్తికీ

అనాదినుండీ యీవైరం వుండనే వుంది. ఈ రెండు భావాల జయాపజయాలమీదే మానవసమాజాభివృద్ధి క్షీణతా ఆధారపడి వుంటుంది. (చెట్లన్నిటికీ, కొన్నిమృగాలికీ సంతానేచ్ఛ వుండదు.) అసలు యీసంఘర్షణ యెందుకు కలగాలి? మానవులకి కాంక్షా పూర్తితోపాటు సంతానాభివృద్ధి కావాలని యిచ్ఛ వుంటే సమస్యే లేదు. కొన్ని ఆర్థిక, ఆరోగ్య సాంఘిక కారణాలవల్ల కొందరికి సంతానాపేక్ష వుండదు. కాని వారు యిచ్ఛాపూర్తి కావాలని కోరుతారు. భార్యాభర్తల హృదయాల్లో కామేచ్ఛ అధికంగావున్నా బిడ్డలు కలుగుతారనే భయంతో కోర్కెలను బలవంతంగా అణగదొక్కుకోవడంవల్ల చాలా మానసికపీడలూ శారీరకబాధలూ కలిగి యెన్నో సమస్యలను దారితీస్తాయి. ప్రఖ్యాతిపొందిన అమెరికన్ సాంఘికశాస్త్రవేత్త H. P. ఫెయిర్ చైల్డ్సుగారీవిషమ సమస్యల్ని గురించీ కిందివిధంగా చెప్పారు. "కామానికి లొంగిపోయిన మానవుడి యిష్టాయిష్టాల ప్రమేయం లేకుండానే సంతానం కలుగుతుంది. సంతానమే కావాలనే ప్రబలమైన కోర్కెవుంటే తరుచు కోర్కెల్ని తీర్చుకునే అవకాశం వుండదు. పిల్లలు అవసరం లేకుండానైనా వుండాలి."[18]

ఈ సమస్యాపరిష్కారం చేయగలిగిం దొక్క సంతాననిరోధమేను. సంతాననిరోధమని వాడుకలోకి వచ్చినా దీనికీ పేరు తగింది మాత్రం కాదు. సంతానకారణమైన గర్భాన్ని నిరోధిస్తుందిగాని దాన్ని పోగొట్టి సంతానం

18. H. P. ఫెయిర్ చైల్డ్స్ – మానవులనే గ్రంథంలో 60 వ పేజీ (న్యూయార్కు. హెన్రీ హోల్ట్, 1939 సం॥)

కలగడం ఆపుచేయును. నాగరిక ప్రపంచ మంతటికీ
సంతాననిరోధ మంటే గర్భస్రావం కాదనీ, గర్భనిరోధమేననీ
యీ రెంటికీ అన్ని విషయాల్లోనూ చాలా తేడాలున్నాయని
గుర్తించింది.

కొందరు సంతాననిరోధ మంటే గర్భస్రావమే నని గర్భం
లోని జీవిని హత్యచేయడమేనని వాదిస్తారు. వారికి పై సమా
ధానం తృప్తి ఈయవచ్చు. గర్భధారణే జరగనప్పుడు గర్భ
స్రావంగాని గర్భంలోని జీవి హత్యగాని యెలా జరుగుతుంది?
శాస్త్రరీత్యా సంతాననిరోధ మనేమాట వాడడానికి వీల్లేక
పోయినా విఖ్యాత అమెరికన్ శాస్త్రజ్ఞురాలైన మార్గరెట్ సేన్‌గర్
ఈపదాన్ని వాడుకలోకి ముందు తీసుకురావడంవల్ల ఆ పదమే
ఖాయమైపోయింది.[19]

సంతాననిరోధాన్ని అమలు పరచడంవల్ల అవసరమైనప్పుడు
సంతానాన్ని కనేందుకుకూడ వీలుంటుంది. "సంతానమంటే
తమకి భగవంతుడువల్ల వొప్పజెప్పబడిన వొక మహత్తర
కళాత్మకమైన కార్యంగానూ, గొప్ప ఆస్తిగానూ తలిదండ్రులు
భావించిన రోజునే వారు వారిబాధ్యతలను చక్కగా నెరవేర్చ
గలుగుతా"రని శ్రీమతి సేన్‌గర్ అన్నారొక సందర్భంలో.
అనవసరబాధ పడకుండా, క్లోరోఫారమ్ వుపయోగిస్తున్నట్టు
గానే, జబ్బులూ, అంటురోగాలూ రాకుండా యింజక్షన్లు
వాడుతున్నట్టుగానే మానవుడు అనవసర సంతానం కలగ

19. "వుమెన్ రిబెల్" ఈ పేరుగల గ్రంథంలోనే ముందు
ఈ మాటను మార్గరెట్ సేనగర్ వుపయోగించారు. (న్యూయార్క్ 1914
ఏప్రియల్).

కుండా వుండడాని కీ సంతాననిరోధాన్ని కనిపెట్టి ప్రకృతి
శక్తుల్ని జయించి యింకొక పై మెట్టుకు వెళ్ళాడని చెప్పాలి.
"తొలి మానవుడు నిప్పుచేయడం కనిపెట్టి గొప్పవిప్లవం
ప్రపంచంలో తెచ్చాడు! అలాగే రాయనూ చదవనూ
కనిపెట్టి తన దండయాత్రలో యింకొక విజయపతాక స్థాపిం
చాడో, అలాగే ఆధునిక మానవుడు యీ సంతాన నిరో
ధాన్ని కనిపెట్టి పెళ్ళి, నీతి, శాంతి యుద్ధం మొదలైన
భావాత్మక ప్రపంచంలో అంత విప్లవం లేవదీయగలిగా" డని
విఖ్యాత రచయిత జూలియన్ హక్సలీ అన్నాడు. సంతాన
నిరోధంవల్ల ఆర్థికంగా రాజకీయంగా సాంఘికంగా మానవుని
జీవితంలో యెంతో మార్పు రావడమేగాక దీనిఫలితంగా
యెన్నో అస్త్రాలూ, అనవసరయుద్ధాలూ వుండకపోవడంవల్ల
మానవశాంతికీ చివరకు మానవుడి బతుకే మార్పడానికి వీలౌ
తుంది. సంతాన నిరోధం అన్నివర్గాలలోనూ, అన్ని దేశా
ల్లోనూ అలుముకుంటే యే రాజకీయ విప్లవం యెన్నడూ
చేయలేని పని నిది చేయడమేగాక విపరీతమైన భావవిప్లవం
తీసుకువస్తుంది. ఆదిమవాసియై మానవుడు మానవుడిమాంసం
తింటూ యుద్ధాలుచేస్తూ చివరకు విజ్ఞానవంతుడై శాశ్వత
శాంతి నెలకొల్పే పరిస్థితులుకూడా కలగవచ్చు.

పాతుకుపోయిన కొన్ని పాతభావాలతో, ఈర్ష్యా ద్వేషా
లతో సంతాన నిరోధాన్ని చూడ్డంవల్ల దాని మహత్తరశక్తి
సామాన్యుల కర్థంకావడంలేదు. కొన్ని దేశాల ప్రభుత్వాలతో
పాటు రోమను కేథలిక్కు చర్చి సంతాన నిరోధాన్ని దుయ్య
బట్టుకుంది. కొన్ని దేశాల్లో సంతాన నిరోధం చట్టనిరోధమే

గాక, దాన్ని గురించిన సాహిత్యంగాని చర్చలుగాని నిషేధించబడ్డాయి. సంతాననిరోధం నూతనమైందీ, విచిత్రమైందీ కనక దీన్ని పూర్తిగా బహిష్కరిస్తేతప్ప దేశంలోని ప్రజలు అవినీతిపరులై కొన్నాళ్లకు దేశమే శూన్యమైపోయే పరిస్థితికి రావచ్చునని కొన్ని దేశాలు వితండవాదన విపరీతంగా చేస్తూ, ఈ విషయమైన విషయాలన్నిటినీ తెరమరుగున రహస్యంగా వుంచుతున్నాయి. మార్పు నంగీకరించక, పాతచింతకాయే పథ్యానికి మంచిదని, కూపస్థమండూకాల్లా వుండి, యుక్తాయుక్త విచక్షణ చేయకపోగా కొత్త ఆలోచనకే మనసులో తావివ్వనివారెవరో చెప్పే కబుర్లవి.

నిజంచెప్పాలంటే మానవజాతిచరిత్ర యెంత పురాతనమైనదో సంతాననిరోధం చరిత్రా అంతే పురాతనమైంది. మూడువేల సంవత్సరాలక్రితంనుంచే మానవుడికి సంతాననిరోధమేగాకుండా, గర్భనిరోధంకూడా తెలుసు. జెనిసిస్, హెరోడోటస్‌ల కాలంనుంచీ "శుక్లనిరోధం" (coitus interruptus) అవలంబిస్తూనే యుండేవారు. కాహున్ పేపిరస్ (Kahun Papyrus) [క్రీ॥ పూర్వం 1850] ఎబర్ పేపిరస్ (Eber Papyres) [క్రీ॥ పూర్వం 1550] [20] ల కాలంలో రెండు రకాల సంతాననిరోధాన్ని అవలంబించేవారని డాక్టరు నార్మన్ హైమ్సు (Narman Himes) రాశారు. అనాది నుంచీ మానవుడు సంతానాన్ని నిరోధిస్తూనే వున్నాడు. కొన్ని కొన్ని సందర్భాల్లో సన్యాసి కావడంచేత, కొన్నిస్థలాల్లో

20. నార్మన్. ఇ. హైమ్స్. వారు రచించిన వైద్యపు సంతాన నిరోధ చరిత్ర (లండన్ ఏలెన్ యునవిన్ 1936) పేజి 63.

బ్రహ్మచర్యావలంబనం వల్ల, యింకా కొన్నిచోట్ల గర్భ స్రావంవల్ల, మరికొన్నిచోట్ల పుట్టిన శిశువుప్రాణాలు తీస్తూ వుండేవారు — విజ్ఞానశాస్త్రరీత్యా సంతాననిరోధాన్ని చేసే అలవాటు గతశతాబ్దంనుంచీ అమలులోకి వచ్చింది. కాని గత అరశతాబ్దంనుంచీ దీన్ని మిక్కిలి ప్రచారంలోకి సామాన్యుల కందుబాటయ్యే విధానాల్లోకి తీసుకురాగలిగారు. దీని ఫలితాలింకా పూర్తిగా సంతృప్తికరంగా లేకపోయినా చాలా వరకూ ప్రమాదం లేకుండా, సుఖంగా వుండేట్లు మాత్రం చేయగలిగారు.

## సంతాన నిరోధం అవినీతికరమైందా?

సంతాన నిరోధాన్ని ప్రచారంలోకి తీసుకువచ్చేప్పుడు మొట్టమొదట యెదురయ్యే సమస్య అది. నీతిబాహ్యమైనదన్న భావమేను. నీతి అనేపదంయొక్క అర్థం దేశకాలపరిస్థితుల్ని బట్టి సంస్కృతీ సాంప్రదాయాల్ని బట్టీ మారుతుంది: సంఘాభివృద్ధికీ ఆనందానికీ ఆ సంఘంలోని విజ్ఞులచేత ఆ కాలాను గుణంగా కొన్ని నీతిదాయకమైన పనులుగా నిర్ణయించబడుతూ వుంటాయి. కాబట్టి నీతులన్నీ మానవకల్పితాలు గనక అవి మారుతాయనీ, మారాలనీ మనం ఒప్పుకోవాలి. ప్రజాభివృద్ధి కనుగుణంగా అన్నినీతులూ కాలానుగుణంగా మార్పు చేయవల్సి వుంటుంది. అనాదిసిద్ధంగా నీతిప్రాధాన్యమైనవీ, ఆరోగ్యకరమైనవీ అను కొన్నికొన్ని ఆచారాలు నేడు అవి నీతికరమైనవీ, అజ్ఞానమయమైనవీ అనుకుంటున్నారు. దీనికి వుదాహరణ లివ్వాలంటే యెక్కడకో పోనక్కరలేదు, మన

దేశంలో వొకప్పుడు పవిత్రంగా తలచబడే 'సహగమనం' వితంతూద్వాహనిరోధం బహుభార్యాత్వంగూర్చి ఆలోచిం చండి. ప్రాజ్ఞతవున్న యే సంఘంలోనైనా అభివృద్ధికరమైనవీ, అభ్యుదయకరమైనవీ మార్పులు జరగడంవల్ల దానికి నవచైతన్యం నవజీవనం వస్తాయి. "అనాదిసిద్ధమైన ఆచారాల్నీ, అలవాట్లనీ పట్టుకుని వేళ్ళాడ్డమే సంఘపతనానికి హేతువు." నిర్జీవత్వంవల్లే యిటువంటిభావాలు కలుగుతాయి. చట్టాలు, శాసనాలూ కాలానుగుణంగా మారుతూ వుండాలి. "అనాది సిద్ధంగా వస్తూన్న తాతముత్తాతలనాటి ఆచారాల్ని కొన్నిటిని మనం పాటించలేక పోతున్నామంటే దానికికారణం మనకివారియెడ గౌరవం లేకపోవడంమాత్రం కాదు, కాని మారుతున్న కాలానికనుగుణంగా మనంకూడా మారాల్సిన అవసరం రావడమే. మార్పువల్ల నిజానికి మనసుకు బాధ కలగదు, కాని మార్పు అవసరంలేదని అనుకోవడం వల్లే మార్పు బాధిస్తుంది మనల్ని. జీవిత నగ్నసత్యాల్ని యెదుర్కొనే సాహసంలేకా, జీవితాల్లో కలిగేమార్పు నంగీకరించలేకా, జీవితంపైనవుండే మమతవల్లా మనం మార్పునంగీకరించకుండా యిలా నేవుంటే కొద్దికాలంలోనే మనం ఆత్మవంచకులుగా తయారవడం తప్పదు. ఆత్మవంచన మానవహృదయాన్నీ, మనసునీ పీల్చేసే మహామారి.[21]"

సంతానసనిరోధం నీతిబాహ్యమైందా కాదా అని నిర్ణయించే ముందు దాని ప్రయోజనాల్ని గూర్చి ఆలోచించాలి గాని

21. పిగల్ జక్ గారు న్యూయార్కులో అమెరికా సంతాన నిరోధ ఫెడరేషన్, 1936 సం॥లో మాట్లాడారు.

దాన్ని తార్కికదృష్టితో చూడకూడదు. ఆర్థిక రాజకీయ సాంఘికవ్యవస్థలకు వ్యతిరేకంగా కొన్ని నీతులుంటాయి. వాటిని కల్పిస్తారు. ఏదైన నూతనవ్యవస్థ, నూతనధర్మం సంఘానికి ప్రయోజనకారిగావుంటే ఆధర్మాన్ని వ్యతిరేకించే చట్టాన్ని మార్చడంవల్ల ప్రయోజనముంటుంది గాని ఆధర్మాన్ని వదలడం వల్ల ప్రయోజనముండకపోగా నష్టంకూడా వాటిల్లుతుంది. ప్రఖ్యాతి వహించిన వొక అమెరికన్ విజ్ఞుడొక సందర్భంలో మాట్లాడుతూ "మీరందరూ చెప్పేట్టు సంతాననిరోధం నీతి దాయకం కాకపోవచ్చు, కాని చాలామంది కుపయోగకారిగా వుంది కాబట్టి యిదే మాకు నీతి" అన్నారు.

సంతాననిరోధం అవినీతినీ వ్యభిచారాన్నీ వృద్ధిచేస్తుందా ?

సాధారణంగా సంతాననిరోధాన్ని వ్యతిరేకించేవారు — ఈ రకంవాళ్ళు మన దేశంలో యింకా చాలామంది వున్నారు లెండి — చెప్పే సాకేమిటంటే, యిది అవినీతిని అభివృద్ధిచేస్తుంది అని. దీన్ని వ్యభిచారులకీ, కామాతురులకీ, నీతిబాహ్యులకీ సంబంధించిన విషయంగా మన దేశంలో తలుస్తారు. పెళ్ళి కాని వారు యధేచ్ఛగా వర్తించడానికి ముఖ్యంగా అవివాహితులైన యువకులూ, అందులోనూ పిల్లలుకలగకుండా వుండాలనే స్వేచ్ఛాచారులైన యువతులకు మాత్రమే దీని వుపయోగ మని చాలామంది విమర్శకుల వితండవాదన. వారు వాదనకోసం యెంత యేహ్యంగా వర్ణించాలో సత్యాన్ని అంత అసహ్యంగానూ వర్ణించారు. వారి వాదనలోని కొన్ని యంశాలు యీ దిగువనున్నాయి చూడండి మచ్చుకు. కుత్రిమసాధ

సంవల్ల సంతానం కలగదనే ధైర్యంతో ధనవంతులైన యజమానులకు తక్కువజీతాలు పుచ్చుకుని కైపిస్టులుగానో మరే వుద్యోగినిగానో వుంటూ రోజులుగడుపుతున్న ఆడపిల్లలు తేలికగా లొంగిపోయే అవకాశాలు హెచ్చవుతాయి. పురుషులకు స్వేచ్ఛగా పరస్త్రీలతో సంబంధాలు పెంచుకోడానికి వీలవుతుంది. అమాయకులైన కన్యల్ని తేలిగ్గా పాడుచేయడానికి సావకాశాలు కల్గుతాయి.

పై విమర్శలకొక్కటే సమాధానం. కేవలం భయంవల్లే నిలిచే నీతి నీతా అని ? వాక్కాహంతకులూ, దొంగలు తప్పితే భయంవల్లా యెవరూ యేపనీచెయ్యడం మానరు. దొంగల్నీ హంతకుల్నీ భయం యెంతవరకూ చెడుపనుల్నించి అడ్డుతుందో అంతేకూడా మిగిలినభయాలు చేసే పనులకు అడ్డురావు. పాపానికి జడిసి దూరంగావున్నారు ప్రజలంటే అటువంటివారంతా నీతిపాత్రులకింద మనం జమకట్టవలసిన పని లేదు. నాలుగు గోడలమధ్యా వుంటేనే, వుండేనీతీ బురఖా వేసుకుంటేనే గాని రక్షింపబడని నీతి, శిక్షకి భయపడే నీతి నీతికాదు. సంతాన నిరోధంవల్ల అవినీతి పెరగడానికి బదులు, న్యాయవిరుద్ధంగా పుట్టిన సంతానం, అవివాహితులైన తల్లుల సంఖ్యా తగ్గిపోవడమేగాక, సంఘంలో నీతి హెచ్చడానికి హెచ్చు అవకాశాలుంటాయి. ప్రపంచంలో యెక్కడచూసినా యెందరో అనాథులు, నా అన్నవారు లేక, నానా అవస్థలూ అగచాట్లూ పడుతూ, పరిహాసపాత్రులై, కళంకమయజీవనం గడుపుతున్నారు. దీన్నే వేరేవిధంగా చెప్పాలంటే ప్రపంచమున్నంత కాలం నీతిబాహ్యమైన కలయికలూ తప్పవు. దానికి ఫలి

తంగా కలిగే అనవసర సంతానంతప్పుడు, వారుపడే బాధలూ తప్పవు అని చెప్పాలి. మొదటిరోజుల్లో సంతాననిరోధం అమలులోకి రావడంవల్ల కొంతవరకూ వ్యభిచారం హెచ్చితే హెచ్చవచ్చు. అంతేగాదు పెళ్ళిఅవనివారిలోనూ, అయిన వారిలోనూ కూడ నీతిబాహ్యత కనబడవచ్చు కాని ప్రపంచాని కవసరంలేని సంతానం సంఖ్యమాత్రం తగ్గిపోతుంది.

ప్రతీవారూ చట్టాన్ని వ్యతిరేకించరు. ఎంతమంచి చట్టమైనా కొద్దిమందిచేత యెప్పుడూ ధిక్కరించబడుతూనే వుంటుంది. ఎవరోకొందరు స్వార్థపరులు తమస్వప్రయోజనాల కోసం, సంఘాభివృద్ధికై ఉపయోగపడే సాధనాల్ని, వుపయోగించుకుంటున్నారంటే ఆతప్పు ఆ సాధనానిది కాదు. మంగలి కత్తులతో యెవరోకొందరు గొంతుకులు కోసుకుంటారని కత్తులన్నిటినీ బహిష్కరిస్తామా! అలాగే ఎవరో కొద్దిమంది నూతుల్లోనూ, చెరువుల్లోనూ పడుచున్నారని, నూతులూ చెరువులూ వుండకూడదని అనగలమా!

## సంతాననిరోధం ప్రకృతి విరుద్ధమా?

కొందరిమతంలో సంతాననిరోధం ప్రకృతివిరుద్ధమనే అభిప్రాయంవుంది. సహజంగా ప్రకృతిలో సంభవించేదాన్ని అలా జరగకుండా మానవుడు బాహ్యసాధనలలో దాన్ని అరికడుతున్నాడనే భావమే ఈయభిప్రాయానికి కారణం కావచ్చు. మానవుడు పుట్టినదిమొదలు చచ్చిపోయేవరకూ ప్రకృతితో యుద్ధం చేస్తూనే వుంటాడు. మానవనాగరికతే ప్రకృతిమీాది విజయపతాక. తెల్లవారిలేచి, క్షౌరం ఆరంభించింది మొదలు,

మనం క్షౌరం చేయడం దగ్గరనుంచీ, గోళ్ళు కత్తిరించుకోవడం అన్నీ ప్రకృతికి విరుద్ధమైన పనులే. అల్లాగే బ్రిడ్జీలు కట్టడం స్టీమర్లు కట్టడం, విమానాలమీద యెగరడం, ఆనకట్టలు కట్టడం, రేడియోలు కనిపెట్టడం, రాకెట్లూ, స్పుట్నిక్కులూ ఎగరవేయడం ఇవన్నీ ప్రకృతివిరుద్ధాలే! ఇకమనం కట్టుకునే బట్టలూ, తినేదినుసులూ, వంటలూ వేరేచెప్పాలా? నిజానికి మానవులు ప్రకృతిశక్తుల్ని జయించడమేగాకుండా ఆ శక్తుల్ని తన ప్రయోజనానికి ఉపయోగించుకుంటున్నందుకు గర్విస్తున్నారు. ప్రకృతికే మానవుడు తనకార్యాలను వొదిలివేస్తే యిన్నాళ్ళుపడిన కష్టమంతా బూడిదలోపోసిన పన్నీరుకావడమేగాక అనాదికాలంనాటి అడవిమనిషిక్రింద అవడానికి అట్టే కాలం పట్టదు.

మానవుడు పశుప్రాయుడు కావాలనేవారే ప్రకృతిసిద్ధంగా వుండాలనేవారు. ఇలా అనడానికి కారణం పశుపక్ష్యాదులు ప్రకృతిసిద్ధంగా వుండడమే. మానవుడలా కాకుండా ప్రకృతి శక్తులను లొంగదీసుకుని అభ్యున్నతి సాధించాడు. ఎన్నోవిషయాల్లో మానవుడు ప్రకృతికివిరుద్ధంగా నడుస్తున్నప్పుడు, తన కత్యంతావశ్యమయిందీ, వుపయోగకరమైనదీ అయిన సంతాననిరోధాన్ని యెందుకవలంబించకూడదు? అనాదిగా మానవుడి హృదయంలో రేగే పశుప్రవృత్తికి తాత్కాలికంగా లొంగిపోయి, అవసరంలేని సంతానాన్ని కని వారి బాధ్యత వహించలేనివారంగా మనమెందుకుండాలి? దూరదృష్టితో ఆలోచించి, ఆచరణీయమై ఆనందదాయకమైన యీ పద్ధతిని మనం ఆహ్వానించాలి. శారీరకవిజ్ఞానంలో అతిముఖ్య

మనుషుల సంతానజననం. ఈవిషయంలో కూడా మానవుడు తన మేధాసంపత్తితో ముందడుగే వేశాడు. అందుచేత సంతాన నిరోధానికి అడ్డుచెప్పేవారి వాదనలో తర్కంలేదు విలువ అంతకన్నా లేదు.

సంతాననిరోధం స్వేచ్ఛావిహారాన్ని అధికం చేస్తుందా అని ప్రశ్న ? స్వేచ్ఛావిహారమంటే ఆత్మసంయమనం లేకపో వడం, అతిగా వ్యభిచరించడం అని అర్థం. ఎన్నో నాగరిక దేశాల్లో ఎందరో స్త్రీపురుషులు ఆర్థికయిబ్బందులవల్ల వివా హంలేకుండానే వుండిపోతున్నారు. అందుచేత సహజమైనవీ ప్రకృతిసిద్ధమైనవీ అయిన కొన్ని భావాలకు దాసోహమనక తప్పదు. వివాహంతోపాటు మెడనుపడేభారాలు భార్యా బిడ్డలు. అందుకని 'పెళ్ళిఅవసరంలేకుండా' వాంఛాతృప్తికోసం వెలయాళ్ళుకొందరు అవసరం. ఇటువంటి పరిస్థితుల్లో కొంద రైనా యువతీయువకులు పెళ్ళిచేసుకునీ సంపాదన హెచ్చే వరకూ పిల్లలు అక్కరలేకుండా కాలం గడపడానికి సంతాన నిరోధం యెంతైనా వుపయోగపడుతుంది. దీన్ని అవలంబిం చడంవల్ల సహజమై ఆనందదాయకమైన పరిస్థితు లేర్పడి శాసనబద్ధమైన వివాహాలు ఎక్కువగా జరగడానికీ వీటివల్ల అవినీతి తగ్గడానికీ యెక్కువ అవకాశాలున్నాయి.

స్త్రీపురుషుల సంబంధంవిషయంలో యేదీ యిదమిద్ధంగా చెప్పలేం. ఈకామతృష్ణనికొలిచే నిర్ణయించేకొలబద్ద మానవు డింతవరకూ కనిపెట్టలేదు. ఒకపురుషుడు తనస్త్రీతో యెన్ని మారులు సుఖించాలనే విషయాన్ని యెవరికివారే నిర్ణయిం చుకోవల్సిన విషయం. సంతాననిరోధక సాధనాల ప్రయో

గంపల్లో సంతానం కలగదు. అంతమాత్రంచేత స్త్రీపురుషులు హెచ్చుగానూ, హద్దులేకుండానూ 'సాంగత్యం' కోరతారను కోవడం పొరపాటు. ప్రతియేడూ పిల్లలు పుట్టేవారు సంవత్స రానికొక్కసారి 'కలిసినా' గర్భం ధరించవచ్చు, అంతమా త్రంచేత యిరుగూ పొరుగూ "వీరికి పనీపాటూ లేదు-పిల్లల్ని కనడంతప్ప" అని అనుకోకూడదు.

### సంతానవిరోధం మతసాంప్రదాయాలకు వ్యతిరేకమా ?

కొన్ని మతాలవారు సంతాన నిరోధాన్ని పూర్తిగా వ్యతి రేకిస్తారు. ప్రతిమతం సంతాననిరోధాన్ని గురించేమనుకుం టుందో మనకిక్కడ యిప్పుడు అవసరంలేదు. సంతాననిరో ధం అవలంబించడంచేత యెక్కడ తమమతం ప్రజలసంఖ్య తగ్గిపోతుందేమోనని కొన్నిమతాలవారు భయపడుతూ వుం టారు. మానసికబలంగాని మంది బలంగాదు కావల్సినది మతాభివృద్ధికని మనం తలంచనంతవరకూ యీభయం తప్ప దేమో! మతసాంప్రదాయానుసారంగా యెంతోమంది వివా హంచేసుకుని యెంతహెచ్చు సంతానాన్నికంటే అంత వుచ్ఛ స్థితిలో ఆమతం వుంటుందనేఅభిప్రాయం వుండడంవల్లనే వివా హాన్నీ, సంతానాన్నిగురించీ మతంలో అంత నొక్కి నొక్కి చెపుతారు.

ఇటీవల కొన్నిమతాలవారు సంతాననిరోధాన్ని అంగీక రిస్తున్నారు. 1930 సం॥ వరకూ జ్యూ మతస్థులు సంతాననిరో ధాన్ని వ్యతిరేకించారు, కాని తరువాత అమెరికాలో జ్యూ మతగురువులైన 'రబ్బీల' సమావేశం జరిపి చర్చలు అయిన

తరువాత దీన్ని అంగీకరించారు. వ్యక్తిఆరోగ్యం, ప్రపంచ శాంతిభద్రతలదృష్ట్యా 'ప్రోటస్టాంట్' చర్చిలన్నీ యిదివర కటి వ్యతిరేకతమాని దానిపైన ఆంక్ష తీసివేయడమేగాక సంతాననిరోధాన్ని అవలంబించడానికి వుత్సాహంకూడ యిస్తు న్నాయి. 'లేకుబెత్' లో 1908 సం॥లో జరిగిన అఖిల అమె రికా క్రైస్తవచర్చిల ఫెడరేషన్ సంతాననిరోధంపైన యెంత్ర దుమ్మెత్తిపోసిందో అంతప్రోద్బలాన్నీ 1930 సం॥ లో జరిగిన మరియొకసమావేశంలో యిచ్చింది.

సంతాననిరోధంమీద కొన్ని క్రైస్తవమతాభిప్రాయాలు.

ప్రపంచంలో సర్వసాధారణంగా అందరూ యేదోవొక మతాన్ని నమ్మడమేగాకుండా దాన్ని అవలంబిస్తారు. వ్యక్తి గతంగాను, సాంఘికంగానూ కూడా ఆమతావలంబకు లాయా మతసూత్రాలకి హెచ్చువిలువ నివ్వడం పరిపాటి. మతసూ త్రాల ననుసరించే వ్యక్తియొక్క వైవాహికజీవితం గడు స్తుంది కాబట్టి ఆతని వైవాహికజీవితంలో మార్పు తీసుకురావా లంటే ముందు అత డనుసరించే మతంయొక్క అభిప్రాయాలు కూడా తెలుసుకోవడం అత్యంతావసరం.

మానసికభావాలు, చేసేకార్యాలూ, వాటిఫలితాలమధ్య వుండే ఆంతర్యాల్ని గురించి అన్నిసనాతనమతాలు యింతో అంతో చెప్పాయి: ఆరోగ్యశాస్త్రజ్ఞులైన వైద్యులకు కావల సింది, ఏదైనా వొకకార్యంవల్లవచ్చే శారీరక దుష్ఫలితమేగాని దాన్నిగురించినభావాల అవసరంలేదు. నీతిశాస్త్రజ్ఞుడికి కార్యా లకు ముందున్న కారణాలు, అంటే మానసికభావాల్ని గురించిన

వివరాలే అతనికి కావల్సింది. మతగురువైతే జరిగే కార్యాన్ని గురించీ దానివల్ల పొందే సుఖదుఃఖాల్ని గురించీ ఆలోచిస్తాడు.

ఇతర మతాలమాట యెలా వున్నా, ప్రస్తుతం మనకు హైందవ బౌద్ధ క్రైస్తవమతాభిప్రాయం సంతాననిరోధంపట్ల యెలావుందోమాత్రం కావాలి. భగవంతుడైన యెహోవా మానవుణ్ణి తన నీడగా తన శరీరంలోంచే తయారుచేశాడనే నమ్మకం క్రైస్తవుల్లో వుంది. మానవుడు ఆనందదాయకంగా జీవించడాని కని అవయవాల్ని ప్రసాదించాడు. ప్రతీ అవయవమూ తనకై నియోగింపబడిన పనిని చేయాలి. మానవుడు దేవుడిచ్చిన యీఅవయవాలతో భగవత్కార్యాలనుచేయాలి కాబట్టి కళ్ళు చూడ్డానికి (దేన్ని చూడ్డానికనే ప్రశ్న వేరు.) చెవులు వినడానికీ ఉపయోగింపబడినట్టే సంతానోత్పత్తికై ఈయబడిన యింద్రియాల నందుకై వినియోగించాలి. అలా గాక ఈయబడిన ఇంద్రియాల న్యాయా పనుల కుపయోగించక పోవడం మహాపాపమని వీరి వుద్దేశ్యం.

స్త్రీ పురుషుల సంబంధాని కర్థమేమిటీ అని ప్రశ్నించుకుంటాం? దీనికి చక్కనిసమాధానం బైబిల్లోనే వుందని శ్రీ సి. కేనన్‌హాగ్‌గా రన్నారు. జెనిసెస్ 1 లో 26 అధ్యాయంలో దైవం మానవుణ్ణి తనప్రతిరూపంగా చేశాడని చెప్పబడివుంది. ఇదేవిషయాన్ని యింకా విపులంగా 5 వ అధ్యాయంలో 2వ సూత్రంలో చెప్పారు. "భగవంతుడు స్త్రీపురుషుల నిద్దరినీ సృష్టించాడు. పురుషుడి పేరు 'ఆదామ్'. మానవసంఘాని కందుకని పునాది స్త్రీపురుషులేగాని కేవలం వొక్కపురుషుడూ

గాదు, కేవలం వొక్క స్త్రీగాదు. మానవుడు భగవత్స్వ రూపంకావడంలోనే ద్వంద్వత్వం యేర్పడినప్పుడు, మానవ సంఘాభివృద్ధికి నాంది స్త్రీపురుషుల ఐక్యం, సాహచర్యం కావ డంలో ఆశ్చర్యంలేదు. విజ్ఞులైనవారి భావపరిపాకం చివరకు త్రిమూర్తిపతిపాద్యమైనది. స్త్రీపురుషుల ఐక్యతనే ప్రకృతి పురుషులకలయికగా మనం అంగీకరించాలి. జగిగేప్రతి వివా హంలోనూ ప్రకృతీపురుషుల ఐక్యతనే లక్ష్యంగావుంచుకుని దాంపత్యజీవనం గడపాలి. అదే సుస్థిరసంఘానికి నాందని అంగీకరించాలి.[22]

మందహాసం, కరస్పర్శ, ముద్దు, కౌగిలింత మొదలైన కార్యాలవల్ల స్త్రీపురుషులమధ్య మానసిక అనుబంధం యేర్ప డినా, కేవలం "కలయిక లేక రతి" వల్లే శారీరిక సంబంధం యేర్పడుతుంది. జెనిసిస్‌లో సెయింట్‌పాల్ శారీరక సంబంధ మనగా 'కలయికే' నని చెప్పారు. పెళ్ళిఅయినా కాకపో యినా, తుదకు ఒక్కసారి వ్యభిచరించినా ఆ స్త్రీపురుష సంబం ధం అనివార్యం లేదా విడరానిదని చెప్పారు. ఆ బంధాన్ని యెవరూ తెంచలేరు. జీసస్ నొకసందర్భంలో నుడివినపలుకుల కిదీఅర్థం అని కొందరి అభిప్రాయం. "యేపురుషుడైతే తన భార్యనువదిలి మరల ద్వితీయవివాహం చేసుకుని భార్యను పొందుతాడు అతనికి వ్యభిచారదోషం తప్పదు." పాలలో నీళ్ళుకలపడంవల్ల పాలగుణం పూర్తిగా పోనిపోయినా గాని

22. థియోలజీ అనే గ్రంథంలో "మతపరంగా సంతాననిగ్రోధంవల్ల కలిగే సమస్యలు" అనేశీర్షికలో C. హాగ్ వార్నర్ గారిది 1954 జనవరి, లండన్.

శ్రేష్ఠత్వం తగ్గిపోయినట్లుగానే, రెండవభార్యను పొందడంచేత శారీరకశ్రేష్ఠత్వం తగ్గిపోతుంది. ఒకేసారి కలయికజరిగినా వేరే ప్రాణి సృష్టించబడుతూండడంవల్ల స్త్రీపురుషుల శరీరవ్యవస్థల్లో యెటువంటిమార్పు కలిగేదీ తేలిగ్గా వూహించవచ్చు. ఒకసారి భార్యాభర్తలైన తరువాత వారికొకరియెడ యింకొకరికి విశ్వాసంలేకపోయినా, వొకరినొకరు వదిలివేసినా, వారు ఆ జన్మాంతం భార్యాభర్తలే !" 23

'కలయిక' యెప్పుడుజరిగినా స్త్రీపురుషుల పరస్పరఅభీష్టం మీదే జరుగుతుందికాబట్టి, పెండ్లి అయినవారితో శారీరక సంబంధంవుండాలని క్రైస్తవుల విశ్వాసం. వర్తమాన, భవిష్యత్కాలాల్ని దృష్టిలోవుంచుకునే సంఘం వివాహనియమాల్ని నిర్ణయిస్తుంది. ప్రభుత్వం అల్లాగాకుండా యేయిద్దరు వివాహంచేసుకోడానికి వూనుకున్నా ,దాన్ని ఆమోదిస్తుంది. ప్రతీకలయికనీ వివాహంగా కాక, యిరువురిసమ్మతినే వివాహంగా అంగీకరిస్తుంది సనాతన క్రైస్తవమతం. దీన్నిబట్టి వివాహంవేరు వ్యభిచారంవేరని అంగీకరిస్తుందని వొప్పుకోవాలి. 24

అయితే 'కలయిక' వల్ల కలిగేప్రయోజన మేమిటని ప్రశ్నించుకోవాల్సి వుంటుంది. స్త్రీపురుషుల కలయిక కేవలం

23. C. హగ్ వాట్సన్ గారి గ్రంథం.

24. "క్రైస్తవుల ప్రార్థనగ్రంథం" లో పెళ్ళియొక్క లక్ష్యాల్ని గురించి యిలా వ్రాశారు. "సంఘాభివృద్ధి, సహాయం, సుఖం" లేదా వేరేమాటల్లో చెప్పాలంటే సంతానప్రాప్తి, సాహచర్యం, శరీరసుఖం, సాంగత్యాలు.

సంతానం పొందడానికేనా లేక ఆనందాన్ని అనుభవించటా నికా, లేదా రెంటినీపొందడానికా? మానవలక్ష్యాల్ని రెండు రకాలుగా మతప్రకారం విభాగించవచ్చు. "ఒక కార్యసాధన చేస్తూ దానివల్ల సత్ఫలితాల్ని పొందడమూ దానివల్ల వచ్చే తృప్తి ఆనందాన్ని అనుభవించడమే లక్ష్యసిద్ధి కర్థం" అని ప్రొటస్టెన్ట్‌ల వుద్దేశ్యం. "కార్యసాధనకు పునాదియైన భావమే ప్రధానం, ఆభావమే సాధారణంగా కార్యంలో ప్రతిఫలించి స్తుంది. కార్యసాధకుడి కిది యిష్టమైనా అయిష్టమైనా ఈకార్య సాధననే లక్ష్యం అనాలి" అని కేథలిక్కుల అభిప్రాయం.[25]

స్త్రీపురుషులమధ్య సహజంగావుండే యేదో అతీతమైన ఆకర్షణే సంభోగానికి కారణమని చెప్పవచ్చు. సంతానప్రాప్తి కూడా యింకొక కారణం, కాని సాధారణంగా యీవుద్దేశ్యం అన్నిసమయాల్లోనూ పూర్తిగాదు. స్త్రీ గర్భిణిగా వున్న కాలంలోనూ, బహిష్టు ఆగిపోయిన తరువాతా బహిష్టుఅయిన వారం తరువాత సహజంగా ప్రకృతిలోనే వున్న "ఆటూపోటూ" లేక ప్రమాదరహిత కాలాల్లో కలయికజరిగినా సంతానం కలగదు. ఒకవ్యక్తి తనమనోభావాల్ని అనుసరించి ప్రవర్తిస్తే దానివల్ల కలిగే మంచిచెడుల కతడే బాధ్యుడను క్రైస్తవుల్లో కొందరిసిద్ధాంతం. అందుచేత సంతానేచ్ఛ లేకుండా భార్యాభర్తలు సంభోగించవచ్చు. భార్యాభర్తల మానసి కానందానికే తృప్తికీ పరస్పరంజనించిన అనురాగాభివృద్ధికీ సంభోగం అవసరం. పురుషుడికి అవయవాలు వున్నట్టే స్త్రీలకు కూడా కొన్ని అవయవాల్ని భగవంతుడు ప్రసాదించాడు.

25. C. హగ్, వార్నర్.

కేవలం సంతానంకోసమే స్త్రీని భగవంతుడు సృజించినట్లయితే ఆ మెకుకూడా రతిసౌఖ్యాన్ని, దానికై కొన్ని ప్రత్యేక అవయవాల్ని యిచ్చివుండడు. సంభోగంలో పురుషుడూ, స్త్రీపొందే తృప్తివల్ల యెంతో మానసికానందం కలుగుతుంది.

స్త్రీపురుషుల కలయికవల్ల ఆనందం కలుగుతుందనే విషయాల్ని సామాన్యమానవుడు గ్రహించినా కొందరు క్రైస్తవు లంగీకరించడాని కింకా సందేహిస్తున్నారు. కేవలం "రత్యానందాన్ని" పొందడానికే మనశరీరంలో కొన్ని అవయవాలు సృజించబడ్డాయి, లేదా పరిణామంపొందాయి. హగ్ వార్నర్ గారన్నట్లు క్రైస్తవసిద్ధాంతాల ననుసరించి వివాహం సంతాన ప్రాప్తికైనా ప్రతిసంభోగం సంతానంకోసం మాత్రంకాదు. సంభోగంయొక్క లక్ష్యం సంతానప్రాప్తి మాత్రంకాదు. పైనుదహరించిన విషయాల్ని దృష్టిలోవుంచుకునే 1930 సం॥లో లేకుబెత్ లో జరిగిన అఖిలప్రపంచ ఆంగ్లికన్ చర్చీల బిషప్పు సమావేశంలో కుటుంబ నియంత్రణాన్ని గురించి కొన్ని నిర్ణయాలు చేశారు. "దంపతుల ప్రథమకర్తవ్యం సంతానం కనడమే! దానికి వ్యతిరేకంగా నడవడం ధర్మవిరుద్ధం. దంపతులమధ్య వొక తెగని అనుబంధ మేర్పడుతుంది. ఈప్రేమ లతను ఓరిమితో, కూరిమితో, త్యాగంతో పోషించి కాపాడాలి. భార్యాభర్తలసంబంధం కేవలం సంతానాభివృద్ధికే కాబట్టి, సంతాననిరోధం చేయకుండా వుండడమేగాక కేవలం వాంఛాతృప్తికోసం సంభోగం చేయకూడదు. అదే విధంగా సంతానం కలగడంవల్ల తల్లిప్రాణానికి మోసంజరుగుతుందనే అభిప్రాయంవున్నా లేదా, తల్లిఆరోగ్యం పాడౌతుందన్నా,

పుట్టేశిశువు సరిగావుండదని తోచినా వున్న సంతానాన్నే పెంచే స్థితిలో లేకపోయినా, కొన్ని ఆర్థిక పరిస్థితులవల్ల సంతానం కలగకుండా వుండడమే మంచిదని తోస్తే తప్పకుండా సంతానాన్ని నిరోధించవచ్చును.[26]

రోమను కేథలిక్కుల దృక్పథం

తన సాంఘికబలాన్నంతా వినియోగించి మతపరంగా సంతాననిరోధాన్ని వ్యతిరేకిస్తున్నది రోమన్ కేథలిక్కుమతమేను! మామూలుగా కేథలిక్కులు చెప్పేసాకుల కిదివరకే సమాధానం చెప్పాను. పదకొండవపోపుగారు 'వివాహనిబంధనల'ని జారీచేసి వాటిలో సంతాననిరోధాన్ని నిషేధించారు. ప్రకృతిసిద్ధమైన సంతానాన్నికలగకుండా యే దంపతులు అడ్డుపడుతున్నారో వారు దైవనిర్ణయాన్ని వ్యతిరేకించినవారే గాక మహాపకారాన్ని చేసిననేరానికికూడా అర్హులౌతారు.[27]

ఇటీవల కేథలిక్కులు సంతాననిరోధాన్ని కొంతవరకు అంగీకరిస్తున్నారు. కృత్రిమసాధనలవల్ల జరిగే సంతాననిరోధాన్ని వారంగీకరించరు. పెళ్ళి అయినవారికి అధికసంతానం అవసరంలేకపోతే బ్రహ్మచర్యం అవలంబించాలి. అది సాధ్యంగానిపక్షంలో "ప్రమాదరహితకాలంలో" లేదా "అటూపోటులకాలం" లోనే సంభోగించాలి. ప్రపంచమంతా, ఆర్థికదుస్థితివల్లా, అనారోగ్యంవల్లా కృత్రిమసాధనాలతో సంతాన

26. లేమబెత్ సభ 1930 (లండన్ S. P. C. K. 1931) పేజీ 99–91.

27. 1930 సం॥లో XI. పోపు జారీచేసిన వివాహనిబంధనలు.

నిరోధాన్ని అవలంబించడంచేత 1931 సం॥ లో వెల్లడించిన వివాహానిబంధనల్లో XI పోపుగారు ప్రమాదరహిత కాలం (Rhythm) ఆటూపోటూ కాలంలోని కలయికలకు సమ్మతించక తప్పలేదు.[28] ప్రకృతిసిద్ధంగానే స్త్రీలు బహిష్టులైనతరువాత కొన్ని రోజులవరకూ సంతానాన్ని పొందేస్థితిలో వుండరు. దీన్ని ఆధారంగా తీసుకునే "ప్రమాదరహితకాలం" నిర్ణయించారు. సంతానప్రాప్తికి అనుగుణంగా లేని యీదినాల్లో దంపతులు సంయోగం జరిపినా సంతానం కలగదనే చెప్పవచ్చు.

స్త్రీలకు "ప్రమాదరహితకాలం" సంతానప్రాప్తి కలిగే రోజులూ "ఆటూపోటూకాలం" వున్నా సంతాన నిరోధానికి పూర్తిగా దీనిపైనే ఆధారపడడం మంచిదికాదని కొందరు వైద్యులు అభిప్రాయపడుతూన్నారు. ఉష్ణమాపక సాధనాలు వున్నా ప్రతీస్త్రీకి వేరువేరుగా మారే యీ "ఆటూపాటూ" కాలాన్ని నిర్ణయించడం అంత తేలికైన పనికాదు. అందుచేత యీపద్ధతిలో హెచ్చుపొరపాట్లు జరిగేఅవకాశాలు వున్నాయి.

కృత్రిమసాధనలవల్లగాక యీ "ఆటూపాటూ" కాలం ప్రకృతిసిద్ధమైంది గనక క్రైస్తవమతస్తులు దీన్ని అంగీకరిస్తారు. ఈ విధంగా ప్రవర్తించడంవల్ల ప్రకృతిని వ్యతిరేకించడం లేదని

28. 'ఎస్ సైక్లికల్' లో యిలావుంది ప్రకృతిసిద్ధంగా, సహజంగా పెళ్ళిఅయినతరువాత సంగమిస్తే కొత్తజీవి బయటికి రాకపోయినా వారు మాత్రం ప్రకృతివిరోధులు కారు. ప్రకృతిసిద్ధంగా అంటూ ప్రమాదరహిత కాలంలోని కలయిక (Safe period).

నాశసమన్వితం. ప్రకృతిసిద్ధంగా గాక అంటే కోరుకున్నప్పుడే గాక నెలలో కొన్నాళ్ళేసంయోగం జరపడంవల్ల ఒకవిధంగా ప్రకృతిని వ్యతిరేకించడమే అవుతుందని ప్రోటస్టాన్టుల మతం. కృత్రిమసాధనలవల్ల పురుషశుక్లాన్ని స్త్రీగర్భంలోనికి వెళ్ళకుండా అరికట్టడంకూడా ప్రకృతివిరుద్ధమే అవుతుంది. అలాగే స్త్రీపురుషులిద్దరూ సహజంగా ఒకరినొకరుపొందాలని కాంక్షిస్తున్నప్పుడు, సంతానం కలుగుతుందనే భయంవల్ల ఆపని సరిగా యెడబాటు చేయడంకూడా ప్రకృతివిరుద్ధమే అవుతుంది. సహజమైన అలౌకికమైన వారి మానసికానందాన్ని లౌకికంగా చేయడమేగాక మరేమీ కాదిది.'' అని వీరు అభిప్రాయపడుతున్నారు.[29]

ఏదేలావున్నా మిగిలినస్త్రీలందరికిలాగే అమెరికాలోని కాథలిక్కుస్త్రీలుకూడా సంతాననిరోధక వైద్యాలయాల్లోకి మూగుతూవున్నారు. 35, 25 యేళ్ళమధ్యలో వున్న వివాహితస్త్రీలను 1944 సం॥లో జరిపిన అఖిలఅమెరికా సర్వేలో ప్రశ్నించగా వారందరూ సంతాననిరోధాన్నిగురించి తెలుసుకోడానికి కుతూహలపడ్డారని "ఫార్చ్యూన్" అనే పత్రికలో వేశారు. కేథలిక్కుమతంలో జననమరణసంఖ్య ఏవిధంగా అభివృద్ధిచెందుతుందో అదేసంఖ్యలోనే మిగిలిన మతాల్లోని జనాభా పెరుగుతుంది. ఫ్రాన్సులో అధికసంఖ్యాకులు రోమన్ కేథలిక్కులు. అయినా అక్కడజనాభా బాగా తగ్గిపోయింది. దీనికికారణం యిక్కడ చెప్పవలసిన అవసరంలేదు. కృత్రిమసం

---

29. గిల్బర్టు రసెల్ "స్త్రీ పురుషులు" Men & Women (లండన్ S. C. M. ప్రెస్ 1948.) పేజి 96.

తానునిరోధసాధనాల్ని దేశంలోంచి పూర్తిగా బహిష్కరించకపోయినా, దంపతులు పెద్దకుటుంబాలను పెంచలేక ఆర్థికంగా బాధపడితే ప్రభుత్వమే వారికి సహాయపడుతుంది. పిల్లల్ని పెంచడం చాలా ఖర్చు బాధ్యతలతో కూడినవిషయమని అన్ని అభ్యుదయదేశాలూ గ్రహించాయి.

కేథలిక్కులీ విషయంలో తమ అసమ్మతి చూపుతున్నారని మనం వారిపైన అసహనం చూపడంకన్నా వారిని అర్థం చేసుకుని ఓపికగా వుండడంమంచిది. కేథలిక్కు చర్చిలో వున్న ప్రతి ప్రముఖవ్యక్తిదృష్టీ ప్రస్తుతం ఆకర్షించే విషయమిదే. నానాజాతిసమితి ప్రపంచజనాభాసభ 1954 సం॥ సెప్టెంబరులో జరిగినప్పుడు పోప్ తనసందేశాన్ని పంపుతూ యిలా అన్నారు. "అతిజనసమ్మర్థంవల్లా, అవసరంలేని అనాధ శిశువులవల్లా యెన్నో చిక్కులు ప్రపంచంలో వస్తున్నాయనే విషయాన్ని చర్చి గుర్తించలేదనుకోవద్దు. జనాభా నియంత్రణ నిన్న మొన్నటి శాస్త్రమైనా, మానవజీవితాలకతి సన్నిహితమైన ఈవిజ్ఞానం మానవజీవితాల్ని, సంఘాన్ని కొన్నివిషయాల్లో అభివృద్ధిలోకి తీసుకొస్తుంది. తరుచూ ప్రకటింపబడుతూన్న వార్తలవల్ల నేటిప్రపంచంలో ఆర్థికదుస్థితి యెలా ప్రబలమౌతుందో, దీనివల్ల మానవసంఘాలమధ్య యెంత అగాధం యేర్పడుతుందో, యూరొప్పా బీదా అంతరాలవల్ల యెట్టిసమస్య లుద్భవిస్తున్నాయో తెలుస్తూనేవుంది.

జనాభాసమస్యల్ని పరిశీలించి పరిష్కరించడానికి చర్చి యెప్పుడూ సంసిద్ధంగానే వుంటుంది. ధైర్యసాహసాలతో సమస్యల నెదుర్కోడంవల్లా సకాలంలో కార్యసాధన చేసి

జయం పొందడంవల్లా వ్యక్తిగతమైనకృషివల్లా మనం దైవా
నికి సమీపస్థులం కావడానికి ప్రయత్నించాలి.

నియమంగా వుండంచేత కుటుంబనియంత్రణ సాధ్యంకాదా ?

గాంధీమహాత్ముడికి సంతాననిరోధంపట్ల వున్న అభిప్రా
యాల్ని అందరూ ఎరిగిందే ! "సంతాననిరోధాన్ని గురించి
భిన్నాభిప్రాయా లుండవలసిన అవసరం కనబడదు. బ్రహ్మ
చర్యం అనాదినుండీవచ్చిన సనాతనవరప్రసాదం. దీన్ని అవ
లంబించేవారు పొందేమేలు పరమ వుత్కృష్టమైంది. భార్యా
భర్తలసంయోగం తాత్కాలి కానందాన్ని పొందడానికికాదు
సత్సంతానాన్ని పొందడానికే" [30] అన్నారు గాంధీ. ఈ
విషయాన్ని గురించి యింకా విపులంగా చెప్పారు. "దంప
తులు నియమశీలురై సంతాననిరోధం చేయడం వేరు. నాగా
నందాన్ననుభవిస్తూనే సంతాననిరోధం అవలంబించడం వేరు.
మొదటిమార్గంవల్ల అంతామేలే కలుగుతుంది, కాని రెండవ
మార్గంవల్ల కలిగేదంతా చెడే!" [31] వేరే సందర్భంలో వా
రిలా సెలవిచ్చారు. "నా ఆఖరిరోజుల్లో నేను కోరేదేమిం టే
"భారతనారీమణులారా మీరు సర్వస్వతంత్రులు. మానసిక
స్వాతంత్ర్యం సంపాదించి మీరు స్వేచ్ఛపొందండి. మీకు
స్వాతంత్ర్యం లభించిననాడు దేశంలో సంతాననిరోధం గురిం

30. "నవభారతం" 1928 ఏప్రియల్ పేజీ 26 రచయిత M. K.
గాంధి.

31. "మానసిక దౌర్బల్యం– నియమం" అహమ్మదాబాదు, నవజీవన
పబ్లిషింగ్ భవనం (1947).

చినసమస్యే పుట్టదు. భర్తలు కామాతురులై సమీపిస్తే "అలాజరగాడానికి వీల్లేదనే" మనోధైర్యం; సాహసం భార్యల కుండాలి. కాని మన దురదృష్టంవల్ల మనస్త్రీలకింకా అటు వంటి స్వేచ్ఛలభించలేదు." 32 ఈవిధంగా యింకా పలుచోట్ల గాంధీగారు ప్రస్తావనచేశారు. గాంధీమహాత్మునికి కృత్రిమ సంతానవిరోధం అయిష్టమైనా వారు దీనిఅవశ్యకతను మాత్రం గుర్తించారు. కార్యసాధనలో ఫలితాలేగాక కార్యవిధానం కూడా పవిత్రంగావుండాలని వారిసంకల్పం. అందుచేత కృత్రిమ విధానాలవల్ల సంతానవిరోధం చేయడం వారి కయిష్టమైంది. సంతానేచ్ఛ లేకుండా కేవలం శారీరకానందం కోసం 'రతి' సల్పడం వారిదృష్టిలో మహాపాపం. అధికసంతానంవల్ల స్త్రీ జాతి నాశనమైపోతుందని వారు బాధపడినా, కృత్రిమసాధనల వల్ల, సాంఘిక, నైతిక, ఆరోగ్యపతనం తప్పదని వారి అభి ప్రాయం. పుట్టిన పదిమందిలో యేముగ్గురో మాత్రం బతికితే చాలనే మూఢవిశ్వాసం వారికిలేదు. మానసిక దౌర్బల్యానికి గురిగాకుండా దృఢవ్రతులై బలశాలులైన సంతానాన్ని కన డమే వుత్తమమని నమ్మారుకాబట్టే నియమవంతులై మన వలెనని భారతీయుల్ని మరీమరీ హెచ్చరించారు.33

భర్త భార్యను కామాతురుడై సమీపిస్తే ఆమె తనఅస మ్మతిని తెలియజేయమని గాంధీగారూ చెప్పినప్పటికీ, వొక్క-

---

32. "మహాత్మాగాంధీ మనసు" R. K. ప్రభు U. R. రావు 1946. మదరాసు. ఆక్స్ఫర్డు యూనివర్సిటీ ప్రెస్.

33. "నా జీవితచరిత్ర"లో గాంధీగారి సంతానవిరోధక పద్ధతులపై నెహ్రూ విమర్శచేస్తూ రాశారు. లండన్ 1936 పేజి 512-513.

భారతదేశంలోనేగాక సర్వప్రపంచంలోనూ కూడా ఈ విష యంలో స్త్రీమీద పురుషుడు అధికారం చెలాయిస్తూనే వున్నాడు. "నా వైవాహిక జీవితంలో వాంఛల్ని పూర్తిగా నాశనంచేయడానికి ముప్పైయేళ్ళు పట్టాయి. అప్పుడుగాని నా యావచ్ఛక్తినీ శుభకార్యాలకై పూర్తిగా వినియోగించ లేకపోయాను" అని మహాత్ముడే తన ఆత్మకథలో రాసుకు న్నారు. 1936 సం॥ లో మహాత్ముణ్ణి చూడ్డానికై వెళ్ళిన శ్రీమతి మార్గరెట్ సాంగర్ గారిలా తమసందేశాన్ని వెలి బుచ్చారు. "స్వామీ! నియమశీలురైన మీకే వాంఛల్ని లొంగదీయడానికై యింతకాలం పట్టినదికదా! అటువంట ప్పుడు సామాన్యభారతీయు డీస్థాయికి రావటానికెంతకాలం పడుతుంది!"[34] యవ్వనంలో వున్న యిద్దరు దంపతులూ ఆర్థికస్తోమతలేక కొంతకాలం సంతానమవసరం లేదనుకున్నా వారు ప్రకృతిసహజమైన కోర్కెలకు లొంగకుండా వుండడం సాధారణవిషయం కాదు. పురుషుడే యిటువంటి దౌర్బల్యా నికి లొంగిపోయాడు. విధిలేక స్త్రీ దాని కంగీకరిస్తుందని మహా త్ముని అభిప్రాయం. అందుచేతనే భారతస్త్రీల్ని భర్తల కామోద్రేకానికి లొంగిపోవద్దని హెచ్చరించారు. కాని నిజా నికి స్త్రీలకికూడా పురుషులకువలెనే వాంఛా, వుద్రేకం, భావ సిద్ధీ, తృప్తీ అన్నీవుంటాయి. భర్త భార్యనుపొందాలని యెంత ఆశిస్తాడో భార్యకూడా భర్తచెంత చేరాలని ఆశించే తరుణాలెన్నో వుంటాయి. భార్య భర్తనుచేరితే "వీస్లేదని"

---

34. "శ్రీమతి సేంగర్ మహాత్ముల మధ్య జరిగిన సంభాషణ" ఆసియా-న్యూయార్కు- నవంబరు 1936 పేజి 698.

తిరస్కరించడం న్యాయమా? సామాన్యమానవు లందరూ బ్రహ్మచర్య వ్రతదీక్షులై నియమంగా వుండలేరు. ఒకవేళ బ్రహ్మచర్యం అవలంబించడానికి పూనుకున్నా శారీరిక, మానసిక దౌర్బల్యాల కిది దారితీస్తుంది. డాసన్‌గారన్నట్లు "ప్రతీ కుటుంబంలోనూ నలుగురికన్నా యెక్కువపిల్ల లుండ గూడదంటే పెళ్ళిఅయిన వారందరూ చాలాకాలం బ్రహ్మచర్యం అవలంబించక తప్పదు. ఆర్థికదుస్థితివల్ల కొత్తగా పెళ్ళి అయిన దంపతులు తప్పనిసరిగా సంతాననిరోధాన్ని అవలంబించవలసివస్తే, కోర్కెలు హెచ్చుగా వుండే కాలంలోనే తప్పనిసరిగా బ్రహ్మచర్యం అవలంబించవలసి వస్తుంది. నూటికి తొంభై మంది కిటువంటి సమయాల్లో సంయమనం వుండడం కల్ల. ఒకవేళ బలవంతంగా వారు వేరే వుండాలని ప్రయత్నిస్తే అది మానసిక శారీరిక దుస్థితికీ చెడ్డఅలవాట్లకూ దారితీస్తుంది. దప్పిగొన్నవాడి యెదురుగా మంచినీళ్ళుపెట్టి వాణ్ణి త్రాగకుండా నిర్బంధించడ మెంతదారుణమో అదే విధంగా కామతృష్ణా పీడితులైన దంపతులకు సంయమనం బోధించడ మౌతుంది. ఈబోధ బూడిదపోసిన పన్నీరులా నిష్ఫలమైనా అవుతుంది లేకపోతే చెడుమార్గాలకు నాంది పాడడమైనా అవుతుంది.[35] కోట్లసంఖ్యామీద వున్న భారత జనాభాకిది యెంత ఆరోగ్యదాయకం అనిప్రశ్న? ఆకలి నశించాలంటే కడుపుకోసి పారవేయమనడం యెంత తెలివిగల పనో ఈ సంయమన సిద్ధాంతంకూడా అంతే విలువగలిగిన

---

35. లార్డ్ డాసన్‌గారి "ప్రేమా, పెళ్ళీ, కుటుంబ నియంత్రణా" అనే గ్రంథంనుండి పేజి 22 (లండన్ 1921).

సలహాయని కొందర భిప్రాయపడుచున్నారు. దంపతులు యెక్కువకాలం దూరంగావున్నా దానివల్ల మానసికమైన వొత్తిడీ శారీరకబాధలూ తప్పవని వైద్యశాస్త్రజ్ఞులు పలు వురు చెపుతున్నారు. ''

ఈ విషయంలో హైందవుల అభిప్రాయాలు

కాలానుగుణంగా వచ్చే సమస్యలకు సనాతనగ్రంథాల్లో సమాధానాలు వెతకడంవెర్రి. ఆటంబాంబుల్ని మనం యెదు ర్కోవలసిన పరిస్థితు లేర్పడతాయని వా రూహించి వుండరు. ఒకవేళ వారూహించా రే యనుకున్నా వాటికి సమాధానాలు రాసివుండరు. సనాతనగ్రంథాల్లోవున్నవిషయాల్ని అక్షరాలా పాటిస్తామనేకన్నా వాటిభావాల్నీ, వుదారతనీ అర్థంచేసుకుని ప్రవర్తించడం మంచిది. ప్రతి ఆధునిక అభ్యుదయవిషయానికీ మతముద్రవేసి మతగ్రంథాల్లో దీనిపై ఆంక్ష లేదని అతి తెలివితేటలతో నిరూపించజూపడ మెంత పొరపాటో అదే విధంగా, ప్రతీ అభ్యుదయకార్యం ఆధునికవ్యవస్థా సీతిబాహ్య మైందని నిరూపించ జూపడం అనాగరిక మే యవుతుంది. "హైందవ ఋషులు కొన్ని ధర్మాల్నీ, నీతుల్నీ, సంప్రదా యాల్నీ యేర్పాటుచేస్తూనే, కాలానుగుణంగా వీటిని మార్చు కోడానికి అంగీకరించారు. చెలించని ధర్మానికి, చలనంవున్న అంగాలే యీ నియమాలన్నీను. కాబట్టి ధర్మచ్యుతంకాకుండా వాటిని యిష్టానుసారం కాలానుగుణంగా మార్చుకోవాలి, మార్చుకోకతప్పదు.''అని సర్వేపల్లి రాధాకృష్ణగారన్నారు.[36]

---

36. సర్వేపల్లి రాధాకృష్ణగారి "మతం, సంఘం" పేజి 108 (లండన్, ఏలెన్ యున్ విన్ 1948).

వేదాలకూ ధర్మశాస్త్రాలకూ తరువాతి విమర్శకుల సిద్ధాంతాలప్రకారం చూస్తే కాలానుసారంగా సాంఘికవ్యవస్థల్లో మార్పుకు వారంగీకరించినట్లుగా స్పష్టమౌతుంది. రకరకాల మనస్తత్వాలవారికి రకరకాల ధర్మాలూ, నీతులూ, హెచ్చు కులాలవారికి యెక్కువనియమాలూ, అంతగా పాటించలేని వారికి కొన్ని నియమాలూ యేర్పరుపబడ్డాయి.[37] మన ముందు వున్నతమైన లక్ష్యాలూ, ధర్మాలూ వుంచబడినా మహాత్ములూ, సన్న్యాసులుమాత్రమే వాటి ననుష్ఠించడానికి పూనుకుంటారు. సామాన్యులు, సాధారణంగా కష్టసాధ్యం గాని మార్గాన్నే కోరుకుంటారు. భారతీయసంస్కృతి యిన్ని వేలసంవత్సరాలుగా నిలిచివుండడానికి కారణం యీ కాలానుసారమైన మార్పుల నంగీకరించే హృదయవైశాల్యత కలిగి వుండడమే అని చెప్పవచ్చును.

ప్రతి భారతీయుడూ సన్న్యాసాన్ని స్వీకరించి మోక్షగామి కాకముందు ధర్మార్థకామాల్ని అనుభవించాలి. అందు చేతనే నాలుగు ఆశ్రమాలూ, బ్రహ్మచర్యం—గార్హస్థ్యం, వానప్రస్థాశ్రమం — సన్న్యాసం — యేర్పాటు చేయబడ్డాయి.

37. గాంధీమహాత్ముడు కృత్రిమ సంతాననిరోధాన్ని అంగీకరించక సంయమనాన్నీ బ్రహ్మచర్యాన్నీ అవలంబించమన్నారు. కాని లక్ష్యాలకూ సామాన్యాచరణకూ గల విభేదాన్ని వారు యెప్పుడూ అంగీకరించారు, చెడుని నివారించడానికి అహింసామార్గమే వుత్తమమైంది. కాని అహింసామార్గాన్ని అవలంబించలేక పిరికిపందై పోయేకన్నా హింసామార్గాన్నైనా చెడుని అరికట్టడం మంచిదని అన్నారు.'' డా॥ సర్వేపల్లి రాధాకృష్ణగారు బొంబాయిలో జరిగిన మూడవ ప్రపంచ అంతార్జాతీయ కుటుంబనియంత్రణ సభలో 1952 లో మాట్లాడుతూ యిలాచెప్పారు.

సనాతనాచారాలైన యీ నాల్గుబాటల్లోనూ ప్రతీహైంద వుడూ నడవకతప్పదు. విజ్ఞానసముపార్జనకై విద్యాభ్యాసం చేసేకాలంలో బ్రహ్మచర్యాన్ని విధిగాఅవలంబిస్తాడు. విద్యా శిక్ష పూర్తికాగానే బ్రహ్మచర్యం వదిలి పెళ్ళిచేసుకుని గార్హస్థ్యధర్మాన్ని చక్కనిసంతానాన్ని కని నెరవేరుస్తాడు. కేవలం దంపతుల యిష్టాయిష్టాలతో కూడుకున్న బంధమే గాక, ఆజన్మాంతమూ విడివడని ధర్మబంధం వివాహమని హైందవుల దృఢవిశ్వాసం. గృహస్థాశ్రమాన్ని చాలాగొప్ప దానిగా ధర్మశాస్త్రాలు చెప్పాయి. వైవాహిక జీవనంవల్ల సహజమనో వాంఛాపూర్తి గావడమేగాక మానసిక పరిణా మం, పూర్ణత్వం సిద్ధిస్తాయని వారు విశ్వసించారు. బ్రహ్మ చారి పరిపూర్ణుడుకాడు. అతనికి పూర్ణత్వం సిద్ధించాలంటే వివాహ మాడవలసిందే! స్త్రీపురుషు లన్యోన్యంగా వుండడా నికే సృష్టించబడ్డారు అంతేగాని వారు విడిగావుండడానికి ప్రకృతి వొప్పుకోదు. స్త్రీ పదహారుసంవత్సరాల వయసులో పురుషుడు ఇరవైయేళ్ళ వయసులోనూ వివాహాని కర్హులు. వివాహంవల్ల మానసిక పరిపూర్ణత్వం రావడం వంశాభివృద్ధి జరగడం తద్వారా ప్రపంచశాంతిసౌఖ్యా లభివృద్ధి అవుతాయనే ఆర్యులు గార్హస్థ్యధర్మాన్ని హెచ్చుగా మెచ్చుకున్నారు. వేదకాలంనాడు బాల్యవివాహాలు లేవు. పైగా వేదాలు బాల్యవివాహాన్ని అంగీకరించవు. ఆజీవితాంతం, గార్హస్థ్య ధర్మం నెరపగూడదు. సంతానప్రాప్తి అయింతరువాత దంప తులు వానప్రస్థాన్ని తరువాత సన్యాసాన్ని స్వీకరించాలి. జీవి తాన్నివిధంగా విభజించబట్టే హైందవులు గార్హస్థ్యజీవితంలో

యేవిధంగా మెలగాలో, యేది ధర్మబద్ధమైనదో యేదికాదో విధిపూర్వకంగా శాసిస్తూ చెప్పారు.

శాస్త్రాల్లో యెప్పుడెప్పుడు సంభోగం చేయవచ్చో యెప్పుడు చేయకూడదో, యెందరు సంతానం వుండాలో వివరంగా యీయబడింది. పెళ్ళిలో పెళ్ళికుమారుడు యింద్రుణ్ణిచూచి ప్రార్థించినమాటలు యజుర్వేదంలోనూ, ఋగ్వేదంలోనూ వుంది. "ఓయీ యింద్రా! పెళ్ళికుమార్తెను గుణవంతురాలూ, అదృష్టవంతురాలు అయిన పిల్లలతల్లిగా చెయ్యి. ఆమెకు పదిమందిపిల్లలుపుట్టేలా దీవిస్తూ, తనభర్తని పదకొండో సంతానంలా చూసుకునేలా ఆశీర్వదించు." నేడు పదిమంది సంతాన మంటే అధికంగా కనిపించవచ్చు కాని ఋగ్వేద కాలంలో పదిమంది సంతానం సౌభాగ్యకారణం గావచ్చు. భార్య యెప్పుడైతే భర్తనికూడా తనసంతానంలో వొకడిగా తలపోస్తుందో దాంతో ఆసంతానానికి పరిమితియేర్పడి తీరుతుంది. ధర్మశాస్త్రజ్ఞుడైన మనువూ (600 క్రీ॥ పూర్వం) కామశాస్త్రజ్ఞుడైన వాత్స్యాయనుడూ (400 క్రీ॥ తరువాత) పురుషు డెప్పుడెప్పుడు సంభోగించరాదో విపులంగా వ్రాసినారు. కామసూత్రాల్లో వివిధరతులను గురించి బాహ్యప్రక్రియల్ని గురించీ విపులీకరిస్తూ కొన్ని రసాయనిక ద్రవ్యాల నుపయోగించీ స్త్రీగర్భంలోకి శుక్లం నిరోధంకలగజేసీ సంతానాన్ని నిరోధించవచ్చునని వ్రాయబడింది.[40] బృహద్యోగతరంగిణిలో

40. దేవాలయ ప్రాకారాలమీదా, గుడి లోపలిభాగంలోని గోడల మీదా, వివిధ బంధాలూ, రతులూ చెక్కబడివుంటాయి. భగవంతునిచే ప్రసాదింపబడ్డ మానవశరీరమనే దేవాలయంలో అన్ని సుఖభోగాలూ అనుభవించినగాని మానవుడు పరమార్థచింత కర్హుడు కాడనీ కామజయుడైన కాని సన్యాసి కాజాలడనీ యీ చిత్రాలయొక్క భావం కావచ్చును.

(శ॥ 8 క్రీ॥ తరువాత) స్త్రీయోని నేవిధంగా కొన్ని రసాయనిక ద్రవ్యాలచే పరివర్తన చేయవచ్చునో వ్రాయబడింది. బృహదారణ్యకోపనిషత్తులో (200 శా॥ క్రీ॥ తరువాత) మేధావులైన సంతానం కలగాలంటే యేమంత్రోచ్ఛరణ చేయాలో సుందరమూర్తులు కావాలంటే యేమంత్రోచ్ఛరణ చేయాలో సంతాన మవసరంలేకపోతే యేవిధంగా వుచ్ఛరించాలో ఈయబడింది. నేడు మనకున్న సాంఘికపరిస్థితులు వాగికిలేకపోయినా భవిష్యత్తు నూహించే వారు యీవిధంగా రాశారా అనిపిస్తుంది. 41

వేదశాస్త్రాల్లో ప్రతీస్త్రీ పదిమంది సంతానం కన్నాక భర్తని పదకొండవ సంతానంగా యెంచాలనివ్రాసినా, తరువాతవ్రాసిన విమర్శకులు, మొదటిసంతానం మాత్రమే ధర్మసంతానమనీ మిగిలిన సంతానమంతా కామసంతానమనీ అన్నారు. పుత్రుడనేపదం సంస్కృతములోనిది. పున్నామనరకాన్నించి తలిదండ్రులని రక్షిస్తాడుకాబట్టి పుత్రుడనేపేరు వచ్చింది. దీన్నిబట్టి హైందవుడైన ప్రతివాడూ పుత్రుణ్ణికని పున్నామనరకాన్నించి విముక్తుడుకావాలిగాని, లెక్కలేనంత మంది పిల్లల్నికని అందులో యేవొక్కరో యిద్దరోన్నిమాత్రం బతికించుకోడానికి ప్రయత్నించగూడదు. పుత్రుడొకడుంటే

41. కిన్సే సర్వేలాంటిది మనదేశంలో జరపడానికి వీలులేకపోయినా నిజంగా ఆవిధమైన లెక్కలేగాని మనదేశంలోకూడా తీసుకుంటే తేలే పర్యవసానమేమిటంటే దేన్నైతే పెద్దలు నిషేధించారో దాన్నే సర్వసామాన్యంగా అందరూచేస్తూంటారు. ఐక్యరాజ్యసమితి ఆధ్వర్యంలో మైసూరులోవున్న వొక్కగ్రామంలో కొంత సర్వేచేయగా దేనినైతే పెద్దలు చేయగూడదన్నారు దాన్నే కామాతురులు చేస్తారని తేలింది.

తలిదండ్రులు చనిపోయింతరువాత పిండోదకాలు వేస్తాడని పుత్రుడు కావాలని కోరేవారుగాని, భరించలేనంతమంది సంతానాన్ని కనమని హైందవ ధర్మశాస్త్రాలు చెప్పలేదు. పెద్ద కుటుంబంవుంటే అదృష్టం, సౌభాగ్యం అనే అభిప్రాయం దేశం నాలుగుమూల్లా యింకా వ్యాపించేవుందని" గాంధీమహాత్ముడన్నారు.

కామశాస్త్రచర్చలూ, సంతానాభివృద్ధినిగురించీ సనాతన ధర్మశాస్త్రాల్లో చాలాసార్లు పేర్కొబడినా యెక్కడా సంతాన నిరోధానికి వ్యతిరేకంగా మాత్రం యేమీ వ్రాయబడలేదు. [42] సనాతనులమని డంబాలుపలికే కొందరెంతో కష్టపడి ఆర్యులు సంతాననిరోధా న్నంగీకరించలేదని నిరూపించడానికి యత్నించినా వారు సఫలీకృతులు కాలేకపోతున్నారు. ప్రతీకార్యంయొక్క ప్రయోజకత్వం, నీతిధర్మాల్ని నిర్ధారణచేసుకునేదాన్ని ఆమోదించమని హిందూ ధర్మశాస్త్రాలు చెప్తున్నాయని వేరే మాటల్లో చెప్పవచ్చు. అందుచేత సంతాన నిరోధం అవసరమా కాదా అనేనిర్ణయాన్ని కాలమాన పరిస్థితుల ననుసరించి చేసుకోవల్సి వుంటుంది. కన్నబిడ్డల్ని పెంచలేక యిక్కట్లుపడే బీదలబాధల బాపడంకన్నా, నానా

42. అధునాతనులమనీ, అభ్యుదయవాదులమనీ విర్రవీగే నేటిప్రపంచంలో "నానాజాతిసమితి ప్రపంచ ఆరోగ్యశాఖలో సహితం సంతాన నిరోధాన్నిగురించి బహిరంగంగా చర్చించడానికి వీల్లేకపోయినా. అదృష్టవశాత్తూ సనాతన ఆర్యమతంమాత్రం సంతాననిరోధం మీద యెన్నడూ ఆంక్ష పెట్టలేదు." అని భారతదేశజనాభా రిజిస్ట్రారు జనరల్ అన్నారు. (1951 సం॥) భారతజనాభా 1వ వాల్యూము. (న్యూఢిల్లీ 1953) 112 పేజీ.

టికీ క్షీణించే ఆరోగ్యంతోనూ ప్రాణాలనుకూడా కాన్పుల్లో పోగొట్టుకునే తల్లులక్షేమంకన్నా మనోధర్మం అధికంకాదని నాఅభిప్రాయం.

ధర్మశాస్త్రాల్లో చెప్పినట్లుగా విధిపూర్వకంగా ప్రతీఆర్యుడూ నడుచుకుంటే భారతదేశంలో అసలు జనాభాసమస్యలే పుట్టకపోయి వుండేవి. విచ్చలవిడి ప్రవర్తన్ని అరికట్టడమే గాకుండా, సాంఘికమర్యాదల్ని కాపాడుతూ సంఘాన్ని ఆరోగ్యవంతంగానూ ఐశ్వర్యవంతంగానూ నడిపించడంకోసమే మన నాలుగు ఆశ్రమాలూ యేర్పరుపబడ్డాయి. నేడు మనమున్నది పారిశ్రామికయుగం. మనంపూర్తిగా సనాతనులవలే నాల్గాశ్రమాల్నీ అమలులో పెట్టలేకపోతున్నాం, పోనీఅంటే అధునాతనుల మనుకొని కృత్రిమసంతాననిరోధాన్ని ఆచరించలేక బాధపడుతున్నాం. పెద్దలుకొందరు మనం పూర్తిగా వేదకాలపునాటి సాంఘిక పరిస్థితులవైపు మొగ్గుదామంటే మరికొందరు పెద్దలు మనం అధునాతనులం, పూర్తిగాముందుకు పురోగమిద్దామంటున్నారు. మనం వర్తమాన భవిష్యత్కాలాలకు చేరువలో వున్నాంకాబట్టి గతాన్ని పురస్కరించుకుని వెనక్కు మళ్లేదానికన్నా, భవిష్యత్తులోకి అడుగుపెట్టి అభ్యుదయమార్గాన్నే పురోగమించడం చాలా తేలికా, మంచిదీ, సుఖమూ కూడాను. మన సంఘసంస్కర్తలైన రాజా రామమోహనరాయి దగ్గరనుంచీ శ్రీ సర్వేపల్లి రాధాకృష్ణగారి వరకూ, మన అదృష్టవశాత్తు కుటుంబనియంత్రణనీ, సంతాననిరోధాన్నీ ఆమోదిస్తున్నారు. అందుచేత ప్రతీభారతీయుడూ ఆత్మతృప్తితో, ఆనందంతో సంతాననిరోధాన్ని అవలంబించ

వచ్చు. అనాదికాలంనుంచీ విజ్ఞానశాస్త్రానికీ మతానికీ మధ్య యుద్ధం చెలరేగితే యెప్పుడూ విజ్ఞానశాస్త్రానిదే పైచెయ్యి అవుతూవచ్చింది. అభ్యుదయమార్గాలకూ, కాలానుసారం వచ్చిన మార్పులకుంను మతంయెప్పుడూ, తలవొగ్గుతూనే వచ్చింది. విజ్ఞానశాస్త్రం మృత్యుముఖాన్నుండి మానవునిరక్షిం చేమందుల్ని కనిపెడితే ప్రపంచమంతా ఆనందించి అభినంది స్తుంది. కాని ఆ విజ్ఞానశాస్త్రమే మానవహితంకోరి సంతా నాభివృద్ధిని కాంక్షిస్తే యెన్నో అభిప్రాయబేధాలూ, అల కలూ చెలరేగుతున్నాయి. అన్నిటికన్నా చిత్రమేమిటంటే ఈ మొండివాదన లెంతఅసహ్యాకరమైనవో అంత తార్కిక శక్తికి నిలవనివని యెవరూ గ్రహించలేకపోతున్నారు.

ఈ విషయంలో మహమ్మదీయుల దృక్పథమేమిటి ?

పాకిస్థాన్విభాగం తరువాతకూడా 36 మిలియన్లమంది మహ మ్మదీయులింకా మనదేశంలో వున్నారుకాబట్టి వారిమతం ఈ విషయంలో యేమంటుందో తెలిసికోవలసిన అవసరం వుంది. 1950 జనాభా లెక్కలప్రకారం ప్రపంచంలో యింకా 320 మిలియన్లమంది మహమ్మదీయు లున్నారు.

ఆరోగ్యవిషయ వివరణలోగాని, సంతానాభివృద్ధి విష యాల్లోగాని, స్త్రీపురుష సంబంధవిషయాల్లో యెన్నడూ మనదేశంలో సరియైనలెక్కలు తీసుకోబడలేదు. అందుచేత మనదేశంలో నిజానికెందరు ముస్లిములున్నారోకూడా లెక్క లుతీయడానికీ, వివరాలీయడానికీ, వీల్లేకుండావుంది. అన్నిసం ఘాల్లోనూ, దేశాల్లోనూవున్న సంతానోత్పత్తి శక్తికీ, శిశు

మరణసంఖ్యాలకన్నా యేవిధంగానూ భారతముస్లిమీయ సంఘం వ్యతిరేకంగావుండే అవకాశంలేదు. ప్రాక్ దేశాల్లోకి వలెనే భారతదేశ ముస్లింసంఘంలోకూడా సాంఘిక ఆర్థిక చట్టాలు పరీక్షించిచూస్తే, సాంఘికసముభావం, బహుభార్యాత్వం, విడాకులచట్టం, స్త్రీల ఆస్తిహక్కుల్లోని వుదారత అన్నీ సమానంగానే వున్నట్లు తెలుస్తుంది.

మానవ వివాహావ్యవస్థని గురించిన కొన్ని సామెతలు మహమ్మదీయసంఘంలో ప్రచారమవుతున్నాయి. "అల్లాసేవకుడు పెళ్ళిచేసుకుని పిల్లల్ని కనగానే అల్లామతాన్ని నాలావరకూ సంరక్షించినవాడవుతున్నాడు." అని ఒకసామెతవుంది. మహమ్మదువారిలా అన్నారు. "వివాహమాడి సంతానాభివృద్ధి గావించి నామతాన్ని సాటిమతాల్లో అభివృద్ధిచేయండి." ఒకప్పుడు క్రీస్తు దేవునిశిష్యుల్లో యెవరుగొప్పవారని సందేహమొచ్చినదట. అదేవిధంగా మహమ్మదువారి శిష్యుల్లో నెవరుగొప్పవారని సందేహం కలగగా మహమ్మదు యిలాఅన్నారని చెపుతారు. "యెవడైతే సద్గుణవంతుడైన భర్తగా పేరుపొందుతాడో అతడే అందరికన్నా అధికుడు." అబ్బాస్ అనేఆయన జూబ్యార్ని "నీకు వివాహమైందా?" అని ప్రశ్నించగా అతడు 'లేదని' సమాధానమిచ్చాడట. దాని పైన వారిలా అన్నారట, "మనసంఘానికి మేలుచేసేవాడెవరంటే హెచ్చుమందిభార్యలతో సంసారంచేస్తూ సంతానాభివృద్ధి చేసేవాడే." 43

---

43. ఆర్తుడు జఫరీగారు రచించిన "యిస్లాంమతంలో కుటుంబం"

ఇవన్నీ అలావుంచి యిస్లాంమతాధికారులు సంతాననిరోధాన్ని పూర్తిగా ఆమోదించారనే విషయం చాలామందికి తెలియదు. క్రైస్తవమతంలోవలె గాక హైందవ మహమ్మదీయమతాల్లో మతాధికారులఆధిపత్యం సంఘంపైన హెచ్చుగావుండదు. ఇస్లాం ధర్మమైన "షారియత్" ననుసరించీ 'షిక్' నీతిగ్రంథాన్ననుసరించీ వారి వివాహాలూ, వరకట్నాలు, విడాకులూ మొదలైనవి జరిపింపబడతాయి. ఎవరికైనా ధర్మసందేహాలు కలిగితేమాత్రం మతాధికారులు వారి సందేహాలు తీరుస్తారు. ఇస్లాం మతాధికారీ యీజిప్టుఅధికారీ అయిన ముఫ్టీగార్ని కొందరు సందేహగ్రస్తులు ప్రార్థించగా వారు సమాధానమిస్తూంటారు. ఆప్రశ్న యేమిటంటే, "పెళ్ళి అయి ఒకబిడ్డపుట్టి తరువాతవ్యవధిలేకుండా మళ్ళీ భార్యగర్భిణి అయితే ఆమెఆరోగ్యం క్షీణించిపోవడమే గాకుండా, యింటి యజమాని పుట్టేపిల్లల్ని పోషించేస్థితిలేక, వార్ని యెలా అయినా సంరక్షించాలని తిప్పలుపడి, అధికశ్రమకోర్చి పనిచేయడంవల్ల అతనిఆరోగ్యంకూడా పాడైపోవడంతథ్యం, కాబట్టి యిటువంటి పరిస్థితుల్లో ఆదంపతులు నిపుణులైన వైద్యుల సలహాపైన కుటుంబనియంత్రణ అవలంబించవచ్చునా? కృత్రిమ సాధనలవల్లగాని సంతానానికీ సంతానానికీ మధ్య వ్యవధి వుండేలా చేయలేము. కాబట్టి పైవిషయాలదృష్ట్యా దీనిపై మీావుద్దేశ్యం వెల్లడించండి." పైవిషయాల్ని సమగ్రంగా పరిశీలించిన పిదప (1937 జనవరి) లో "హానఫీ" నీతిశాస్త్రరీత్యా ఫత్వా-12 డి-అల్-ఖ్వాదా 1355 జారీచేశారు." దంపతులు యేకగ్రీవాభిప్రాయంతో యేవిధమైన సంతాన

నిరోధక చర్య లవలంబించినా ఫరవాలేదు. (కృత్రిమసంతాన నిరోధాన్ని గురించీ, సహజసంయమన విధానాన్ని గురించీకూడా వారిందులో ముచ్చటించారు.) 'హనఫీ' సిద్ధాంతాల్ని అధునా తన దృష్టితో చూస్తే దంపతులిరువురూ ఏకగ్రీవంగా సమ్మ తించే సంతానవిరోధాన్ని అవలంబిస్తే దానికి మతాధికారుల ముద్ర అవసరంలేదన్నారు." గర్భస్రావంగురించికూడా యీ 'ఫత్వా' లోనే వివరంగా చెప్పారు. "గర్భస్రావంగురించి వివి ధాభిప్రాయాలున్నమాట నిజం. చాలామంది గర్భస్రావాన్ని అంగీకరించరు. ఒకశిశువుకు పాలిస్తూవుండగానే ఆతల్లి మళ్ళీ గర్భిణీఅయినా, పుట్టబోయే పసిపాపకు తలిదండ్రులు పాలు కూడాపోసి సంరక్షించేస్థితిలో లేకపోయినా, పుట్టబోయేబిడ్డకు తప్పనిసరిగా ప్రాణనష్టంగాని అవయవలోపంకాని కలుగుతుం దనితోచినా గర్భస్రావం చేయవచ్చుకాని యీపని గర్భంలో వున్నశిశువుకు ప్రాణంవచ్చి కదలికయేర్పడకముందే జరగాలి; కాని యెట్టి పరిస్థితుల్లోనూ తరువాత ప్రాణహాని చేయ గూడదు."

"ఈవిషయంలో యింతకన్నా మాకు చెప్పే సమాధాన మేమీకనబడదు. సర్వశక్తివంతుడైన అల్లా స్తుతిపాత్రుడు. సర్వజ్ఞుడు." 44

44. అరబ్బీభాషలో ప్రచురించబడిన ఈజిప్టుదేశ మెడికల్ ఎసోసి యేషన్‌వారి జర్నల్‌లో, కైరో, జూలై 1937, జనాభా వివరాలూ సంతాననిరోధం (న్యూయార్కు, మే 1952 లో అనువాదం చూడవచ్చు.)

# ఐదవ అధ్యాయం

## సంతాననిరోధం – దీన్ని అమలుజరిపేవిధానాల్లో యేది వుత్తమమైంది ?

కృత్రిమసంతాన విధానాన్ని రెండువిధాలుగా విభజించవచ్చు. ఒకటి స్త్రీలుపయోగించే సాధనాలూ రెండవది పురుషు లుపయోగించే సాధనాలు. పురుషు డుపయోగించే వుపకరణాలవల్ల పురుషశుక్లం స్త్రీగర్భంలోకి వెళ్ళకుండా నిరోధించబడుతుంది. శుక్లనిరోధం లేక "నిర్గమనం" అనేదొక పద్ధతి (Coitus interruptus) ఈపద్ధతి "ఓల్డుటెస్టమెంటు (సనాతనబైబిలు) కాలంనుంచీ ప్రచారంలోవుంది.[45] నాటి

---

45. కేనన్ దేశస్థురాలైన శువా అనేకన్యను "జూడా" చూచాడు. వెంటనే ఆమెను పెళ్ళిచేసుకుని ఆమెతోసంగమించాడు, ఆమె గర్భవతై "ఎర్" ( Er ) అనేకొడుకుని కన్నది. రెండవసారి పుట్టినకొడుక్కి "ఓనాన్ "(Onan) అనేపేరుపెట్టింది. జూడా తనపెద్దకొడుకైనా "ఎర్"కు "తామార్" అనేఅమ్మాయినిచ్చి పెళ్లిచేశాడు దైవవిధిచేత అతను చనిపోయాడు. అప్పుడు జూడా తనరెండవకొడుకైన "ఓన్ ను" చూసి "నాయనా నీఅన్నభార్యతో సంగమించి ఆమెకు కుమారుణ్ణి ప్రసాదించి నీఋణంతీర్చుకో" అన్నాడు. తామార్ కు కొడుకుపుట్టినా తనబిడ్డగా లోకం గుర్తించదు తనఅన్నబిడ్డగానే చలామణీ అవుతాడు. తనఅన్న పేరు శాశ్వతమౌతుందని ఓనాన్ అనుకుని తామార్ తో సంభోగించికూడా (శుక్లనిరోధం లేక) శుక్లాన్ని నిర్గమింపజేసి భూమిపాలుచేశాడు. భగవత్కార్యమునకు అడ్డుపడుటచే అతడు త్వరలోనే మరణించాడు" జెనిసెస్ XXXVIII—2—10.

నుండీ, నేటివరకూ చాలామంది యీపద్ధతి ననుసరిస్తూ గ
వున్నారు. శుక్లనిర్గమనం కృత్రిమసాధనల అవసరం లేకుండానూ,
ఖర్చులేకుండానే సంతాననిరోధం జరుగుతుంది. అందరికీ యిది
వీలైన సమార్గం కావడంవల్ల యీపద్ధతే హెచ్చుగా అమల్లో
వుంది. క్రమశిక్షణలో యీపద్ధతిని విజయవంతంగానే సాగు
తున్నా కొంతకాలానికి శరీరారోగ్యం చెడిపోయి తీరుతుందని
కొందరువైద్యు లభిప్రాయపడుతున్నారు. వారిలో న్యూయార్క న
డా॥ ఎమ్. హాన్నాస్టోన్‌గారు, "శుక్లనిర్గమన విధానంవల్ల
స్త్రీపురుషు లిద్దరికీ ఒకేసారి "విసృష్టి" (Coitus) జరగదే
మోననే భయాందోళనవల్ల ఆనందం నశించిపోవడమే కాక
కొన్నికొన్ని వేళల్లో వొకవిధమైన మానసికఅసంతృప్తి, శారీ
రికపీడా కూడాకలగడం తథ్యం. అంతేగాదు, స్త్రీపూర్తిగా
తృప్తిపొంది ఆమెకుకూడా "విసృష్టి" జరగకముందే పురు
షుడు "నిర్గమించ" వలసివస్తే, దానివల్ల ఆస్త్రీకి అసంతృప్తి
వల్ల మానసికవ్యథా, వొత్తిడీ కలిగితీరుతాయి."[46] అన్నారు.
స్త్రీపురుషు లిద్దరికీకూడా ఆరోగ్యభంగం కలిగించి నరాల్ని
బలహీనంచేస్తుందని యీవిధానాన్నే కొందరువైద్యు లసలు
వొప్పుకోలేదు.

మరికొందరు వైద్యశాస్త్రజ్ఞులీ విధానంవల్ల మంచేగాని
చెడుకలగదనీ, పైగా యీమార్గమే మంచి సత్ఫలితాన్నిస్తుం
దనీ అభిప్రాయపడుతూన్నారు. వారివిషయంలో కొన్నివుదా

46. "సంతాన నిరోధం - ఆరోగ్యం, శుభ్రతా" (Health & Hygiene) దానిసర్వే "హానా. ఎమ్. స్టోన్ గారు (న్యూయార్కు) ఏప్రియల్ 1937.

హారణల్ని కూడా యిచ్చారు. "రాయల్ కాలేజీ" కౌన్సిల్ వారు 1937 సం॥లో గర్భిణీస్త్రీల-ప్రసవస్త్రీల శాఖల్లో జరిపిన సర్వే ప్రకారం తేలిన సారాంశమేమంటే—1910—19 సంవత్స రాలమధ్య పెళ్ళిళ్ళయిన స్త్రీలలో నూటికి 31 మంది కృత్రిమ సంతానపద్ధతుల వల్ల గాక (శుక్ల నిర్గమనం వల్లనే అని వేరే చెప్ప నక్కరలేదు) సహజంగానే సంతాననిరోధం చేస్తున్నామని చెప్పారు. 1910—19 సంవత్సరాలమధ్యే యింతమందీవిధా నాన్ని అనుసరిస్తున్నారంటే 1920-24 మధ్య పెళ్ళిఅయినస్త్రీ లెందరీవిధానాన్ని అవలంబిస్తున్నారోఅని లెక్కలుచూడగా నూటికి 29 మంది ఇదివరకటి లెక్కలమీద హెచ్చయ్యారని తేలింది." ఇటీవలతీసిన లెక్కల్లో తేలినసారాంశ మేమంటే పూర్వంలా యిప్పుడీ "శుక్లనిర్గమనాన్ని" వుపయోగించక కృత్రిమసాధనల్నే వాడుతున్నారని తేలింది. కృత్రిమసాధ నలు వుపయోగించినా, "శుక్ల నిర్గమనవిధానం" వల్లనైనా హానికరమైన ఫలితాలు కలుగుతున్నాయనే విషయం కొంత ఆశ్చర్యాన్ని కలిగించక మానదు. అంతేగాదు, ఈ రెండు మార్గాల్ని అనుసరించేవార్ని వైద్యపరీక్ష చేయగా సంతానం కలిగినవారిలోనూ కలగనివారిలోనూ కూడా యీవిధానాల వల్ల హానికేవిధంగా వున్నట్లూ మార్పులేమీ లేనట్లూ తేలింది.[47]

---

47. "రాయల్ కమీషన్"న్ని విమర్శిస్తూ భారతజనాభా రిజిష్ట్రారు (పే. 54 _ పే. 70 మొదటివాల్యూమ్) తమ వుద్దేశాన్ని యిలా వెల్లడిం చారు. "శుక్లనిర్గమన" విధానమే చెడుపరిణామాలకి దారితీసేదైతే యింతమందిజనం, యింత కాలంనుంచీ దాన్ని అమలులో పెట్టి వుండరు. కొన్ని

సంతాననిరోధాన్ని గురించి నేడు ప్రచారములోవున్న సాహిత్యంలో "శుక్లనిర్గమన" విధానమంత ప్రచారములో లేకపోయినా వేరే మరొక సహజనిర్గమనవిధానం అమల్లో వుంది. కాని యిదిఅనుకునేటంత సులభసాధ్యమైన పనిమాత్రంకాదు. దీన్ని ఆంగ్లభాషలో 'కరేజా' (Karezza) అని అంటారు. డా॥ డికెన్‌సన్‌గారు, "రకరకాల బాహ్య, అంతర వుపరతి, రతుల్లో సంభోగించి స్త్రీకి "విస్పృష్టి" లేక తృప్తి కలిగినతరువాత పురుషుడు బాహ్యోపరతులతోనే భావ తృప్తినిపొంది శుక్లనష్టంకలగకుండా రతిసల్పడాన్నే 'కరేజా' అంటారు అని వ్రాశారు.[48] స్త్రీపురుషు లిద్దరూ ఏకగ్రీవాభిప్రాయంతో సంతాననిరోధం కావాలని యిరువురూ శుక్ల, శోణితనష్టం కలగకుండా రమిస్తారని డా॥ పలిక్స్టోకుహామ్ గారు "కరేజా" అనే తనపుస్తకంలో రాస్తూ, "బాహ్యోప

యితర కారణాలవల్ల కొందరికీవిధానంవల్ల అనారోగ్యం రావచ్చు, అలాగే కొందరికీ విధానంవల్ల ఏమీ హానికలగకపోవచ్చు. అందుచేత రాయల్ కమీషనువారి ప్రచురణ సత్యదూరం కాదని ఋజువౌతుంది. ప్రస్తుత పరిస్థితుల్లో యీ విధానం గురించిన వివరాలుదొరకడం చాలాకష్టం. దీన్నిగురించిన సత్యాన్ని తెలుసుకోవలసిన అవసరం యెంతైనావుంది. కాని దీన్నిబట్టి మనమొక విషయాన్నిమాత్రం నిర్ధారణ చేయవచ్చు. చాలామంది దంపతులకు కృత్రిమ సంతాన నిరోధం .సహజంగా యిష్టం లేకపోవచ్చు. వారిద్దరు ముగ్గురుబిడ్డలు కల్గేవరకూ భయంవల్ల దూరంగా వుండవచ్చు కాని తరువాత "శుక్లనిర్గమన" విధానాన్ని అనుసరించక తప్పదంటూ చెప్పారు. భారతజనాభా 1951, 1 వాల్యూ, ఇండియా 1 పార్టు, ఏ. రిపోర్టు పేజి 222-23.

48. "టెక్నిక్స్ ఆఫ్ కన్సెప్షన్ కంట్రోల్"అనే గ్రంథాన్ని రోబర్టు, ఎల్. డికెన్సన్‌గారు రచించారు (లండన్ - 1932) పేజి 62.

రతులవల్ల భావం అధికమౌతుంది. దీనివల్ల స్త్రీపురుషులిద్దరూ ఆంగికరతికి సంసిద్ధులై నెమ్మదిగా ఒకరినొకరు చేరుతారు. అనుభవంవల్ల, త్వరపడకుండా వుండడంవల్లా యిద్దరూ మానసికానందాన్ని పొంది ఆతన్మయత్వంలోనే తాదాత్మ్యం చెందుతారు. ఈవిధమైన రతిలో, ఆవేగంగాని, ఆతురతగాని, ఆవేశంగాని పొందగూడదు. పైగా సంతానేచ్ఛగాని, 'విసృష్టి' లేక తృప్తిగాని కావాలనేవాంఛకే యిందులోతావులేదు.[49]

డా॥ హావిలాక్ ఎల్లిస్, డా॥ స్టోక్‌హామ్‌చెప్పిన యీ విధానంలో యేమాత్రం అంగీకరించడంలేదు. "కరేజా" అనేరతిని అవలంబించేవాళ్ళు లోకంలో చాలా కొద్దిమంది వుంటారు. ఇంతకంటే "శుక్లనిర్గమాన్ని అనుసరించేవారే హెచ్చుసంఖ్యలో దొరుకుతారు. "కరేజా" అనే యీపద్ధతిని తేలికగా అమలుపరచడానికి వీలులేదు. (Oneida) "ఓనైడా" అనేవొకవర్గంవారీ విధమైనరతిని చేస్తూవుండేవారని డా॥ స్టోక్‌హేమ్ తన "కరేజా" అనే పుస్తకములో రాశారు. ఈరతికి చాలాకాలం పడుతుందికాబట్టి స్త్రీలు దీన్ని చాలా యిష్టపడడమేగాకుండా "శుక్లప్రసారం" లేక 'విసృష్టి' వల్లకలిగే యిబ్బందులేవీ వారికి కలగవు. ఈ రతిని యెరిగిన స్త్రీలందరూ దీన్ని ఆమోదించారు. కాని దీన్ని అవలంబించిన పురుషులవిషయంలో మాత్రం కొన్ని సందేహాలు కలుగుతున్నాయి. "శుక్లనిర్గమనం" వల్ల కలిగే చెడుఫలితాలన్నీ కాకపోయినా కొన్నిఅయినా యీరతివల్లకూడా కలుగు

49. ఏలిస్ స్టోక్‌హామ్ రచించిన "కరేజా" (న్యూయార్కు, లండన్, పెటిట్ 1903).

తున్నాయని అభిప్రాయపడుతున్నారు. చాలాకాలంగా నిర్ణయంలోయిది నిజంకాకపోవచ్చు. మనోనిశ్చలత్వాలు, స్త్రీపురుష శరీరాలు, పటుత్వంవున్న పురుషులీవిధమైన రతివల్ల సంతృప్తి తాల్ని అనుభవించకపోయినా, యీవిధమైన రతినిసులభంగా అతిగా చెయ్యకూడదు.[50]

ఉత్తరన్యూయార్కు రాష్ట్రంలో "ఒనిడా" అనే పేరుగల సంఘంవారీ రతివిధానాన్ని చాలాకాలంగా అవలంబిస్తూ జయాన్ని సాధించారు. 'నోయిస్' "Noyes" అనే మతాధికారి మొట్టమొదటిసారిగా దీన్ని ప్రచారంలోకి తెచ్చారు. వారిసంఘంలో అనుభవజ్ఞులైన గృహిణులు యువకులైన బ్రహ్మచారులకూ, యౌవ్వనులకూ నేర్పుతారు. అల్లాగే వయసు వచ్చిన బ్రహ్మచారిణులకు అనుభవజ్ఞులైన పురుషులు శిక్షణ పొందినతరువాతే వారు పెళ్ళిచేసుకుని గృహపత్నిత్వం నెరిగి వుంటారు. పెళ్ళిఅయినతరువాత వ్యభిచారం యేమాత్రం ఒప్పుకోబడదు. ఈసంఘంవారు, చాలా నీతిపాత్రులనీ, తెలివిగలవారనీ, అంతేగాకుండా చాలాకష్టపడి పనిచేసేవారనీ యెన్నోఆధారాలవల్ల ఋజువైంది. ఈనాడు వారీవిధానాన్ని పరిత్యజించినా ఆర్థికంగా చాలావున్నతస్థాయిలో జీవిస్తున్నారు. 1800 లో యిరుగుపొరుగు రాష్ట్రాలవారీ రతివిధానాన్ని చూచి యేవగించుకుని 'చట్టవిరుద్ధమిది' యని నిషేధించారు. ఈవిధానంవల్ల ఖర్చులేకపోగా మంచి మనోధృఢతా, సంయమనం, యితరుల్ని అర్థంచేసుకునే నేర్పు అలవడతాయి.

50. "సైకాలజీ ఆఫ్ సెక్స్" హేవిలాక్ ఎల్లిస (న్యూయార్కు, ఎమర్సన్ బుక్ 1946) పేజి 289-90.

కుటుంబనియంత్రణా కేంద్రాల్లో యీవిధానాన్ని పాఠాలుగా చెప్పడం యెంతైనా అవసరం.

పురుషాంగాన్ని ఆచ్ఛాదన చేసుకోవడం యింకొకరకమైన సంతాననిరోధమార్గం. ప్రపంచమంతటా సంతాననిరోధానికే గాకుండా, సుఖరోగాదులు అంటుకోకుండా వుండడానికికూడా యీ ఆచ్ఛాదనాన్ని నాలుగువందల యేళ్ళనుంచీ వాడుతున్నారు. మొట్టమొదట యీఆచ్ఛాదనాన్ని కనిపెట్టింది ఇటలీ వాస్తవ్యుడైన వొక కాథలిక్కు-డాక్టరు. సహజంగా, నమ్మకంగా, చెడుఫలితాలు లేకుండా యీ సాధనం బాగావుపయోగపడుతుంది. కాని దీనిలో వొకేవొక్క ప్రమాదం మాత్రముంది. "ఆచ్ఛాదనం" యేమాత్రం మంచిరకం కాకపోయినా, చౌకబారుదైనా ప్రమాదంమాత్రం తప్పదు. వీటివల్ల కొన్నిసమయాల్లో, సహజసుఖానికి అవరోధం కలగడం శారీరికబాధకూడా కలగడం కద్దు.

"శుక్లనిర్గమన" విధానంలోనూ, 'ఆచ్ఛాదన' విషయంలోనూకూడా పురుషుడే ప్రయోగకర్త అవడంచేత సహజంగా ప్రమాదాన్నించి కాపాడవలసిన స్త్రీతనసదుపాయం, సౌఖ్యంకోసం పురుషుడిమీద ఆధారపడవలసివస్తుందని కొందరీవిధానాన్ని అంగీకరించడంలేదు. భర్త యేమాత్రం అజాగర్తగా వున్నా, నిర్లక్ష్యంగావున్నా దానిఫలితాన్ని అనుభవించేది భార్య. అందుచేత యీరోజుల్లో స్త్రీలుపయోగించే సాధనాలకున్న విలువ పురుషు లుపయోగించే సాధనాలకులేదు.

స్త్రీ గర్భంధరించాలంటే పురుషునిశుక్లం స్త్రీ యింద్రియంలో ప్రవేశించి అక్కడనుంచి తిన్నగా "ఓవరీనాళాల

ద్వారా స్త్రీగర్భకోశంలోకి వెళ్ళి అక్కడవున్న 'శోణితం' లో కలియాలి. స్త్రీ జననేంద్రియంలోవున్న ఓవరీలోని మార్గంలోనే శుక్ల శోణితాలు కలియడంజరుగుతుంది. అందు చేత శుక్లాన్ని స్త్రీగర్భకోశంలోకి వెళ్ళకుండా యెంతకాలం మనం ఆపుజేయగలమో అంతకాలం గర్భధారణ జరగదు. ఈశాస్త్రీయమైన విజ్ఞానాన్ని సముపార్జించిన తరువాతనే సంతాననిరోధ మార్గాల్ని కనిపెట్టారు. కృత్రిమసాధనల వల్లనూ, కొన్ని రసాయనికద్రవ్యాల వాడుకవల్లనూ కూడా సంతాననిరోధాన్ని అమలుజరుపు తున్నారు. రసాయనిక పద్ధతివల్ల స్త్రీగర్భకోశంలోనికి పురుషశుక్లం ప్రవేశించకుం డానే మార్గంలో శుక్లంలోవుండే జీవకణాలు చంపబడుతాయి. కృత్రిమసాధనలవల్ల శుక్లం స్త్రీగర్భకోశంకిచేరకుండా పూర్తిగా అరికట్టబడతాయి.

## రసాయనిక సాధనలు

గర్భనిరోధానికి చాలారకాల రసాయనిక సాధనలున్నాయి. కాని సర్వసాధారణంగా "జెల్లీ" విధానాన్నే వుపయోగిస్తు న్నారు. ప్రత్యేకంగా తయారుచేయబడిన గాజుగొట్టం లేక "నోజిల్" ద్వారా "జెల్లీ" ని సంభోగానికిముందు స్త్రీ యోనిలోకి పంపుతారు. ఇదే గర్భనిరోధక పరికరంగానూ, రసాయనిక ద్రవ్యంగానూ పనిచేస్తుంది. కాని యిదిపూర్తిగా విజయవంతమైన పనికాదు. ఇంతవరకూ నూటికి నూరుపాళ్ళు యేరసాయనికద్రవ్యప్రయోగం జయప్రదంకాలేదు.

## డయాఫ్రెమ్, జెల్లీ విధానం

డయాఫ్రెమ్, జెల్లీవిధానాన్నే ప్రస్తుతం అమెరికా, యూ రపు, బ్రిటిషు దేశాల కుటుంబనియంత్రణ కేంద్రాల్లో వుపయో

గిస్తున్నారు. దీన్నే 'పెస్సరీ' విధానమనికూడా అంటారు. స్త్రీల అవయవాలనుబట్టి "డయాఫ్రెమ్" లు తీసుకోవలసి వుంటుంది. వైద్యపరీక్ష చేయించుకుని వైద్యులసలహాపైన కావలసినసైజూ, రకమూ "డయాఫ్రెమ్" తీసుకోవాలి. కొద్ది పాటి శిక్షణతో ప్రతీస్త్రీవీటిని వుపయోగించవచ్చు. ఈవిధానంవల్ల చాలామంచిఫలితాలు కూడా వున్నాయి. దీనివల్ల సహజసంభోగసుఖాని కేవిధమైన ఆటంకమూ వుండదు. సంతానం కావాలని యిచ్ఛకలిగినప్పుడు "డయాఫ్రెమ్" ని వుపయోగించడం మానివేయవచ్చు. సంతానం కలిగినతరువాతమాత్రం తిరిగి వైద్యునిదగ్గిరికి వెళ్ళి పరీక్షచేయించుకుని "డయాఫ్రెమ్" సైజు మార్చవలసి వుంటుంది. మానవుడు కనిపెట్టిన అన్ని సంతాననిరోధమార్గాల్లోనూ యిదేమిక్కిలి విజయవంతమైన విధానమని డాక్టర్లందరూ చెపుతున్నారు.

"రాయల్ కమీషను" వారి రిపోర్టులో జనాభానిగూర్చిన విమర్శచేస్తూ, కృత్రిమసాధనలవల్ల సంతాననిరోధం చేయడం తప్పుకాదు. కృత్రిమసాధనాలు అందుబాటులో లేకపోతే మరేయితర సాధనాలవల్లో అపకారం పొందడంతప్పదని మాకుటుంబసర్వేలవల్ల తేలింది. బొత్తిగా విజ్ఞానంలేని వాళ్ళు గర్భస్రావంవంటివియింకా చేస్తూనేవున్నారు. కావల్సినంతమంది బిడ్డలుపుట్టినతరువాత దంపతులీ విధానాన్ననుసరించినా తప్పులేదు, అంతేగాదు వారుతప్పకుండా దీన్ని అనుసరించాలికూడా! కృత్రిమసంతాన నిరోధంవల్ల మానవుడు చాలావరకూ తనఅదృష్ట దురదృష్టాల్ని అరికట్టుకోగల్గుతున్నాడు. దీనివల్ల కొన్నిసమస్యలుకూడా పుడుతున్నాయి.

ఇటీవల పందొమ్మిదవ శతాబ్దంలోనే యీ విధానం కనిపెట్ట
బడింది. చాలామంది దంపతులు తమకిష్టమున్నంతమంది సం
తానాన్నే కని కుటుంబాన్ని నియంత్రించుకుంటున్నారు. తమ
కున్న సంతానాన్ని ప్రేమతో పెంచుకుంటున్నారు. రసాయ
నిక, కృత్రిమసాధనాల వల్ల, సంతాననిరోధంలో లోపాలున్నా
సాంఘికదృష్ట్యా హెచ్చువుపకారమే చేస్తుంది. సంతాననిరో
ధకమార్గాలు, అందరికీ అందుబాటులోవుండి. తేలికగా అర్థ
మయ్యేట్లువుంటే యెందరోయువకులు తండ్రులు కావడానికి
ముందుకువస్తారు. దీనివల్ల పెద్ద పెద్ద కుటుంబాలుండడానికి
అవకాశముండదు, గాని హెచ్చుమంది పిల్లలు కావాలనుకునే
వారుమాత్రం పిల్లల్ని పొందవచ్చు. పుట్టేడు బిడ్డలందరూ
కావాలనికోరుకుంటే పుట్టినపిల్లలే గాబట్టి హెచ్చుజాగ్రత్తగా
ప్రేమవాత్సల్యాలతో పెంచబడతారు.

భారతదేశంలో సంతాననిరోధం అనుసరించడం చాలా
కష్టసాధ్యమైన కార్యం. అశేషంగావున్న పల్లెల్లోనూ, పట్ట
ణాల్లోనూవున్న ప్రతిస్త్రీ డాక్టరుదగ్గిరికి వెళ్ళి పరీక్షచేయించు
కుని సంతాననిరోధక సాధనాలు పొందాలంటే యెన్నో
సంతాననిరోధక కేంద్రాలు, యెందరో డాక్టర్లూ కావల్సివుం
టాయి. ఇన్ని కేంద్రాల్ని నెలకొల్పడానికి యెన్నికోట్ల రూపా
యలైనా కావల్సివుంటాయి. ఒకవేళ కొన్ని కేంద్రాల్ని నెల
కొల్పినా వాటికివెళ్ళి పరీక్షచేయించుకొని ఆ సాధనాల్ని
కొనుక్కోగలశక్తి మనస్త్రీజనానికి లేదు. పురుషులకూడా
ఖర్చుచేయని పల్లెవాసులకు డబ్బుఖర్చుచేసి యీ సాధనాలు
కొనుక్కోడానికన్నా పురుళ్ళుపోసుకుని పిల్లల్నికని పారవేయ

డమే మంచిదని తోస్తుందంటే ఆశ్చర్యపడవలసిన పనిలేదు. పల్లెవాసులైన స్త్రీలకి వుచితశిక్షణా, వుచితపరికరాల సరఫరా చేయడానికి ప్రభుత్వం తలపెడితేగాని మనకు వేరే గత్యంతరం లేదు.



### "స్టెరిలైజేషన్"
### బిడ్డలు కలగకుండా ఆపరేషన్ లేక శస్త్రచికిత్స

బిడ్డలుకలగకుండా వుండాలంటే అన్నిటికన్నా సుఖంగా తేలికగా అయిపోయేది శస్త్రచికిత్స. సూక్ష్మంగాఅయే యీ శస్త్రచికిత్సనే నిపుణులైన వైద్యులుకూడా ప్రోత్సహిస్తున్నారు. (Salpinectomy) స్త్రీ ప్రసవమైన తరువాత ఇరవైనాలుగు లేక నలభైయెనిమిది గంటలలో ఆమెకు శస్త్రచికిత్స చేయవచ్చు. అందుచేత యీశస్త్రచికిత్స (ఆపరేషనుకు) కుగాను ఆమె పురుడుపోసుకున్నతరువాత హెచ్చుకాలం హాస్పటలునందు వుండనక్కరలేదు.

కాని పురుషుడు చేయించుకునే ఆపరేషన్ (Vasectomy) చాలా తేలికైనపని. ఈ శస్త్రచికిత్సకు పన్నుతీయించుకున్నంత బాధగాని, అంతకాలంగానీ పట్టదు. దీనివల్ల పురుషానయంలోనికి వచ్చే కొన్నినాళాల్ని తప్పిస్తారు. దీనివల్ల సహజంగాపొందే రత్యానందంగాని, కోర్కెగాని యేవిధంగానూ సన్నగిల్లదు. చాలామంది కీవిషయంలో అపోహాలున్నమాట నిజంగాని అదిసత్యానికి విరుద్ధమైనవి. ఈ ఆపరేషను వల్ల శుక్లంలోని జీవ కారకమైన అణువులు, స్త్రీగర్భంలోప్రవేశింపక పురుషుడిరక్తం ప్రవాహంలోకలిసిపోయి, అన్నిమలిన

పదార్థాలు శరీరాన్నుంచి బయటికి వచ్చినట్లుగానే యిప్పీ బహిర్గతమౌతాయి. ఈశస్త్రచికిత్సవల్ల శుక్రంలో వుండవల్సినన్ని గర్భధారక అణువులుండకపోయినా శుక్రం మాత్రం మామూలుగానే ధారవాహికగా వుంటుంది. ఈ శస్త్రచికిత్స చేయడానికి పెద్దనిపుణులే అవసరంకాదు. సామాన్య వైద్యులెవరైనా చేయవచ్చు.

ఇద్దరుముగ్గురు బిడ్డలున్న యేతండ్రియైనా యీ శస్త్రచికిత్స చేయించుకోవచ్చును. కాని దురదృష్టవశాత్తు బిడ్డలుగాని చనిపోతే తిరిగిఅతడు సంతానాన్నిమాత్రం పొందే స్థితిలో వుండడు. సాధారణంగా యిద్దరూ ముగ్గురూ బిడ్డలు వున్నప్పుడు బలంగానూ, పుష్టిగానూ వుండడంచేత సహజంగావాళ్ళు ఆయుష్మంతులుగానే వుంటారు. అంతేగాకుండా వారిమానసిక, శారీరికాభివృద్ధికి తలిదండ్రులు హెచ్చుకాలం ధనంకూడా వినియోగించడానికి వీలౌతుంది. కాని దీనివల్ల వొకేవొక గొప్ప బాధ వుంది. ఈ శస్త్రచికిత్స పొందినవారికెవరికైనా దైవవశాత్తు భార్యచనిపోవడమే తటస్థించి రెండవ పెండ్లిచేసుకుంటే, రెండవభార్యకు మాత్రం సంతానంకలిగే అవకాశా లేమాత్రంలేవు. ఈవిధమైన సంతాననిరోధంవల్ల, తరుచూ వ్యవధిలేకుండా పురుళ్లు పోసుకోవల్సిన అవస్థలు స్త్రీలకు తప్పడంవల్ల, నీరసంగాఅయిపోవడం, అనారోగ్యంతో మరణించడం తరుచూ సంభవించవు సరిగదా, ప్రసవమరణ సంఖ్యకూడా చాలావరకూ తక్కువగానే వుంటుంది.

భార్యాభర్తలిరువురూ యేకగ్రీవంగా సంతాననిరోధాన్ని కోరితేతప్ప యీశస్త్రచికిత్స చేయడానికి వీలుండదు. బలవం

తంగా యీవిధమైన శస్త్రచికిత్స చేయడంకంటే అధికసంతా
నంతో బాధపడనీయడమే మంచిది. కావాలని యీశస్త్రచి
కిత్సకు వచ్చినవారికికూడా వైద్యులు దీనిలోవున్నలోపాలు
విమర్శగా చెప్పకపోతే వొకసారి శస్త్రచికిత్స చేసినతరువాత
యెంతవిచారించినా లాభంలేదు.

కుష్టు, మూర్ఛ, పిచ్చి, గాక మరేరకమైన అంటురోగా
లున్నవాళ్ళకైనా, ఆరోగ్యశాస్త్ర దృష్ట్యా యీ విధమైన
శస్త్రచికిత్స తప్పకచేసి తీరవలసిందేను! దీనివల్ల కుటుంబాలు
రోగభూయిష్టం గాకపోవడమేగాక, యెన్నో జనాభాసమ
స్యలూ, బాధలూకూడా చాలావరకూ తగ్గుతాయి. చాలా
పాశ్చాత్యదేశాల్లో, ముఖ్యంగా సంయుక్తఅమెరికా దేశా
ల్లోని, కాలిఫోర్నియా, వుత్తరకారొలీనా రాష్ట్రాల్లో యీ
విధానం అమలుపరచబడుతుంది. ఇదే విధానాన్ని భారత
దేశంలోకూడా యెందుకు అమలుపరచగూడదు! కాని మన
దేశపరిస్థితులదృష్ట్యా శాస్త్రపరిశోధనలు జరిపి వాటిఫలితా
లను గ్రహించిన తరువాతనే మన మీవిధానాన్ని అమలులోకి
తేవచ్చును.

## శారీరికశాస్త్రరీత్యా సంతాననిరోధం.

## (Biological Methods.)

రసాయనిక ద్రవ్యాలవల్లా, కృత్రిమసాధనలవల్లా పురుష
శుక్లం, స్త్రీగర్భంలోకి వెళ్ళకుండా చేసేసాధనల్ని గురించి
యింతవరకూ ముచ్చటించాం! కాని నేడుశరీరశాస్త్రరీత్యా
సంతాననిరోధ మేవిధంగా సాధించడమా యని శాస్త్రజ్ఞులు

తీవ్రమైన కృషిచేస్తున్నారు. స్త్రీపురుషులు శోణితశుక్లాలు ఐక్యమైనా గర్భధారణ జరుగకుండా వుండేట్లుగానూ, అసలు యీ రెండూ ఐక్యమేగాకుండా వుండడమేలాగనీ, గర్భధారణ జరిగినా పిండం పెరిగి పెద్దదవకుండా యెలాచేయడమూ అని శాస్త్రజ్ఞులు పరిశోధనలు చేస్తున్నారు. కొన్నిమాత్రలు నోట్లోవేసుకోవడంవల్లనే గర్భధారణ జరుగకుండా చేయవచ్చునని శాస్త్రజ్ఞులు వూహించారు. (ఈవిధానం అప్పుడే అమల్లోకికూడా వచ్చేసింది.) పురుషశుక్లంలో గర్భకారకమైన జీవకణాలూ, స్త్రీశోణితంలోని పోషకకణాలూ కలిసినా అవి వృద్ధిపొందకుండా వుండేపరిస్థితులు కల్పించడానికి శాస్త్రజ్ఞులు పరిశోధనలు చేస్తున్నారు. ఆడయెలకలమీద డాక్టరు లాంజగుగారు చేస్తున్న ప్రయోగాలు చాలావరకూ విజయవంతంగానే వున్నాయి. [52]

తాత్కాలికంగా స్త్రీలశరీరంలోవున్న "హార్మోనును" తగ్గించివేయడంవల్ల కూడా గర్భాన్ని నిరోధించవచ్చునని తెల్సుకున్నారు. అలాగే "ప్రొగెస్టిరోన్" అనేదాన్ని ప్రయోగించడంవల్లకూడా సంతాననిరోధం జరుగుతుందని కనిపెట్టారు. ఈవిషయాలన్నీ ఆడజంతువులమీద ప్రయోగాల వల్లనే ఋజువుకావడంచేత స్త్రీలమీద వీటిని ప్రయోగించడం చేత యేవిధమైన ఫలితాలు కలుగుతాయో వూహించలేకుండా వున్నారు. శారీరక శాస్త్రరీత్యా సంతానాన్ని అరి

52. అలెగ్జాండరు లేంగరుగారూ, జే. గార్షియా మెన్‌డెజ్ గారూ రచించిన ఆర్కివిస్ ఆఫ్ క్యూబాన్ కాన్సిరాలొజీ 8 వ్యా. (1949) పే 332 - 340.

కట్టాలంటే అతిసున్నితమైన గర్భకోశం యేమాత్రం చెడిపోకుండా అతిజాగ్రత్తగా యీ కొత్తప్రయోగాల్ని వుపయోగించవల్సి వుంటుంది. 53 "ఎన్‌డ్రోక్రైన్" విజ్ఞానరీత్యా కొద్దికాలంలోనే స్త్రీపురుషులు తాత్కాలికంగా సంతానం కలగకుండా వుండాలని కోరితే "గ్లాండుల" నుండి తయ్యారైన కొన్ని మాత్రలు లేక మందులవల్ల అది సాధ్యపడుతుం దనడానికి సందేహంలేదు.

కొన్ని సనాతన అనాదిజాతుల్లో కొన్ని చెట్లఆకులూ, వాటి రసాలవల్ల సంతాననిరోధం చేయబడుతూవుంది. ఈవిషయం మీాదకూడా కొన్ని పరిశోధనలు చేయబడుతూ వున్నాయి. లిథోస్‌ఫెర్‌మమ్ అనే (Lithospermum) చెట్టుఆకును అమెరికన్‌రెడ్ యిండియన్లు సంతాననిరోధానికై వాడేవారని తెలిసింది. ఇది యేవిధంగా, యెంతవరకూ శరీరంలో దేనిమీాద పనిచేస్తుందో తెలియలేదుగాని దీనిప్రయోగం వల్ల చాలా మగా ఆడా మృగాలికి సంతానం కలిగించే శక్తిపోయింది. ఈచెట్లలోని యేవస్తువువల్ల బిడ్డలు పుట్టించే శక్తినశించిపోతుందో పరిశోధనలవల్ల తేలితేగాని యిది మానవులెంతవరకూ దీన్ని వుపయోగించ వచ్చో

---

53. అబ్రహామ్ స్టోన్ గారి "కరెంట్ రీసర్చి ఇన్ కాంట్రాసెప్షన్ ఇన్‌ది యునైటెడ్‌స్టేట్స్" 1953 సం॥లో (లండను 1954) పేజి 61. నాల్గవ అఖిలజాతీయ కుటుంబనియంత్రణాసభ స్టోక్‌హోమ్‌లో జరిగినప్పుడు చదివినది. వీరిదే "రీసెర్చ్ ఇన్‌కన్‌సెప్షన్ – ఎ రివ్యూ ప్రీవ్యూ" మూడవ అంతర్జాతీయ కుటుంబ నియంత్రణ సభయొక్క పత్రములు (బొంబాయి 1952) పేజి 101.

తెలదు. బహుశా యీవిషయాలు త్వరలోనే తేలవచ్చును.[54]

శారీరకశాస్త్రరీత్యా సంతాననిరోధం అమలుపరచడానికి వీలౌతుందని యీ నవీనపరిశోధనలవల్ల ఋజువు అవుతుంది. డెన్మార్కు దేశంలో కలరా నామరూపాలు లేకుండాపోయి నట్లుగా మనదేశంలో కూడా, చెడుచేయకుండా, సమ్మగ్రస్మె అందరికీ అందుబాటులో వున్న సంతాననిరోధక సాధనాలు దొరికితే అక్కరలేని సంతానం యెంతో దేశంలో తగ్గి పోతుంది.

---

54. బెంజామిన్. ఎఫ్ సీవ్వి గారి "ఏన్యూ ఏంటీ ఫర్టిలిటీ ఫ్యాక్టరు సైన్సు [ వాషింగుటన్. డి. సి) అక్టోబరు 10–1953. n. w. సెయరి "బయోకెమిస్ట్రీ ఆఫ్ కన్సెప్షన్ "యూజినిక్సురివ్యూ (లండను) 43, 139 (1952) లేన్సెట్. సెం 1 ఎ. 54 (1952) హూన్ రిజల్టుస్లో. పాల్, ఎస్ "ప్లాంట్ మెటీరియల్స్ యూజుడు బై ప్రిమిటివ్ పీపుల్ టు ఎఫెక్ట్సు, ఫెర్టిలిటీ. "సైన్సు (వాషింగుటన్ డి. సి. ) మే 7. 1954. వా 119. పే 626–631. పాల్. ఎస్. హెన్ షా, "ఫిజియలోజికల్ కంట్రోల్ ఆఫ్ ఫెర్టిలిటీ సైన్సు (వాషింగుటన్.డి.సి) మే 7. 1954 వా119. పే 626 631 పాల్ ఎస్ హెన్ షా "ఫిజియలోజికల్ కంట్రోల్ ఆఫ్ ఫెర్టిలిటీ సైన్సు (వాషింగ్ టన్ డి. సి.) మే 14–1953, వా 117. పే 572–582 కలకత్తాలో బేక్టీరియాలజీ ఇన్స్టిట్యూట్లో పనిచేయుచున్న డా"S.N సన్యాలుగారు "మంతర్" అనే ధాన్యంనుంచివచ్చేనూనెవల్ల గర్భధారణ జరగకుండా చూడవచ్చుననీ. విటమిను 'ఇ' కి ది వ్యతిరేకిగాబట్టి విరుగు డుగా వుపయోగించ వచ్చుననీ అన్నారు. జంతువులమీద యీప్రయోగం జయప్రదంగా వుంది. స్త్రీలపైన కొంతవరకూ మంచిఫలితాల్ని యిచ్చింది. ఈనూనెను ఇంజక్షను ద్వారా శరీరంలోకి పంపుతారు. దీనిప్రయోగంపై యింకాపరిశోధనలూ, పరీక్షలూ జరుగుతూనే వున్నాయి. "ఇండియన్ మెడికల్ ఎసోసియేషను జర్నల్"(కలకత్తా) మార్చి 1951 సంచికలో. S.N.సన్యాలుగారు "భారతజనాభాసమస్యల్ని" గురించి వ్రాశారు.

# ఆరవ అధ్యాయం

## అమలు జరపడంలో కలిగే కొన్ని చిక్కులూ సమస్యలూ; లాభాలూ

ప్రజాప్రభుత్వంవున్న యన్ని దేశాల్లోనూ సంతాన నిరోధ కావశ్యతను గుర్తించినా ఆర్థికంగా వెనుకబడిన మన దేశం వంటి దేశాల్లో సంతాన నిరోధంవల్ల కలిగే లాభాల్ని గురించిన ప్రచారం చేయడం, వాటిని వుపయోగించే విధానాలు నేర్పడం చాలా పెద్దసమస్యంగా పరిణమించింది.

భారత దేశ ఆరోగ్య, ఆర్థిక ప్రణాళికల్లో సంతాన నిరోధక పథకాల్ని ప్రవేశపెట్టడంవల్ల చాలా నష్టాలూ లాభాలూ కూడా వున్నాయి. బ్రిటిషు పాలనలోనేగాక, స్వాతంత్ర్య భారతంలో కూడా యెన్నడూ మన దేశంలో సంతాన నిరోధంపై ఆంక్ష లేదు. ప్రపంచ దేశాల్లో చాలా వాటిలో సంతాన నిరోధం నిషేధం. కాని జపాను దేశపు ఆర్థిక సాంఘిక వ్యవస్థ ననుసరించి అక్కడ సంతాన నిరోధం చట్టబద్ధ మైందిగా చేయబడింది. అమెరికా సంయుక్త రాష్ట్రాల్లోనూ, బ్రిటిషు సామ్రాజ్యంలోనూకూడా, నైతిక సాంఘిక, మత విషయిక చర్చలెన్నో జరిగిన మీదటగాని కుటుంబనియంత్రణ వొప్పుకోబడలేదు. మిగిలిన దేశాల్లోని గందరగోళాల ఫలితంగా మన దేశంలో యేయిబ్బందీ లేకుండానే కుటుంబ నియంత్రణ అంగీకరించబడింది. రాజకీయంగాగానీ, చట్టరీత్యాగాని,

కుటుంబనియంత్రణ అవలంబించడానికి భారతదేశంలో యెటు వంటి అడ్డులూ లేవు. ప్రభుత్వ పంచవర్ష ప్రణాళికల్లో కూడా యిది అంగీకరింపబడింది. నాగరిక దేశాల్లో కూడా అంగీకరించ బడని సంతాననిరోధం భారతదేశంలో నిషేధం కాదంటే మనమెంత అభ్యుదయం సాధించామో దీన్నిబట్టి తెలుస్తుంది.[55]

పంచవర్ష ప్రణాళికల కమిషన్‌తోపాటు ప్రభుత్వంకూడా సంతాన నిరోధాన్ని అంగీకరించినా, దీన్ని అమలులోకితీసుకు రావల్సినవారు స్త్రీలే - స్త్రీ లేమతానికి చెందినా ఫరవాలేదు. ఎవరెంత ప్రచారం చేసినా స్త్రీలు గనుక దీన్ని అంగీకరించక పోతే చేసేదేమీలేదు. "గాలప్ పోల్, మాస్ అబ్సర్వేషన్, ఇన్స్టిట్యూట్ ఆఫ్ పబ్లిక్ ఒపీనియన్ వంటి సంస్థలు అమెరికాలోవలె మనదేశంలో లేకపోయినా యేదైనా పరిశోధన చేయవలెనంటే మంచిఅవకాశాలున్నా యనడానికి సాక్ష్యం చాలాదొరుకుతుంది.

1952, 1951 సంవత్సరాల జనాభా నాధారంగా తీసుకుని బొంబాయి రాష్ట్రంలోవున్న బరోడానగరం జనాభా 211, 416 మంది లోనూ అక్కడక్కడ నూటికి ఐదుమందిని చొప్పున

---

"భారతదేశంలో తప్ప ప్రపంచంలో మరే యితరదేశాల్లోనూ కామశాస్త్రపారీణత జీవనవిధానంలోని ఒకభాగంగా గుర్తింపబడలేదు. భారత విజ్ఞానశాస్త్రజ్ఞులు అవినీతికి తావుఈయకుండానే సహజమైన కోర్కెలకు జీవితంలో తావిస్తూ వాటిని అనుభవించి వుపశమింప జేసేట్లుగా జీవితాన్ని విభాగించారు. భారతీయులు కామానికీ ప్రేమకూ యిచ్చిన విలువా అవకాశం మరెవరూయిచ్చియెరుగరు." అని హావిలాక్ఎల్లిస్ "స్టడీస్ ఆఫ్ థి సెక్సుసైకాలజీ" అనేగ్రంథంలో వ్రాశారు. (లండను1936)వా 6. పే. 129

తీసుకుని వారికి సంతాన నిరోధంపై యెటువంటి అభిప్రాయ మున్నదో అని ప్రశ్నించి, పరిశీలించినారు. అక్కడ ప్రజ లంతా మరాఠీ, గుజరాతీ మాట్లాడేవారే! వారిలో 15-45 యేళ్ళ మధ్యనుండి పెళ్ళిఅయి అధమం వొక్క బిడ్డఅయినా వున్న వారిని మాత్రమే ప్రశ్నించారు. మరాఠీలలో నూటికి 63 మంది స్త్రీలూ గుజరాతీలలో నూటికి 77 మంది స్త్రీలూ సంతాన నిరోధాన్ని అంగీకరించారు. నూటికి 18 మంది గుజ రాతీవాళూ నూటికి 5 మంది మరాఠీ తల్లులూ "సహజసంయ మనా" న్ని అంగీకరించారు. నూటికి 19 మంది గుజరాతీ స్త్రీలూ, నూటికి 18 మంది మరాఠీ స్త్రీలూ యేవిధమైన సంతాన నిరోధానికీ యంగీకారం తెలుపలేదు.[56]

ఇదేవిధంగా మైసూరు రాష్ట్రంలో రామనగరం అనే గ్రామంలో జరిపిన సర్వేవల్ల నూటికి 78 మంది భార్యాభ ర్తలు "సంతాననిరోధాన్ని అవలంబించాలని కోర్కెగల్గివుండీ కూడా, యెలా అమలుజరపాలో తెలియక వూరుకున్నామని" చెప్పేరని తేలింది. అలాగే ఢిల్లీలో "లోడీ" అనేచోట కట్టినయిళ్ళవద్ద జరిపిన "సర్వే" లో నూటికి 72 మందిస్త్రీలు తమకిక బిడ్డలు పుట్టకూడదనో, లేక కొంతకాలంమాత్రం పిల్లలులేకుండా వుంటే బాగుండుననో మనసులో కోరుకుంటు న్నామని అన్నారు. కుటుంబనియంత్రణ పథకంవారు మీరట్ ఆల్మోరా, ఇటావా, లక్నో, ఉత్తరప్రదేశ్ లలో జరిపిన

56. మూడవ అంతర్జాతీయ కుటుంబనియంత్రణాసభ (బొంబాయి 1952) యందు శ్రీచంద్రశేఖరంగారు "కుటుంబనియంత్రణపై బరోడా లోని కొన్నిమతాల అభిప్రాయాన్ని గురించి మాట్లాడారు. పే. 71.

పరిశీలనలవల్ల నూటికి 62 మంది తల్లులూ నూటికి 57 మంది తండ్రులూ కుటుంబనియంత్రణ మీద యాసక్తి చూపారని తెలియజేశారు. కుటుంబనియంత్రణ గురించి మీయభిప్రాయ మేమని స్త్రీపురుషుల్ని ప్రశ్నించగా నూటికి 64.8మంది స్త్రీలూ, నూటికి 53.2 మంది పురుషులూ [అందరూ పెళ్ళి అయినవారేగాని దురదృష్టవశాత్తు 132 వితంతువు లున్నారు] పూనాదగ్గిర జరిపిన సర్వేలో తమకి కుటుంబనియంత్రణా, సంతాననిరోధాల్ని గురించి తెలుసుకోవాలని వుత్సాహంగా వుందని తెలియజేశారు. సర్వేచేసినవారిలో 1705 మందిపురుషులూ 751 మంది స్త్రీలూ వున్నారు.[57]

భారతదేశంలోవున్న పట్టణాల్లోనూ, పల్లెల్లోనూ కుటుంబ నియంత్రణాకేంద్రా లెందుకు లేవని కొందరికి సందేహం కలగ వచ్చును. పైన చెప్పినట్లుగా కుటుంబనియంత్రణ అత్యంతావశ్యమైనదని గుర్తించినా దాన్ని అమలు తీసుకు రావడం మామూలు పనిమాత్రంకాదు. మనదేశపు ఆర్థిక దుస్థితి దృష్ట్యా యిది లాభదాయకంగాకపోగా చాలా ఖర్చుకు దారి తీస్తుంది. గాని అపారమైన మన జనబాహుళ్యానికి కుటుంబ నియంత్రణ నిజంగా యెంతైనా మేలు కలగచేస్తుంది. ఆర్థికంగా వున్నతంగావున్న దేశాల్లోనే యిది ప్రచారంలో వుంది. భోగలాలసకు అలవాటు పడినవారు వాటిని వదిలి పెట్టడాని కిష్టపడక తుదివరకూ ఆనందాన్ననుభవించాలని సంతాన నిరో

57. దండేకర్, V.M కుముదినిగార్ల "పూనాజిల్లాలోని సంతానాభివృద్ధీ, నాశనం గురించిన సర్వే" లో పే 142, 172 (పూనాగోఖ్లే ఇన్స్టిట్యూట్ 1953)

ధాన్ని అవలంబిస్తారు. సంతానం హెచ్చుగావున్నకొద్దీ ఖర్చు అధికమై భోగాలకు వలసినధనం లోపం కలుగుతుందనే కారణం వల్లనే సంతాననిరోధం ధనిక దేశాల్లో అధికంగా ప్రబలుతుంది. భారతదేశంలో సామాన్యులకు కుటుంబనియంత్రణ అమలులోకి తెచ్చేస్తోమత లేదు. కాబట్టి దేశప్రభుత్వమే దీన్ని ప్రణాళికల్లో పొందుపరిచి అమలులోకి తీసుకురావల్సిన అవసరంవుంది. మన ఆర్థిక పరిస్థితి త్వరలోనే చక్కబడే అవకాశాలుగాని, మన జనాభా సమస్యలు తీరే సమయంగాని యింకా రాలేదు. మన దేశపు విషమపరిస్థితు లేమంటే అనుదినం జనాభా పెరిగిపోతూవుంది. పెరుగుతూన్న జనాన్ని అరికట్టాలంటే సంతాన నిరోధాన్ని అమలు పరచాలి. సంతాన నిరోధాన్ని అమలు పరచాలంటే ఆర్థిక స్తోమత వుండాలి. ఆర్థిక స్తోమతే మనదేశంలో కఱువుగా వుంది. అందుచేత కొంత కాలం వరకూ జాతీయ ప్రణాళికలన్నిటిలోనూ సంతాన నిరోధానికి తగిన ప్రాముఖ్యత ఈయక తప్పదు. ప్రణాళికల్లో దీనికి ప్రాముఖ్యత ఈయగానే మనపని తీరిపోదు. పల్లె ప్రాంతాల్లో దీనికి తగినంత ప్రచారం, ప్రోద్బలం యీయవల్సివుంటుంది కాని నేడు అలాగాక పట్టణాల్లో దీనిప్రచారం హెచ్చుగావుంది. అసలే జనాభావృద్ధిలేని పట్టణాల్లో సంతాన నిరోధంవల్ల జనసామర్థ్యం తగ్గిపోతే పల్లెలకీ పట్టణాలకీ మధ్యనున్న అగాధం మరింత హెచ్చిపోవడమే గాకుండా యిది మరికొన్ని క్రొత్తసమస్యలకు దారితీయవచ్చును. దేశానికీ వెన్నెముకై, దేశసౌభాగ్యానికి పునాదివేయవలసిన గ్రామసీమలే ఆర్థికంగా, సాంఘికంగా, ఆరోగ్యపరంగా, క్షీణించి

పోయి విద్యాసౌకర్యాలు లేకుండాపుంటే దేశాభ్యుదయం కలగకపోగా మొత్తం జనాభాయొక్క అభివృద్ధి వెనకంటు తుంది. మోయలేని బరువుతో క్రుంగిపోతున్న గ్రామాలే రాబోయే తరాల్లో దేశాభ్యుదయానికి చక్కని ప్రజల్ని అందీయవలసినవై వున్నాయి.

మాటలైతే చెప్పవచ్చును, గాని మనగ్రామాల్లో సంతాననిరోధం అవలంబింప చేయడంమాత్రం సామాన్యమైన పనిగాదు. సుభ్రతలేకుండా, వుండడానికి మంచి కొంపైనా కూడా కఱువై, త్రాగడానికికూడా ప్రవహించే నీళ్లుకూడా పుట్టకుండా, మఱుగైనా లేకుండా, బీదతనంతో, అజ్ఞానం, అవిద్యలతో గ్రామీణులు మగ్గిపోతున్నారు. హెచ్చుమంది నివసించే పట్టణాల్లోనే, పెద్దపెద్ద వైద్యశాలలూ, సంతాన నిరోధకేంద్రాలూ వున్నాయి. పది లేక ఇరవై గ్రామాల కైనా వొక సంతాననిరోధక కేంద్రం వుండితీరాలి. ఇది త్వరలోనమకూడే పనికాదుకాబట్టి నెలకొకమారైనా కుటుంబ నియంత్రణనిగురించి చెప్పేవారూ ఆసాధనాల్ని యిచ్చేవారు పల్లెలకివచ్చి వెళుతూవుండాలి.

అన్నిటికన్నా ముఖ్యమైంది ఆర్థికస్తోమత. ఎన్నో అత్యవసరమైన ప్రణాలికలు మనకు డబ్బులేక బుట్టదాఖలా అవుతున్నాయి. మామూలుగా పల్లెల్లోవున్న సాధారణ కుటుంబీకులెవరూ, సంతాననిరోధక కేంద్రాలకువెళ్ళి సలహాపొంది ఆపరికరాల్ని కొనుక్కునే స్థితిలోలేరు. ఇటువంటప్పుడు "డయాఫ్రెమ్, జెల్లీల" వంటి ఖరీదైనపరికరాల్ని కనుక్కో

గలిగే దెవరీ దేశంలో !, అందుచేత ప్రభుత్వమే, రెడ్ క్రాస్ సంస్థవంటి సంస్థలద్వారాగానీ, ప్రభుత్వ మాతాశిశు సంరక్షణాలయాలద్వారా గాని యీపరికరాల్ని తల్లుల కందజేయడానికి పూనుకోవాలి. దేశం మొత్తంమీద యీపరికరాల్ని గాని పంచిపెడితే మిగిలిన ఆరోగ్య, వైద్యసహాయ ప్రణాలి కలకు వలసినంత డబ్బులేక అవి కుంటుపడి తీరతాయి.

మనస్త్రీలకి కొంచెంకూడా చదువురాకపోవడంకూడా ఈ పథకానికి అడ్డుతగిలేవొక సమస్యేను ! అచ్చుకాగితాలద్వారా కుటుంబనియంత్రణను మన దేశంలో వ్యాప్తిచేయడానికి వీలులేదు. ప్రపంచ దేశాల్లోని నిరక్షరాస్యులందరివలెనే మనస్త్రీలకూ శరీరశాస్త్రాన్ని గురించి బొత్తిగా తెలియదు. కళాశాలల్లోనూ, పాఠశాలల్లోను చదువుకున్న కన్యలకు శరీరశాస్త్రం నేర్పడం యెంతఅవసరమో, అలాగే గ్రామీణస్త్రీలకూ యీశాస్త్రం నేర్పడం అంత అవసరం. శుచీ, శుభ్రతా, దీనివిషయమైన చక్కని పరిజ్ఞానం, సరియైనఅనుసరణ విధానంవుంటే తప్ప సంతాననిరోధంవల్ల మేలుకన్నా కీడేహెచ్చుగా కలిగే పరిస్థితులున్నాయి. మన దేశంలో నివసించేవిధానంలో వుండే కొన్నిలోపాలువల్లా మన బీదతనంవల్లా కూడా యింకాకొన్ని యిబ్బందులు కలుగుతున్నాయి. ముఖ్యంగా శుభ్రం లోపంగావుంది. అలాగే సరియైన స్నానాలగదులు వుండవు, పైగా వంటరిగా వుండడానికి గదులుండవు. గదులున్నా దీపాలుండవు. వీటికన్నిటికీతోడూ నీళ్ళకుకూడా పైవులు మొదలైనవి వుండవు. మనదేశపరిస్థితుల్ని బాగా తరిచిచూచినవాళ్ళకు తప్ప యీచిక్కులు అర్థంగావు. మనచిక్కులునూట యెలా

వున్న ప్రభుత్వం, దానితోపాటు సాంఘిక సేవా సంస్థలూ యీవిధానాన్ని అమలుజరపడానికి తగిన ప్రోత్సాహం సావకాశం ఈయాలి.

## సంతాన నిరోధంవల్ల భారతదేశానికి కలిగే లాభాలు

భారత దేశ ఆరోగ్య, ఆర్థిక, సాంఘిక, ప్రణాళికల్లో సంతాన నిరోధాని కెటువంటి స్థానంవుందని ప్రశ్న? భారత దేశంలో సంతాననిరోధాన్ని ముఖ్యంగా అవలంబింపజేయాలని కోరడానికికారణం దేశంలోని మరణసంఖ్య తగ్గించడానికంటే పైకి హాస్యాస్పదంగా కనబడినా జనాభాసంఖ్యని తగ్గించడానికనే సమాధానంకన్నా ముందుచెప్పిన సమాధానమే సత్యమైనదీ సరియైనదీను. మన దేశంలో జననసంఖ్యనుమించి మరణసంఖ్య వుండడంవల్ల జీవనప్రమాణం చాలా తగ్గిపోతూవుంది. సంతాననిరోధంవల్లా, కుటుంబనియంత్రణ వల్లా అక్కరలేని సంతానం పుట్టరు పైగా పుట్టేవాళ్ళంతా బలాఢ్యులు పుట్టడంచేత శిశుమరణసంఖ్య చాలావరకూ తగ్గిపోతుంది. మన దేశంలో మరణసంఖ్య పెరిగిపోవడానికి కారణం శిశుమరణసంఖ్య హెచ్చుగా వుండడంవల్లనే యని వేరేచెప్పనక్కరలేదు. బలహీనతలవల్లనే [సాధారణంగా వ్యవధితక్కువలో సంతానం కలగడంచేతనే బలహీనత వస్తుంది] ప్రసూతిమరణాలు కూడా మన దేశంలో హెచ్చుగా వుంటాయి. కుటుంబనియంత్రణవల్ల హెచ్చువ్యవధిలో సంతానం కలగడంచేతకూడా మరణసంఖ్య బాగా తగ్గేఅవకాశాలు వున్నాయి. ఇలా మరణసంఖ్యని అరి

కట్టి జనాభానుకూడా అతిగా పెరిగిపోకుండా వుంచగలిగితే మనసమస్య లెన్నో తీరిపోతాయి.

మనపల్లెలలోని తల్లులు యే యానందానికీ నోచుకోలేదు. దేశంలో యెన్నో ప్రణాళికలూ, పథకాలూ అమలుపరచ బడుతున్నాయి గాని మనస్త్రీల దైనందిన జీవితంలో మాత్రం యేవిధమైన మార్పూ కలగకుండానే రోజులు గడిచిపోతు న్నాయి. స్త్రీలలో నిస్పృహా నిస్సత్తువా పాతుకొనిపోయాయి. తృప్తిగా హాయిగా రోజులు వెళ్ళమార్చుకునేవారి జీవితాల్లో కూడా సమస్యలూ చిక్కులూ యెదురౌతున్నాయి. జవసత్తువ లతో తొణికిసలాడే యౌవనులకుకూడా జీవితావసరాలు లభ్యం కావడంలేదు. వారి మనసుల కానందాన్నీ శరీరాలకు సౌఖ్యాన్నీ ప్రసాదించే మార్గాలేమీలేవు. బీదతనం వొక పక్క ఆదారిద్ర్యాన్ని యింకాపెంచడానికి పుష్కలంగు చేలసంతా నం రెండోపక్కా వుంటున్నారు. ఈవిధమైన కష్టాలతో మన పల్లెస్త్రీల బ్రతుకు, చావు బతుకుల మధ్య వూగిసలాడుతూ చివ రకు అకాల మరణంతో వారి కథ అంతమౌతుంది!

ప్రభుత్వపు లెక్కలవల్ల సంవత్సరానికి రెండులక్షలమంది స్త్రీలు ప్రసూతి సంబంధమైన రోగాలతో చచ్చిపోతున్నారని తేలింది. ప్రసవ మరణాలసంఖ్యే అధికంగా ఉందనుకుంటే అంత కన్నా అధికంగా శిశుమరణాల సంఖ్య వుంది. పుట్టుకలోనే వెయ్యికీ వందమంది శిశువులు చనిపోతున్నారు. అలాగే వెయ్యికీ నూటయాభై మంది పిల్లలు సంవత్సరం గడవకముందే కళ్ళు మూస్తున్నారు. మానవాభ్యుదయాని కీవిధమైన నష్టం

యెంతకష్టమైనదో మాటల్లో చెప్పలేము. ఎంతో మానవ శక్తి యీమరణాలవల్ల నాశనమైపోతుంది. ఎంతమంది తల్లిలేని బిడ్డలుగా, భార్యలేని భర్తలుగా బిడ్డలులేని తల్లులుగా బాధ పడుతున్నారో! "చాలామంది చచ్చిపోతున్నారు కాబట్టి హెచ్చుమంది పుడుతున్నారు. ఎక్కువమంది పుడుతున్నారు కాబట్టి చాలమంది చచ్చిపోక తప్పు" దనే యీ విషమ సమస్యకు అంతం చూడవల్సిన అవసరం యెంతైనా వుంది.

ఇంత చిన్న వయసులోనే పోయేపిల్లలూ అకాలంలోపోయే తల్లులవల్ల దేశానికి తీరని సాంఘిక ఆర్థిక నష్టమే గాకుండా మానవ కల్యాణదృష్టిలో చూచినా యింతమంది హాయిగా ఆనందంగా బతక వల్సినవారు అకాలంగా చనిపోవడం హీన ధర్మం కాదని గుర్తించాలి. పసిపిల్లల సమాధులను చూచి (Euripides) యూరిపిడెస్ అన్నమాటలు గుర్తుకువచ్చి బాధగావుంటుంది. "పుట్టకుండా వుండడం వుత్తమం. పుట్టినా త్వరగా పోవడం మధ్యమం" అని వారు అన్నారు.

ఈదుఃఖకరమైన పరిస్థితులు మన దేశంలో లేకుండాయేమీ చేయలేమా! దీనికి యెన్నో మార్గాలున్నవికదా! వానిలో వొక మార్గమైన సంతాననిరోధం మనకేవిధంగానూ సాయ పడదా?" సంతాన నిరోధంవల్ల యితర దేశాల్లో యేమిలాభం కలిగిందనే ప్రశ్న రావచ్చు! కన్నపిల్లల్ని అందర్నీ జాగ్ర త్తగా పెంచడానికీ, ఆర్థికస్తోమతనిబట్టి కుటుంబాన్ని నియ త్రించుకోడానికీ, పిల్లలు విద్యాబుద్ధులు చెప్పడానికీ తల్లులు కూడా ఆరోగ్యంగానూ ఆనందంగానూ వుండడానికీ, జీవి తాన్ని హాయిగా గడపడానికీ, అవసరంలేని పిల్లలతో సతమత

పువకుండా వుండడానికీ సంతాన నిరోధం ఇంగ్లాండు అమెరికా దేశాల్లో చక్కగా పనికివచ్చింది.[58]

పాశ్చాత్య దేశాల్లో సంతాననిరోధంవల్ల స్త్రీలుయెక్కువ, ఆరోగ్యవంతులుగా వుండడానికీ, పిల్లలుకూడా ఆరోగ్యవంతులై పుట్టడానికీ వ్యభిచారిత్వమూ తగ్గడానికీ వీలౌతుంది. అంతే గాక భార్యలుపోవడం కూడా చాలా తగ్గిపోతూవుంది. మంచి శిశువులే పుట్టడంవల్ల జనాభా తగ్గిపోవడం, దీనిమూలంగా చాలావరకూ జనం వొత్తిడిలేక యుద్ధభీతి తగ్గిపోవడం, వీటి అన్నిటికన్నా ముఖ్యంగా స్త్రీ స్వేచ్ఛగా తనకు కావలసినంత మంది పిల్లలనే కనగల్గడం సంభవిస్తున్నాయి. అవసరం వున్నప్పుడే బిడ్డల్ని కనడానికీ అవసరం లేనప్పుడు మానివేయడానికీ వీలుగా వుంది. సంతాన నిరోధంవల్ల ఇది పాశ్చాత్యుల పాలిటి భాగ్య దేవతగా పరిణమించింది. భారత దేశంలోకూడా సంతాననిరోధం యిటువంటి మేలే చేయగలదు.

## ప్రభుత్వం — సంతాననిరోధం

అదృష్టవశాత్తు గతంలో బ్రిటిషుప్రభుత్వంగాని నేటి మన ప్రభుత్వంగాని యెన్నడూ సంతాన నిరోధంపైన ఆంక్షపెట్ట

58. డా "కారెల్ మెనింజరు" క్రొంపదు స్త్రీలు సంభోగానికీ సంసారానికీ పనికివస్తారు కానివారు సంతానం కనడానికి పనికిరారు. తల్లులు కావలసినవారిఆరోగ్యం కాపాడవలసిన అగత్యం యెంతైనావుంది. లేకపోతే ఆ స్త్రీలు కోర్కెలు లేనివారై పోవడం చేత వారుసంసారానికి పనికిరాక పోవడంచేత, వారిభర్తలు తప్పుదారులు పట్టడం జరుగుతూ వుంటుంది. "ప్రేమావ్యభిచారం" అనే వారిపుస్తకంలోని (న్యూయార్కు హార్ కోర్టు(బేస్) పే 86. 1942 సం॥

లేదు. అంతమాత్రంచేత ప్రభుత్వంగాని ప్రజలుగాని దీన్ని ప్రోత్సహిస్తున్నారనడానికి వీల్లేదు.[59] మేధావులైన స్త్రీ పురుషులు ఆనాడూ యీనాడూ కూడా సంతాన నిరోధాన్ని ఆమోదించినా, ఈనాడు యింకా కొందరు స్త్రీపురుషులు దీన్ని నిషేధించాలని కోరేవారు లేకపోలేదు. బ్రిటిషుప్రభుత్వం 20 వ శతాబ్దం వరకూ తనసామంత రాజ్యమైన భారత దేశంయొక్క సౌభాగ్యాన్ని అభివృద్ధిని పెరుగుతూన్న జనాభానిబట్టే లెక్కచూచుకొనేది. ప్రతీదశాబ్దంలోనూ తీసుకుంటున్న జనాభా లెక్కలనుబట్టి జనాభా పెరుగుతూన్నట్టు ఋజువౌతుంది. అందుచేత మాపాలనవల్ల భారత దేశం అభివృద్ధి చెందుతుందని అనడానికి సందేహంలేదనీ కాబట్టి దాన్ని పాలించే హక్కు మాకేవుందని బ్రిటిషు వారు మొన్నటి వరకూ వాదిస్తూ వుండేవారు.

షుమారు 70 ఏళ్ళక్రిందట బ్రిటిషుప్రభుత్వాధికార్లు యెటువంటి అభిప్రాయంలో వుండేవారో తెలుసుకోవాలంటే క్రింద నున్న వుదాహరణ చదివితే తెల్లమౌతుంది. సర్ రిచర్డ్ టెంపుల్ 1877–79 వరకూ బొంబాయి గవర్నరు చేశారు. ఆకాలంలో వొకసారి ఆయన మరాత్వాడా వెళ్ళగా అక్కడ

59. "జనాభా లెక్కలు తీయడానికిగల యిబ్బందులన్నింటికి మన ప్రజలే కారణం. మనజీవితాల్ని చక్కగా ప్రణాళి కారూపంలో విభజించుకున్నాం. కాని భారతదేశంలో ప్రజలకుకూడా యిటువంటి నిబంధనలే కావాల్సివుంటాయి. వారూ మనలానే సుఖాన్ని ఆపేక్షిస్తున్నారనేమాట మాత్రం మనం మరిచిపోగూడదని జాన్ మీగాగారు భారతజనాభా యొక్క ఆరోగ్యం "రివ్యూ ఆఫ్ఇండియా" అనేపుస్తకం 1932 పే. 21 లో వ్రాశారు.

వున్న జమీందారుగారు తన కార్యారీద్వారా వొక వినతి పత్రం యిచ్చాడు. అందులో ఇలా వినతిచేశాడు. "మహాను భావులైన ప్రభువులు మీరు! ప్రజల్లో అనుదినం పెరుగు తూన్న యీసంతానం యేవిధానైనా పెరగకుండా రక్షిం చండి." దీనితో ప్రభువువారు ఆగ్రహపరవశులై సంతాన నిరోధాన్ని జరిపించమని ఆజ్ఞాపించకపోగా పైగా "నాశక్తి వంచనలేకుండా సంతానాభివృద్ధి యత్నాలు చేస్తాను. మా మహారాణివారు ప్రజలకు నేచేయగలిగిన సేవ యిదే అని అనతిచ్చారు.[60] పాపం 'కార్యారీకీ' అతని స్నేహితునికీ దొర గారి కింతే అల్పవిషయానికింత ఆగ్రహం యెందుకువచ్చిందో అర్థం కాలేదు.

ఇదే రకంగా బానిసలగావున్న భారతీయుల్లోనూ సంతాన నిరోధాన్ని ద్వేషించే వారెందరో వుండేవారు. జాతీయ వికాసాన్ని పెంపొందించే భావాలు వర్ధిల్లడానికి వీలులేకుండా పరాయిప్రభుత్వం అడ్డుగావుంది. ప్రతీకష్టనిష్టూరాలూ పరాయి పాలనవల్లే వచ్చాయని అనడం అలవాటయి పోయింది.

---

60. బొంబాయి గవర్నరుగారికి కష్టసుఖాలు తెలియకపోయినా, అతనిమహారాణియైన విక్టోరియామహారాణికి మాత్రం దీనిలోని సాధకబా ధకాలు బాగా తెలియుటచేత ఆమె 1841లో బెల్జియం రాజు కుత్తరంరాస్తూ "ప్రియమైనమామా! స్త్రీలకు యెక్కువమంది సంతానముండడం చాలా బాధ. అందులో నాబోటి స్త్రీలకు మరీను. నాబాధనీవు అర్థం చేసుకుంటా వనుకుంటాను. సాధారణంగా పురుషులకు స్త్రీలబాధ లర్థంకావు. అందు లోనూ తరుచూ వచ్చేపురుళ్లువల్ల కలిగేబాధ లసలేఅర్థంకావు." అంది. మహారాణికి ఆర్థికంగా యిబ్బందులు లేకపోయినా యిలావ్రాశారు. "A. C. బెన్‌సన్, విస్‌కౌంటుఎషర్" వ్రాసిన విక్టోరియామహారాణీ వుత్తరాలు. 1837–1861 మధ్యవి. సంపుటి 1. పుట 318 (లండన్ 1907)

దేశాన్ని పరాయి ప్రభుత్వం కొల్లగొట్టుకు పోవడం వల్లనే యింత నిరుపేదదై పోయిందన్నారు. పెరుగుతూన్న జనాభాతోపాటు వుత్పత్తి కూడా పెరగడం లేదని యెవరూ గుర్తించడంలేదు.

అశాస్త్రీయమూ, అజ్ఞానపూరితమైన మత అభిప్రాయాల వల్ల కుటుంబ నియంత్రణ జనాభా సమస్యలకు సరైన పరిష్కారమని యెవరూ అనుకోవడంలేదు. ఇటు ప్రభుత్వం అటు ప్రజాకూడా దీన్నిగురించి సవ్యంగా ఆలోచించడానికి పూనుకోలేదు.[61]

ఏది యెలావున్నా యెక్కువకాలం యీ సమస్యని పరిష్కరించకుండా వదిలివేయడానికి వీల్లేదు. రెండవ ప్రపంచయుద్ధానికి ముందు భారత జాతీయకాంగ్రెస్ (1935) పండిట్ జవహర్‌లాల్ నెహ్రూగారి ఆధ్వర్యమున వొక జాతీయ ప్రణాళికా సంఘాన్ని నియమించింది. ఆసంఘంవారు చేసిన తీర్మానాల్లో, "సాంఘిక

---

61. "భారతదేశం నేడు యింత దీనగావుండడానికి కారకులు, ప్రభుత్వం, షావుకార్లూ, అశేష భారతజనాభా. కరువు కాటకాలు వచ్చి చాలా మంది జనం చనిపోతున్నారు. అయినా, మనజనాభా పెరుగుతూనే వున్నారు. దీనికి పరిష్కారమార్గ మేమిటో నేను చెప్పలేను. దీనికి సంతాననిరోధమే వొక మార్గమైతే దాన్ని ఆమోదించేవాళ్ళలో నేను మొదటివాణ్ణి. కాని దీన్ని అవలంబించడానికి దేశం నాల్గుమూలలా సంతాన నిరోధ కేంద్రాలు వుండాలి. విద్య వ్యాపించాలి. జీవనప్రమాణం పెరగాలి. ప్రస్తుతపరిస్థితులలో సామాన్యులకు సంతాన నిరోధం అందుబాటులో లేకుండా వుంది. మధ్యతరగతి కుటుంబాల కిది వరప్రసాదం కాగలదని" 20 సంవత్సరాల క్రిందట పండిట్ జవహర్‌లాల్ నెహ్రూగారు వ్రాశారు "స్వీయచరిత్ర" [లండన్. బోడ్లే హెడ్ 1936) పే. 444.

ఆర్థిక సాంసారిక సుఖాలకు సంతానాన్ని నిరోధించి కుటుంబ నియంత్రణను దేశీయంగానూ, రాష్ట్రీయంగానూ అమలుపరచ వలసిన అవసరం యెంతైనా వుందని" ని వాకతీర్మానాన్ని ప్రతి పాదించారు. అంతేగాకుండా "ఈవిధానాన్ని ప్రోత్సహిస్తూ సుఖంగాను, సులభంగానూ, అర్థమయ్యేటట్లు దీన్ని ప్రజలకు బోధపరచి చెప్పాలి. సంతాన నిరోధక కేంద్రాల్ని దేశ మంతటా నెలకొల్పి, అశాస్త్రీయమైన సంతాన నిరోధక మార్గాల్ని వ్యాప్తిగాకుండా అరికట్టాలని" కూడా తీర్మా నించారు.[62] "శరీర శాస్త్రరీత్యా అంటువ్యాధులూ తదితర ఆపత్కరమైన వ్యాధులూవున్న వారికి పూర్తిగా యెన్నడూ సంతానం కలగకుండా ఆపరేషను చేయాలని కూడా" నొక్కి చెప్పారు. ఈనిర్ణయాన్ని భారతదేశం స్వరాజ్యం సంపా దించక పూర్వమే జాతీయ కాంగ్రెసు వాదులుగా వున్న ప్పుడే భారత ప్రజలే చేశారు.

ఇటీవల భారతప్రభుత్వం "ఆరోగ్యాభివృద్ధి పరిణామం (Health survey of Development Committee) సర్వేల్కై యొక కమిటీని వేసింది. ఏదు 1946 నివేదికలో "ప్రసవంవల్ల స్త్రీకి ప్రాణానికి మోసం వచ్చేట్లయితే, లేదా పుట్టబోయే శిశువుకీ ప్రాణహానైతే సంతాన నిరోధం అమలు పరచడం వుత్తమం. ఇటువంటి పరిస్థితుల్లో ప్రభుత్వమే మాతా శిశు సంరక్షణాలయాల్లోనూ, శిసుకేంద్రాల్లోనూ, వైద్యశాల ల్లోనూ సంతాన నిరోధాన్ని ప్రచారం చేయడానికి సౌక ర్యాలు కల్పించాలి. ఆరోగ్యంకోసమై సంతాన నిరోధం తప్పని

62. జనాభా ( బొంబాయి నేషనల్ ప్లానింగు కమిటీ 1937 ) పే. 6.

సరిగా అవలంబించవలసివచ్చినప్పుడు స్త్రీలకు దీనికి సంబం ధించిన పరికరాలు వుచితంగా ప్రభుత్వమే ఈయాలి. చట్టరీత్యా కొన్ని వస్తువుల అమ్మకాన్ని ప్రభుత్వం యేవిధంగా నిషేధిస్తుందో అదేవిధంగా సంతాన నిరోధసాధకాలు కూడా స్వేచ్ఛగా అమ్మడాన్ని నిషేధించాలి. ఇక రెండవ విషయమేమంటే, సులభంగా, సుఖంగా సంతాన నిరోధాన్ని యెలా అవలంబించాలో కూడా ప్రజలకు తెలపడానికి శాస్త్రీయమైన పరిశోధనలు జరపడానికి ప్రభుత్వానికి ధనవంతులైన ప్రజలు ఆర్థికంగా తోడ్పడాలని సభ్యులందరి దృఢవిశ్వాసమని" చెప్పారు.[63]

ప్రభుత్వాధికారులిచ్చిన యీసలహాలు చాలా అమూల్యమైనవే గావచ్చు కాని మన ఆర్థిక పరిస్థితులనుబట్టి సంతాన నిరోధాన్ని అవలంబింప జేయాల్సివుంటుందనే సంగతికూడా మనం మరిచిపోకూడదు. అధమస్థితిలోవున్న జీవిత ప్రమాణ దృష్ట్యాకూడా సంతాన నిరోధాన్ని ప్రోత్సహించాల్సిన అవసరం యెంతైనావుందని ప్రభుత్వాధికారులు కూడా గుర్తించేవున్నారు. కాని స్వాతంత్ర్యసముపార్జన హడావిడిలో యీసంఘం వారినివేదిక మాత్రం బుట్టదాకలా అయింది.

1947 లో స్వాతంత్ర్యం వచ్చింది, కాని అదృష్టవశాత్తు మన ప్రభుత్వం దీన్ని జ్ఞాపకం వుంచుకుంది. 1950 లో నెహ్రూగారి ఆధ్వర్యంలో ప్రథమ పంచవర్ష ప్రణాళిక యేర్పాటైంది. 1951 సంవత్సరంలో ప్లానింగు కమీషను ప్రథమ పంచవర్ష

63. ఆరోగ్యాభివృద్ధి, పరిశీలనా మూలక సమితి నివేదిక (కొత్తఢిల్లీ 1946) 2 వా. పే 487.

ప్రణాలికకు పునాదివేసింది. 1952 నాటికి వారి సమగ్రనివేదిక ప్రకటింపబడింది. భారత దేశానికి సంతాననిరోధం అత్యంతా వశ్యకమైనదని వారు ధైర్యంగా వెల్లడించారు.

ప్రధమ పంచవర్ష ప్రణాలిక

భారతజనాభా అధికంగా వుందాలేదా — దీనిదృష్ట్యా సంతాననిరోధావశ్యకత వుందాలేదా—అనే అనవసరమైన వాద వివాదాలలోనికి ప్రధమ పంచవర్ష ప్రణాలికా సంఘం పోలేదు. "భారత దేశాభివృద్ధీ, జాతీయాభివృద్ధీ దృష్ట్యా, దేశంయొక్క విస్తీర్ణతనుబట్టి యింత జనాభా వుండాలని నిర్ణయించ లేకపోయినా, ప్రస్తుత ఆర్థిక దుస్థితినిబట్టి యింకా గాని జనాభా పెరిగితే లాభానికి బదులు అపారనష్టం మాత్రం కలుగుతుంది. పై పరిస్థితులను దృష్టిలోవుంచుకుని మన జనాభాని గాని అరికట్టకపోతే మన సాంఘిక ఆర్థికస్థితి యింకా చెడిపోవడమే గాకుండా యెంతో సృజనాత్మక శక్తి కేవలం యీజనాభాకు తిండిపెట్టడానికే వుపయోగపడి వూరుకోవల్సి వుంటుంది. దేశంలో అధిక జనాభావల్ల సహజసంపదలు తరిగిపోతాయి; పైగా అత్యవసరమైన జాతీయ, సాంఘికాభివృద్ధి పథకాలు అమలు జరపడానికి వీలుండదు" అని వారి నివేదికలో వ్రాశారు. 64

పెరుగుతూన్న జనాభావల్ల కొత్త సమస్యలూ చిక్కులూ పుడుతూవుంటే జీవన ప్రమాణాన్ని అధికం చేయాలనే

64. ప్రథమ పంచవర్ష ప్రణాలిక (– డ్రాఫ్టు –) (కొత్తఢిల్లీ–ప్లానింగు కమీషను 1951) పే. 16.

ఆలోచనే వృథా అవుతుంది. జనాభాతోపాటుగా సగటు ఆదాయం కూడా పెరిగితేగాని జీవన ప్రమాణాలు పెంచ్చను.[65]

గత 10 సంవత్సరాల లెక్కలుచూస్తే నూటికి 1¼ మంది జనం పెరుగుతున్నట్లు కనబడుతోంది. అని 1951 నాటికి అంటే ప్రథమ పంచవర్ష ప్రణాళిక ప్రకారం 378 మిలియన్ల జనం పెరిగి వచ్చునని ప్లానింగు కమీషనువారు అంచనావేశారు.

ఈ అంచనాయే నిజమైనా; ఇదే ప్రకారంగా జనం పెరిగితే 1971 నాటికి 450 మిలియన్ల జనం అవుతారు. ఇదేవిధంగా పెరిగితే 25 సంవత్సరాల్లో 500 మిలియన్లమంది జనం పెరగడం తప్పదు. ఈవిధంగా జనాభా హెచ్చుమీరి పెరగడం దేశానికి పెద్ద ప్రమాదకారకమైనా [illegible] కాదని ప్లానింగు కమీషనువారు అభిప్రాయ పడుతున్నారు.[66] ప్రథమ పంచవర్ష ప్రణాళికలో, జనాభా నిరోధనానికి కుటుంబనియంత్రణావశ్యకతనూ, అవలంబించే మార్గాల్ని గురించిన కృషి జరిగింది. కుటుంబ నియంత్రణయొక్క ప్రాముఖ్యతను దాని వల్ల కలిగేలాభాలను ముందుగా ప్రజల్లో ప్రబోధించిన తర్వాతనే కుటుంబనియంత్రణా సాధనాలను చౌకగా, సులభంగా, వీలుగా అందరికీ అందుబాటులోవుండేలా చేయాలని ప్లానింగు కమీషనువారి అభిప్రాయము. ఇంతేగాక కుటుంబనియంత్రణావశ్యకతతోపాటు, దీనిపైన పరిశోధన జరగాలనీ వైద్య విధానాల్లోనూ, సాంకేతికంగానూ దీన్ని గూర్చి ప్రజలకు తెలియజెప్పాలనికూడా అన్నారు (క) అంతులేకుండా పెరుగు

---

65. ప్రథమపంచవర్ష ప్రణాళిక (కొత్తఢిల్లీ, ప్లానింగుకమీషను 1953) పే. 18.

66. ఇబిడ్. పే. 23.

తున్న జనాభాకు కారణమేమిటో సవిస్తరంగా కృషిచేసి తెలుసుకోవాలి. (గ) సులభంగా, సుఖంగావుండే సంతాన నిరోధపరికరాల్ని కనిపెట్టి వీటిని ప్రజల్లో ప్రచారం చెయ్యాలి. (చ) ప్రభుత్వవైద్యాలయాల్లోనూ, యితర మాతాశిశు ఆరోగ్యకేంద్రాల్లోనూ, సంతాననిరోధం అవలంబించేట్లు చూడాలని ప్లానింగుకమీషనువారు చెప్పారు.

జనాభానెలా అరికట్టాలో మరికొంత విశదంగా క్రింద చెప్పారు.

1. పెళ్లిఅయినవారు కుటుంబనియంత్రణను అవలంబించాలని తలిస్తే వారికి ప్రభుత్వ వైద్యాలయాల్లో సహాయం లభించాలి.

2. ప్రభుత్వ వైద్యాలయాల్లోనూ, ఆరోగ్యకేంద్రాల్లోనూ స్త్రీ డాక్టర్లు వైద్యులూ యేస్త్రీయైనా తన ఆరోగ్య రక్షణ కొఱకు సంతాన నిరోధాన్నిగురించి నేర్చుకోవాలి, కోరితే వారికీవిషయం బోధించడానికి సిద్ధంగావుండాలి.

3. వైద్యానికి వచ్చినస్త్రీలు స్వయంగా అడగకపోయినా, ఆమె ఆరోగ్యరక్షణకై, యికముందు సంతానం కలగకుండా వుండడం మంచిదైతే వారికితిరిగి గర్భధారణ జరగకుండా ముందేవైద్యులు వారికితగిన సలహాలనిచ్చి సంతాననిరోధాన్ని నేర్పించాలి.

4. వచ్చినస్త్రీలలో కొందరికి సంతానంకలుగకుండా శస్త్రచికిత్స చేయవల్సివుంటుంది. మఱికొందరికి శారీరకశాస్త్రరీత్యా సంతాననిరోధక చర్యల్నిగురించి చెప్పవల్సివుంటుంది. ఇక

కొందరికి రసాయనిక, కృత్రిమ సాధనలవల్ల కుటుంబనియంత్రణ నేర్పవల్సివుంటుంది.

బ్రిటనువంటి దేశాల్లో ప్రభుత్వ ఆరోగ్యశాఖవారు దేశం లోని వైద్యకేంద్రాలోవున్న వైద్యులద్వారానే సంతా నోత్పత్తినిగురించిన శిక్షణయిస్తారు.

II జనంయొక్క అలవాట్లనూ, అవసరాల్నీ, వారిశారీరిక బేధాల్నిబట్టి వేర్వేరువిధమైన సంతాననిరోధాన్ని అవ లంబించేట్లు చేయవల్సివుంటుంది. గ్రామవాసులకు సహజకాల సంయమన విధానంలేదా "రిథమ్" మార్గం అంగీకారమైనదిగా వుంటే ప్రభుత్వము ఆమార్గాన్నే అనుసరించాలి. ఈ "సహజ కాల సంయమనం" వల్లఆర్థికంగాకూడా వొత్తిడివుండదు గనక యీపద్ధతినే ప్రజల్లో ప్రచారంచేయడం మంచిది. విరి విగా యీవిధానం ప్రయోగించబడితేగాని దీనివల్ల యెటు వంటిసత్ఫలితాలుంటాయో అంచనావేసి చెప్పడానికి వీల్లేదు. పరిశోధనా కేంద్రాల్లోకూడా వొకేవిధమైన ప్రయోగంపైన పరీక్షలు జరపవలసిన అవసరంలేదు. కృత్రిమ సాధనాలవల్లా, రసాయినిక ద్రవ్యాలవల్లాకూడా సంతాననిరోధం చేయడానికై కొన్ని సంస్థల్లో పరిశోధనలు జరుగుతూవున్నాయి. అటువంటి సంస్థలకు ప్రభుత్వం ఆర్థికంగాకూడా సహాయంచేయడం అవసరం.

III ప్రజల్లో ఈవిషయమైన విజ్ఞానాన్ని వెదజల్లాలి. శాస్త్రీయమైన పద్ధతుల్నీ సాంకేతికవిజ్ఞానాన్నీకూడా ప్రజలకు అందుబాటు చేయాలి.

IV సంతాననిరోధం మీాద ప్రజలకున్న అభిప్రాయాల్నీ,

అసంతృప్తినీ గురించిన వివరాలు విరివిగా స్వీకరించాలి. సాంఘిక, సాంస్కృతిక మతాచారాల్ని బట్టీ, ఆర్థికస్థితినిబట్టీ కుటుంబ పరిమితి మారుతూవుంటుంది. ప్రాంతీయ భేదాలకూ, సంతానేచ్ఛకూవున్న సంబంధాన్ని గూర్చి పరిశోధనలు జరగాలి. ప్రజలు యేరకమైన సంతాన నిరోధమార్గాన్ని యిచ్ఛగిస్తున్నారో, దానికి కారణ మేమిటోకూడా తెలుసుకుంటే గాని ప్రజలకు కావలసిన సదుపాయాలు కలుగజేయడానికి వీలుండదు.

V సాంఘిక ఆర్థిక స్థితిగతుల్ని బట్టీ జనాభా పెరగడం గాని, తగ్గిపోవడంగాని జరుగుతుందనే విషయాన్ని మనం విస్మరించగూడదు. దీనిపైన ఆధారపడే జాతీయ అభివృద్ధి ప్రణాలికలూ, కుటుంబనియంత్రణా పథకాలూ వేయడం సంభవిస్తుంది.

VI భారతదేశంలోనేగాక యితర దేశాల్లోకూడా జరుగుతున్న పరిశోధనా ఫలితాల్ని మనపరిశోధనా కేంద్రాల్లో వున్న విద్యార్థులకూ, మిగిలిన వైద్యులకూ తరుచూ అందజేస్తూవుండాలి.

VII శరీరశాస్త్రరీత్యా, వైద్యశాస్త్రరీత్యా మానవ సంతానోత్పత్తిని గురించీ, కుటుంబనియంత్రణను గురించీ పరిశోధనలు జరగాలి.[67]

---

67 ప్రథమ పంచవర్ష ప్రణాలిక, పే. 522–24.

68. ప్లానింగుకమిషను రెండుకమిటీలను నియమించింది.

(1) సంతాననిరోధాన్ని ప్రచారంచేసేది.

(2). పరిశోధనా కార్యక్రమాల కొఱకకమిటీ.

భారత ప్రభుత్వం ఆరోగ్యశాఖకు ప్రథమ పంచవర్ష ప్రణాళికలలో కుటుంబనియంత్రణకై 65 లక్షల రూపాయలు కేటాయించింది.

ప్లానింగు కమీషను వారెట్టి సంకుచితత్వం, లేకుండా అభ్యుదయకరంగా శాస్త్రీయంగాను తమనివేదికను సమర్పించారని దాన్ని చదివిన ప్రతీవారికీ అర్థమౌతుంది. భారత దేశ చరిత్రలో మొట్టమొదటసారిగా కుటుంబనియంత్రణా విధానాన్ని అమలు జరపాలని నిశ్చయించడంవల్ల యీప్రణాళికలను తయారుచేయడం చాలా కష్టసాధ్యమైనపని అయింది.



జనాభాసమస్యల పరిష్కరించి, ఈపరిష్కార మార్గాల్లో వున్న విభేధాల్నీ, పరిశోధనలక్రమాన్నీ. వీటివల్ల కలిగేలాభాల్నీ ప్రభుత్వం గ్రహించి మంచివాటిని కుటుంబ నియంత్రణ కేంద్రాల్లో అమలుజరపడానికై కొద్దికాలం క్రిందట జనాభాకమీషను ఏర్పాటుచేయబడింది. ప్రథమపంచవర్ష ప్రణాళిక. పే. 524.

# ఏడవ అధ్యాయం

## నేటి నవభారతంలో కుటుంబ నియంత్రణ

ఇరవై అయిదు సంవత్సరాల క్రిందట భారతదేశంలో జనాభా అధికంగా వుందాలేదా అనే ప్రశ్నమీదే చాలా చర్చలూ, విమర్శలూ చెలరేగాయి. తరువాత సంతాన నిరోధావశ్యకత మీద యుద్ధాలు రేగాయి. నేటి నవభార తంలో సంతాననిరోధం అవలంబించాలా లేదా అన్నదిగాదు సమస్య. సామాన్య పల్లెప్రజల్లో సంతాననిరోధాన్ని యే విధంగా అవలంబింపజేయాలి, వారికేవిధమైన మార్గం అను వుగా వుంటుందీ అన్నదే గడ్డుసమస్య అయింది. ప్రజా నాయకులూ, ప్రజలూకూడా యేక కంఠంతో సంతాన నిరోధాన్ని అంగీకరించడం మంచిసుగుణం.

ఆదిలో ఆరోగ్యశాఖా మంత్రిత్వశాఖకు కొన్ని సందే హాలున్నా, ప్రజల్లో ముఖ్యంగా తల్లులయందు కలిగినమార్పు సంతాననిరోధం పట్ల చూపుతున్న వుత్సాహంచూచి వారూ వుత్సాహంగానే వున్నారు. ప్రపంచ ఆరోగ్యసమితిని 1951 సం॥ లో భారత ప్రభుత్వం కుటుంబ నియంత్రణ నిపు ణున్ని పంపమనీ, "ఆటూహోటూ" లేక "కాలసంయమన" పద్ధతులు మాదేశంలో విజయవంతమగునో కాదో పరీక్షి స్తామనీ" కోరారు. భారతప్రభుత్వ ఆరోగ్యశాఖామంత్రిణి

రాజకుమారీ అమృతకౌర్ గారు 69 ప్రస్తుత భారత దేశ ఆర్థిక, సాంఘిక, వైజ్ఞానిక, సాంస్కృతిక, మతవిషయిక, నైతిక సాంప్రదాయాల ననుసరించి ఆమె యీ విధంగా అభిప్రాయ పడివుండవచ్చును. ప్రజలకు వొత్తిడికలిగించకుండా, వారిలో వ్యతిరేకత ప్రబలకుండానే ప్రభుత్వ మీపథకాన్ని అమలు పరచాలి. బీదవై సమన గ్రామాల్లో మరేవిధమైన పరికరాలూ కొనుక్కోలేరు కాబట్టి "ఈసహజకాల సంయమనాన్నే" అవలంబించవల్సి వుంటుంది. కాబట్టి యేపని చేసినా, మన అవిద్యా వాతావరణాన్ని, బీదతనాన్ని గుర్తించుకునే కార్యక్రమాన్ని రూపొందించాలి. "సహజకాలసంయమన విధానా న్ననుసరించి గాని మనగ్రామాల్లో కుటుంబ నియంత్రణ అమలుపరిస్తే ప్రభుత్వంకూడాదీనికి సహకారంయిస్తుందని" ప్లానింగు కమీషను వారన్నారు. ఈ "సహజకాల సంయమన" విధానం వల్ల లాభముంటుందా లేదా అన్నవిషయం తేలాలంటే హెచ్చుమందిజనం దీన్ని ముందు అవలంబించిచూడాల్సి వుంటుంది. పరిశోధనలూ ప్రయోగాలూ ఒకేవిధానాన్ని గురించే జరుపనవసరంలేదు.70

పై విషయాల నన్నిటినీ దృష్టిలో పెట్టుకునే భారతప్రభుత్వం ప్రపంచ ఆరోగ్యసమితికి "సహజకాలసంయమనాన్ని"

---

69. శాస్త్రీయ సంతాననిరోధానికి ఆమె వ్యతిరేకురాలవడం చేత భారతదేశంలోనే గాక మిగిలిన పాశ్చాత్య దేశాల్లోకూడా ఆమె రోమను కేథలిక్కని అభిప్రాయపడ్డారు. నిజానికామె ప్రొటస్టాంట్ క్రిస్టియను. ఆమె గాంధీగారి ముఖ్యశిష్యుల్లో వొకరు కాబట్టి వారికీవిధమైన అభిప్రాయం కలిగివుండవచ్చును.

70. ప్రథమ పంచవర్ష ప్రణాళిక (కొత్తఢిల్లీ ప్లానింగు కమీషను) 1952. పే. 523.

తప్ప ప్రస్తుతపరిస్థితుల్లో మరే యితరమార్గాన్నీ అవలంబించ లేమని తెలియజేసింది. అమెరికాలోని కుటుంబనియంత్రణ ఫెడరేషన్ సభ్యుడు డాక్టరు అబ్రహామ్ స్టోన్‌గారు ప్రపంచ ఆరోగ్యసమితి తరపున 1951 సం॥ లో భారత దేశం వచ్చారు. వారు మన దేశమంతా పర్యటించి మైసూరు, ఢిల్లీ, పశ్చిమ బెంగాలురాష్ట్రాల్లో "సహజకాలసంయమన విధానం" పై పరిశోధనలు చేయడానికి పరిశోధనాలయాల్ని స్థాపించమని మన ప్రభుత్వానికి సలహాయిచ్చారు. ఆసలహాప్రకారం స్థాపించబడిన పరిశోధనాలయాలు నేటికీ పనిచేస్తున్నాయి. ఈపరిశోధనాలయాల్లో కొందరు దంపతుల్ని లెక్కగా తీసు కుని వారికి "సహజకాలసంయమనవిధానాన్ని" గురించి నేర్పుతారు. తరువాత వారి భావిమెలావున్నదీ పరిశీలిస్తూ వుంటారు. వారిలో వచ్చేమార్పుల్నిబట్టి, కలిగేఫలితాల్ని బట్టీ, యీసిద్ధాంతం యెంతవరకూ ప్రజల అక్కరతీర్చేదీ నిర్ణయిస్తారు. ప్రపంచ దేశాల్లో యెక్కడా కనీవినీ యెరగని విషయం జపానులో సంభవిస్తున్నదంటే ఆశ్చర్యంగావుంటుంది. జపానుప్రభుత్వం చట్టరీత్యా గర్భస్రావం అక్కడ తప్పుపని కాదు. జనాభావొత్తిడినిబట్టి అక్కడ వారీపనిని తప్పుగా భావించడంలేదు. పల్లెస్త్రీలకు "సహజకాల సంయమనాన్ని" నేర్పడం చాలాకష్టమైనపని. అందుచేతనే "ఈవిధానం విజయవంతం కావాలంటే, బహిష్టుఅయ్యేకాలం, సంతా నోత్పత్తి అయ్యేరోజులు, ఈ ఆపదలేని రోజులూకూడా స్త్రీలు జ్ఞాపకంపెట్టుకోవాలి. భారత దేశంలోవున్న అజ్ఞానపరిస్థితుల్లో స్త్రీలు బహిష్టుఅయేరోజుకూడా సరిగ్గా లెక్కపెట్టుకో లేరన

డం నిర్వివాదాంశం. అందుచేత తేలికగా ఈబహిష్టుకాలాన్ని, సంతానోత్పత్తికాలాన్ని, ఆపదరహితమైనకాలాన్ని పల్లె స్త్రీలు జ్ఞాపకముంచుకోడానికేదైనా వొక సాధనాన్ని కని పెట్టవల్సివుందని” డాక్టరు స్టోనుగారభిప్రాయపడుతూన్నారు.

ఆడవాళ్లు సాధారణంగా గాజుపూసల్ని వాడుతూంటారు కాబట్టి గాజుపూసలతోనే బహిష్టుకాలాన్ని గుర్తించుకొనే విధానం నేర్పడం మంచిదని ఢిల్లీలోవొక వైద్యురాలుఅన్నారు. డాక్టరు చంద్రశేఖరంగారు 28 రంగుపూసల్ని తీసుకుని వొక హారంలా తయారుచేసి బహిష్టుఅయిన తరువాత రోజుకొక పూసను జరుపుతూవుండాలని నిర్ణయించేశారు. కనకాంబరం రంగు బహిష్టుకాలాన్ని తెలిపేదిగానూ, ఆకుపచ్చరంగు అపాయరహితమైన కాలాన్ని తెలిపేదిగానూ, ఎర్రరంగు అపాయకరమైన కాలాన్ని తెలిపేదిగానూ నిర్ణయించబడింది. గ్రామాల్లోవున్న గ్రామసేవికలుగాని డాక్టర్లుగాని వచ్చిన స్త్రీకి బహిష్టుకాలాన్ని మొదలుకుని పూసలేవిధంగా రోజూ ఒకటి చొప్పున జరుపుతూ వుండాలో చెప్పి చూపించాలి. ఆకుపచ్చపూసలు వచ్చిన కాలంలో ఆమె ఆనందాన్ని అనుభ వించవచ్చుననీ, ఎర్రరంగు వచ్చినప్పుడే జాగ్రత్తగా వుండాలనీ చెప్పాలి. ఈపూసల్ని వొక సన్నటి తీగెకుగాని ఇనుప పూసకు గాని యెక్కించి కర్ర చట్రంలో బిగించవచ్చు లేదా వారివారి అభిరుచినిబట్టి యింకేలాయినా పెట్టుకోవచ్చును.[71]

ఈపూసల విధానాన్ని కనిపెట్టినప్పుడు యిదికూడా

---

71 అబ్రహామ్‌స్టోన్ గారి “భారతదేశ సంతానోత్పత్తి సమస్యలు” నానిపరిష్కారం, నిషేధం. మే, జూన్. 1953. న్యూయార్కు.

యెన్నో సమస్యల్ని, చిక్కుల్ని యెదుర్కోవలసి వుంటుందని యెవరూ వూహించనైనా వూహించలేదు. రాత్రిపూట పూసలరంగులు కనబడవని ముందువూహించడానికి వీలులేక పోయింది. అందుకని రంగులను మార్చకపోయినా, పూసల ఆకారాన్ని గుండ్రంగానూ పలకలగానూ మార్చవలసివచ్చింది. ఎరుపురంగుపూసలు గుండ్రంగావుండి ఆపదకాలాన్ని తెలియ జేస్తాయని ఆకుపచ్చపూసలు పలకలగావుండి విరామకాలాన్ని తెలుపుతాయనీ వూహించారు. పూసలు చట్రంలో బిగించ నప్పుడు ఒకవేపునుండి రెండవ వేపుకుమాత్రమే వెళ్ళేలాగా గడియారం కేలా తయారు చేయవల్సివచ్చింది. కొందరుచాద స్తపు స్త్రీలు బహిష్టుకాలంలో యీపూసల్ని ముట్టుకోడాని కంగీకరించలేదు. అందుచేత ఆకాలంలో యీవిశబదులు యింకో రెవరైనా ఆపూసల్ని కదల్చవలిసివచ్చింది.

సాంప్రదాయికమైన యిబ్బందులనూ మానవ సహజమైన మానసిక ఆటంకాలను యేదోవిధంగా దాటినా కొన్ని సహజ మైన దైవిక ఆపదలను గడిచి గట్టెక్కడం కష్టసాధ్యమైంది. కొందరు స్త్రీలు పూసల్ని జరపడమే మరచిపోయారు. ప్రపంచమంతా తాముచేసే పనిని చూసి నవ్వుతారేమోనని కొందరీపూసల్ని ముట్టుకోడానికే వొప్పుకోలేదు. ఈపూసల్లో యేదో మహిమవుంది, యిది యే తాయెత్తులాటిదో నని కొందరు పూసల్ని కేవలం జరపడంవల్లే పిల్లలు కలగరని భ్రమపడ్డారు.

ఇన్ని గందరగోళాలకు తోడు శారీరకశాస్త్ర రీత్యాకూడా కొన్ని యిబ్బందులుకూడా వున్నాయి. ప్రతీస్త్రీ వొకేకాలంలో

గాని, వొకేపరిమితిలోగాని బయటచేరరు. అందరూ 28 రోజులకే బయట చేరరు అలాకాని వాళ్ళు వాళ్ళ కాలాన్ని బట్టి పూసలు చేయించుకోవాల్సి వుంటుంది. మానవులుపెట్టే నియమాలకు ప్రకృతి లొంగనప్పుడు చేయగలిగిందేమీ వుండదు.

ఇవన్నీ యింకా ప్రాథమిక దశలోవున్న పరిశోధనలు. పరిశోధనలింకాచేసి జయప్రదంగా సంతాన నిరోధక సాధనాల్ని అమలుజరపవల్సిన అవసరంవుంది. మొత్తంమీద యీ విధానాల అమలులో హెచ్చు ఫలితాలు కనపడినా, వ్యక్తిగతంగా మాత్రం యివన్నీ నూటికి నూరుపాళ్ళు విజయవంతంగావు. సాంఘికంగా, జాతీయంగా జనాభా సమస్యలకిది పరిష్కార మార్గం కావచ్చుకాని, స్త్రీ పూర్తిగా తనకు పిల్లలక్కరలేదనుకున్నా, ఆమె ఆరోగ్యరక్షణకై కూడా పిల్లలక్కరలేదనుకున్నా యీ మార్గంవల్ల పూర్తి రక్షణలేదు. అధిక జనాభాతో బాధపడుతున్న భారతదేశం కుటుంబ నియంత్రణా పథకంకింద చేస్తున్న పరిశోధనల్లో యిదివొకటి గనక యీ విధానం వల్లగాని సత్ఫలితాలు కలిగితే ప్రపంచ కుటుంబ నియంత్రణా పథకాల్లోనే మార్పుతీసుకువచ్చే అవకాశాలున్నాయి కాబట్టి యీవిధానాన్ని గురించిన పరిశోధనలు ఆపుజేయటం మంచిదికాదు.

కుటుంబనియంత్రణ కీమార్గాల్లో 1952 సం॥లో ప్రభుత్వ ఆధ్వర్యాన నెలకొల్పబడిన కేంద్రాల్లో అనుసరిస్తున్న "సహజ కాలసంయమన" విధానమేగాక, నవీన పాశ్చాత్య పరికరాలతో, రసాయనిక, కృత్రిమ సాధనలతోనూవున్న 70 కేంద్రాలు

భారతదేశంలో అక్కడక్కడా వున్నాయి. "న్యూమాల్తూజి యనులీగు" వారు 1930 నాటికే మదరాసులో సభలూ సమావేశాలూచేసి సంతాననిరోధానికై కొంతకృషిచేశారు. 1930 సం॥లో అభివృద్ధి ప్రణాలికల్ని అమలు జరపడంలో ముందంజవేసే మైసూరు రాష్ట్రం మొట్టమొదటి సంతాన నిరోధక కేంద్రాన్ని బెంగుళూరులో స్థాపించింది. బొంబాయి పూనా బెంగుళూరు అతుగుజాడల్లో నడిచాయి. 1950 నాటికి ప్రభుత్వంవారి ఆధ్వర్యానా ప్రజావరంవల్లా బొంబాయి, లక్నో, నాగపూరు, మైసూరు, హైదరాబాదు, పంజాబ్, అలహాబాదు, బెంగుళూరు, కలకత్తా, పూనా వంటిపట్టణాల్లో చాలా సంతాననిరోధక కేంద్రాలు నెలకొల్పబడ్డాయి. ఇవి పెట్టి చాలాకాలమే అయినా యింకా నవీనపద్ధతుల్ని అవలంబించడంలేదు. ఇవన్నీ చాలావరకూ, జిల్లాబోర్డుల, పురపాలక సంఘాల ఆధ్వర్యంలోవున్న ప్రసూతి కేంద్రాల్లోనూ, వైద్యాలయాల్లోనూ పెట్టబడ్డాయి. రెడ్‌క్రాస్ సంస్థవారు కొన్ని కేంద్రాల్ని స్థాపించినా, యింగ్లాండు, అమెరికాల్లో వలే యిక్కడకూడా కొందరు వైద్యులు వ్యక్తిగతంగాకూడా వీటిని స్థాపించారు. సైనికదళాలకూ విమానదళాలకూ వారివారి ఆసుపత్రులలో కుటుంబనియంత్రణా కేంద్రాల్ని నెలకొల్పుతున్నారు.

పట్టణాల్లోనూ, పల్లెల్లోనూకూడా పెద్దపెద్ద కుటుంబాలుండడంవల్ల ఆర్థికంగానూ, ఆరోగ్యవిషయికంగానూ దెబ్బతింటున్నారనే రెండువిషయాలూ యీఅసమగ్ర పరిశోధనల వల్ల తేలాయి. ఇందుచేత సాంఘికంగానూ, వ్యక్తిగతంగానూ

కూడా నూతన్నవచ్చి కుటుంబనియంత్రణకు ప్రాధాన్యం పడింది.

ప్రజల్లోవచ్చిన యీసాంఘిక, ఆర్థిక, ఆరోగ్యవిషయిక చిక్కుల్ని బట్టీ వారి మనస్తత్వాలూ మారుతున్నాయి. అందుచేత ప్రభుత్వమిది గ్రహించి, సులభంగా, ఖర్చులేకుండా, వుండే సంతాననిరోధక సాధనాన్ని ప్రజలకందజేయాలి. సంతానోత్పత్తి నరికట్టడం అనుకున్నంత త్వరగా లభ్యమయ్యే పనికాదు. ప్రభుత్వం, వారితోపాటు సేవాపరాయణులూ ప్రజల్లోగల్గిన యీవిప్లవాత్మక చైతన్యాన్ని సాంస్కృతికంగా సాంఘికంగా, నిర్మాణాత్మకంగా విజయవంతంగా నడిపించ వల్సిన అవసరం యెంతైనావుందని మర్చిపోరాదు !

## మానవస్వభావంలోని సంకుచితత్వం !

సహజ సంపదలూ, ఆర్థికాభివృద్ధి పథకాలూ, సాంఘిక సంస్థలూ, సాంస్కృతిక విలువలూ, సహకార నియమాలూ మొదలైనవన్నీ మానవాభ్యుదయానికే! అందుచేతనే వీట న్నిటికీ మూలకారకుడైన వ్యక్తియొక్క శక్తిసామర్థ్యాలు వృథాగా నాశనంగాకుండా కాపాడాల్సిన అవసరం యెంతైనా వుంది.

వ్యక్తివిలువనిగుర్తించి అతని అభ్యున్నతికి కావల్సిన మార్గాల్ని యేర్పరిచి జాతిని శక్తిపూరితంగా చేయడమే ప్రజాప్రభుత్వలక్ష్యం.

పుట్టినదగ్గిరనుంచీ, అవసరంలేని శ్రమలు పడుతూ చచ్చే వరకూ అసంతృప్తీ, బాధలతో అణగారిపోతున్నాడు సామా

న్యాము మన దేశంలో. అనారోగ్యంవల్లా, అకాలమరణాలవల్లా, ఆర్థికంగానూ, సాంఘికంగానూ, యెంతో శక్తినాశనమై పోతుంది.

అనుదినం మనకళ్ళయెదుట యెన్నో హృదయ విదారకమైన దృశ్యాలు కనబడుతున్నాయి. ఎన్నో అకాలమరణాలు, వికలాంగులయ్యేవారు, పుట్టుకలోంచే మందమతితనం గలవాళ్ళు, పిచ్చివాళ్ళూ, యెందరో కనబడుతూనే వున్నారు. ఈ బాధలన్నిటికీ కారణాలు మనకు తెలియకపోవచ్చును. కాని ప్రస్తుతం మనకు లభ్యమయ్యే శాస్త్రవిజ్ఞానంతో వీటిలో కొన్ని కష్టాల్ని గడిచి గట్టెక్కే సావకాశాలు వున్నాయి.

లెక్కకు మిక్కిలి స్త్రీలు కడుపులోనే చనిపోయిన పిల్లల్నీ, నెలలు నిండనివాళ్ళనీ కనడంవల్ల గర్భకోశ సంబంధమైన జబ్బులతో అకాలమరణానికి గురిఅవుతున్నారు. వీటికితోడు సంవత్సరంలోపు పిల్లలు రకరకాల బాలవ్యాధులతో బాధపడడం, వికలాంగులు కావడం, చివరకు బాలనేరస్థులుకూడా కావడం జరుగుతూవుంది. ఇన్ని గండాల్ని గడిచి పెరిగి పెద్దవాళ్ళయితే ఆకలితో, అశుభ్రతతో అనారోగ్యంతో తగినమందులైనా దొరకక చనిపోతున్నారు. నవయౌవ్వనంతో ఆనందంగా గడపవలసిన కాలంలో కాలపాశంలోపడి జీవితం విషాదాంతమవుతూవుంది. మనదేశంలో మనజీవితాలింత విషాదాంతంగా కావడానికి కారణమేమిటని మీరు ప్రశ్నించవచ్చు. అనుదినం చూచే యీ ఘోరదృశ్యాలకు మనం అలవాటుపడిపోయి, లెక్కచేయకుండా హృదయహీనంగా అయిపోయాం. అజ్ఞానం, దుఃఖంలోపుట్టి పెరగడంచేత యింతకన్నా

మంచిజీవితం వుందనేమాట మనకు గుర్తులేకుండా పోయింది. బతుకు భారంతో క్రుంగిపోయే జీవులూ, యెవరికీ అవసరంలేని వాళ్ళూ మనల్ని చుట్టుముట్టి వుండడంవల్ల మనం మానవత్వాన్నే గౌరవించడం మర్చిపోయాం.

ఈదుస్థితినుంచి తప్పించుకోడానికి చక్కని మార్గం మనముందేవుంది. మానవజీవితాన్ని గౌరవించి, కాపాడి, సుఖంగా, ఆనందంగా గడుపుతూ చక్కని సాంప్రదాయాల్నీ, మంచి భావినిర్మాతల్నీ ప్రపంచానికి కందివ్వాల్సిన బాధ్యత మనందరిపైనావుంది.

## భారత జనాభా లెక్కల వివరణ

### భారతదేశ విస్తీర్ణత - జనసాంద్రత

భారతదేశంయొక్క విస్తీర్ణత 1, 221, 072 చ॥ మై॥ 1951 జనాభా లెక్కలప్రకారం మన జనాభా 356, 891, 624. జమ్మూ కాశ్మీరు అస్సాములోని నాగజాతుల లెక్కల్నీ యిందులో కలపలేదు. రిజిస్ట్రారు జనరల్ గారు మార్చి 1—1950న యిచ్చినలెక్కల్ని బట్టి జమ్మూ కాశ్మీరుజనాభా 4. 37 మిలియన్లూ, అస్సాం నాగజాతిజనాభా 560, 631. వీటినిరెంటినీ మన జనాభాలో కలుపుకుంటే మనమొత్తం జనాభా 361. 82. మిలియన్లు.

| A. రాష్ట్రాలు | విస్తీర్ణత | జనాభా | రాజధాని |
|---|---|---|---|
| 1. ఆంధ్రా | 63, 108 | 20, 507, 801 | కర్నూలు |
| 2. అస్సాం | 54, 084 | 9, 129, 442 | షిలాంగ్ |
| 3. బీహారు | 70, 368 | 40, 218, 916 | పాట్నా |

| | | | |
|---|---|---|---|
| 4. బొంబాయి | 115, 570 | 35, 943. 559 | బొంబాయి |
| 5. మధ్యప్రదేశ్ | 130, 323 | 21, 327, 898 | నాగపూర్ |
| 6. మదరాసు | 60, 189 | 35, 734, 489 | మదరాసు |
| 7. ఒరిస్సా | 59, 869 | 14, 644, 293 | భువనేశ్వర్ |
| 8. పంజాబ్ | 37, 428 | 12, 638, 611 | చండీఘర్ |
| 9. ఉత్తరప్రదేశ్ | 112, 523 | 63, 254, 118 | లక్నో |
| 10. ప॥ బెంగాల్ | 29, 476 | 24, 786, 683 | కలకత్తా |
| మొత్తం రాష్ట్రాలు | 737, 409 | 278, 895, 852 | |

| B. రాష్ట్రాలు | వైశాల్యం | జనాభా | రాజధాని |
|---|---|---|---|
| 1. హైదరాబాదు | 82, 313 | 18, 652,964 | హైదరాబాదు |
| 2. జమ్మూ కాశ్మీర్ | 82, 258 | 4, 410, 010 | శ్రీనగరం |
| 3. మధ్యభారత్ | 46, 710 | 7, 914, 642 | గ్వాలియర్ ఇండోర్ |
| 4. మైసూరు | 29, 458 | 9, 071, 678 | బెంగుళూరు |
| 5. పెప్సూ | 10, 099 | 3, 468, 631 | పాటియాలా |
| 6. రాజస్థాన్ | 128, 424 | 15, 297. 979 | జయపూర్ |
| 7. సౌరాష్ట్ర | 21, 062 | 4, 136, 005 | రాజ్‌కోట్ |
| 8. ట్రావెన్‌కోర్ కొచ్చిన్ | 9, 155 | 9, 265, 157 | త్రివేంద్రం |
| మొత్తం | 327, 221 | 67, 334, 05[illegible] | |

| C. రాష్ట్రాలు | వైశాల్యం | జనాభా | రాజధాని |
|---|---|---|---|
| 1. అజ్మీర్ | 2, 425 | 692, 506 | అజ్మీర్ |
| 2. భూపాల్ | 6, 900 | 838, [illegible]07 | భూపాల్ |
| 3. బిలాస్‌పూర్ | 453 | 127, 566 | బిలాస్‌పూర్ |
| 4. కూర్గు | 1, 593 | 229, 255 | కూర్గు |
| 5. ఢిల్లీ | 574 | 1, 743, 992 | ఢిల్లీ |
| 6. హిమాచలప్రదేశ్ | 10, 600 | 989, 437 | సిమ్లా |
| 7. కచ్ | 8, 461 | 567, 825 | భూజ్ |

| | | | |
|---|---|---|---|
| 8. మణిపూర్ | 8, 620 | 579, 058 | మణిపూర్ |
| 19. త్రిపురా | 4, 049 | 649, 930 | అగర్తలా |
| 0. వింధ్య ప్రదేశ్ | 24, 600 | 3, 577, 431 | రేవా |
| మొత్తం | 68, 296 | 9, 995, 107 | |

| D. రాష్ట్రాలు | విస్తీర్ణత | జనాభా | రాజధాని |
|---|---|---|---|
| 1. అండామ్ నికోబార్ దీవులు | 3, 143 | 30, 963 | పోర్టు బ్లెయిర్ |

మిగిలిన ప్రదేశాలు

| రాష్ట్రం | విస్తీర్ణత | జనాభా | రాజధాని |
|---|---|---|---|
| సిక్కింరాష్ట్రం | 2, 745 | 135,046 | గాంగ్‌టాక్ |
| అన్నిటిమొత్తం. | 1,138,841 | 356,891,624 | |

1941 జనాభా లెక్కలప్రకారం జమ్మూ కాశ్మీరు వైశాల్యం 82258 చ॥ మైళ్లయితే జనం 4. 02 మిలియన్లు. 1950 సంవత్సరం మార్చి 1వ తేదీన రిజిస్ట్రారుజనరల్ లెక్కల ప్రకారం 4. 37 మిలియన్లు జనాభావుంది.

పార్టు బి. అస్సాములోని కొన్ని జాతులు నివసించు ప్రదేశములలో స్థానికంగా వేసిన అంచనాప్రకారం 5,60,631 మంది జనులున్నారు.

ఈసంఖ్య తక్కినవానితో నీక్రిందిరీతిగా సగపోవుచున్నది.

| వైశాల్యము | జనసంఖ్య |
|---|---|
| 1,221,072. చదరపుమైళ్లు | 361.82 మిలియన్లు |

# అ ను బం ధ ము 2

## 1911— నుండి 1951 వరకూ భారతదేశంలోని షుమారు పుట్టుకలూ, చావులూ, శిశుమరణాలు

| సంవత్సరం | పుట్టుకలు | చావులు | శిశుమరణాలు |
|---|---|---|---|
| 1911 | 38. 8 | 32. 3 | 205 |
| 12 | 39. 2 | 29. 8 | 208 |
| 13 | 39. 5 | 28. 8 | 195 |
| 14 | 39. 6 | 30. 2 | 212 |
| 15 | 37. 7 | 29. 9 | 202 |
| 1916 | 37. 0 | 29. 2 | 202 |
| 17 | 39. 1 | 32. 9 | 265 |
| 18 | 35. 1 | 33. 1 | 267 |
| 19 | 30. 0 | 35. 8 | 224 |
| 20 | 32. 8 | 30. 8 | 195 |
| 1921 | 32. 1 | 31. 0 | 198 |
| 22 | 31. 6 | 23. 9 | 175 |
| 23 | 34. 7 | 24. 7 | 176 |
| 24 | 33. 8 | 28. 0 | 189 |
| 25 | 32. 8 | 24. 1 | 174 |
| సంవత్సరం | పుట్టుకలు | చావులు | శిశుమరణాలు |
| 1926 | 33. 5 | 25. 8 | 189 |
| 27 | 33. 8 | 23. 7 | 167 |
| 28 | 34. 9 | 24. 1 | 173 |
| 29 | 33. 3 | 24. 2 | 178 |
| 30 | 34. 8 | 24. 9 | 181 |

| | | | |
|---|---|---|---|
| 1931 | 34. 8 | 25. 3 | 179 |
| 32 | 33. 9 | 21. 8 | 169 |
| 33 | 35. 7 | 22. 5 | 171 |
| 34 | 33. 7 | 25. 0 | 187 |
| 35 | 34. 7 | 23. 6 | 164 |
| 1936 | 35. 2 | 22. 5 | 162 |
| 37 | 34. 0 | 22. 1 | 162 |
| 38 | 33 6 | 23. 9 | 167 |
| 39 | 33. 0 | 21. 7 | 156 |
| 40 | 32. 0 | 21. 3 | 160 |
| 1941 | 32. 2 | 21. 8 | 158 |
| 42 | 29. 5 | 21. 3 | 163 |
| 43 | 26. 1 | 23. 6 | 165 |
| 44 | 25. 8 | 24. 1 | 169 |
| 45 | 27. 9 | 21. 5 | 151 |

| సంవత్సరం | పుట్టుకలు | చావులు | శిశు మరణాలు |
|---|---|---|---|
| 1946 గ | 28 8 | 18. 7 | 136 ఐ |
| 47 జ | 26. 4 | 19. 7 | 146 |
| 48 ట | 25. 2 | 17. 1 | 130 |
| 49 | 26. 4 | 15 8 | 123 |
| 50 | 24. 8 | 16. 0 | 127 |
| 1951 | — | — | 116 |

క. మృత్యుసంఖ్య చాలావరకు జనసంఖ్యమీద, వాటి సత్యంమీదా ఆధారపడి వుంటుంది. పైగా కాలాన్ని కూడా మూడువిభాగాలు చేయడంవల్లకూడా యీ లెక్కలు సరిగ్గావుండే అవకాశంలేదు. 1921 సం॥ ముందు జనాభాలెక్కలు రిజిస్ట్రేషను సరిగ్గా జరిగేసావకాశాలు లేవు. 1921 నుండి 1946 వరకూ బ్రిటిషుఇండియాగా

లెక్కలు తీసుకోబడ్డాయి. 1947 తర్వాత భారతరిపబ్లికుగా అవడంచేత పాకిస్థానులెక్కలు ఇందులోకిరాలేదు. చాలా వరకూ అన్నిచిన్నరాజ్యాల లెక్కలుమాత్రం యిందులో కలిసాయి.

గ. 1946 వరకూ బ్రిటిషు రాష్ట్రాలన్నిటిలో చిన్నస్వాతంత్ర్య రాష్ట్రాలుమినహా రిజిష్టరుచేయబడిన లెక్కలేవున్నాయి.

చ. తూర్పుబెంగాలు లెక్కలులభ్యంకాలేదు కాబట్టి అవి లెక్కల్లో లేవు.

ట. దేశాన్నంతా స్వాతంత్రభారతంగా పాకిస్థానుగా విభజించారు.

డ. 1948 దరిమిలాలెక్కల్లో భారతవిభాగానంతరం అన్ని స్వతంత్రరాజ్యాల లెక్కలూ భారతరాజ్యాంగంగా యేర్పాటుచేయబడిన తరువాతనే తీసుకోబడ్డాయి. ఎక్కడకూడా రిజిస్ట్రేషను సరిగాచేయబడలేదు. ఈవిషయం స్వతంత్రరాజ్యాల విషయంలోకూడా యథార్థమేను.

## అనుబంధము 3

1951 సం॥ నాటి 100, 000 పైన జనాభావున్న పట్టణాలు

| పట్టణం | 1951 జనాభా | 1000 మంది మగవాళ్ళకీ సగటున వున్న స్త్రీలు |
|---|---|---|
| ఆంధ్రరాష్ట్రం | | |
| 1. విజయవాడ | 161, 198 | 956 |
| 2. గుంటూరు | 125, 255 | 987 |
| 3. విశాఖపట్టణం | 108, 042 | 978 |
| 4. రాజమండ్రి | 105, 276 | 1, 024 |

బీహారు రాష్ట్రం

| | | |
|---|---|---|
| 1. పాట్నా | 283, 479 | 822 |
| 2. జమ్షెడ్ పూర్ | 218, 162 | 802 |
| 3. గయా | 133, 700 | 854 |
| 4. భగల్ పూర్ | 114, 530 | 831 |
| 5. రాంచీ | 106, 849 | 830 |

బొంబాయి రాష్ట్రం

| | | |
|---|---|---|
| 1. బొంబాయి | 2, 839, 270 | 596 |
| 2. అహమ్మదాబాదు | 788, 333 | 765 |
| 3. పూనా | 480, 982 | 865 |
| 4. షోలాపూర్ | 266, 050 | 916 |
| 5. సూరత్ | 223, 182 | 917 |
| 6. బరోడా | 211, 407 | 862 |
| 7. కొల్హాపూర్ | 136, 835 | 918 |
| 8. హుబ్లీ | 129, 609 | 930 |

మధ్య ప్రదేశ్

| | | |
|---|---|---|
| 1. నాగపూర్ | 449 099 | 919 |
| 2. జబల్ పూర్ | 256, 998 | 833 |

మదరాసు రాష్ట్రం

| | | |
|---|---|---|
| 1. మదరాసు | 1, 416, 056 | 921 |
| 2. మధుర | 361. 781 | 967 |
| 3. తిరుచునాపల్లి | 218, 921 | 957 |
| 4. సేలం | 202, 335 | 975 |
| 5. కోయంబత్తూరు | 197, 755 | 890 |
| 6. కోజికోడ్ | 158, 724 | 982 |
| 7. మంగుళూరు | 117, 083 | 992 |
| 8. వెల్లూరు | 106, 024 | 1, |
| 9. తంజావూరు | 100. 680 | 1, 012 |

ఒరియా రాష్ట్రం

| | | |
|---|---|---|
| 1 కటకం | 102, 505 | 755 |

పంజాబ్ రాష్ట్రం

| | | |
|---|---|---|
| 1. అమృత్‌సర్ | 325, 747 | 762 |
| 2. జలంధర్ | 168, 816 | 853 |
| 3. లూధియానా | 153, 795 | 835 |

| ఉత్తర ప్రదేశ్ | జనాభా | స్త్రీలు |
|---|---|---|
| 1. కాన్‌పూర్ | 705, 383 | 699 |
| 2. లక్నో | 496, 861 | 783 |
| 3. ఆగ్రా | 375, 665 | 820 |
| 4. బెనారస్ | 355. 777 | 811 |
| 5. అలహాబాదు | 332, 295 | 795 |
| 6. మీరట్ | 233, 183 | 752 |
| 7. బెరిలీ | 208, 083 | 844 |
| 8. మురాదాబాద్ | 161, 854 | 840 |
| 9. షహరన్‌పూర్ | 148, 435 | 805 |
| 10. డెహరాడూన్ | 144, 216 | 709 |
| 11. అలిఘర్ | 141, 618 | 802 |
| 12. రాంపూర్ | 134 277 | 938 |
| 13. ఘోరక్‌పూర్ | 132, 436 | 777 |
| 14. ఝాన్సీ | 137, 365 | 858 |
| 15. మథురా | 105, 773 | 813 |
| 16. షహజాన్‌పూర్ | 104, 835 | 855 |

| పశ్చిమ బెంగాల్ | జనాభా | స్త్రీలు |
|---|---|---|
| 1. కలకత్తా | 2, 548, 677 | 570 |
| 2. హౌరా | 433, 630 | 616 |
| 3. టోలీగంజ్ | 149, 817 | 780 |

| | | |
|---|---|---|
| 4. భత్‌పారా | 134, 916 | 533 |
| 5. కరగ్‌పూర్ | 129, 636 | 909 |
| 6. గోడన్‌రీచ్ | 105, 160 | 648 |
| 7. సౌత్ బర్బన్ | 104, 055 | 792 |
| **హైదరాబాదు** | | |
| 1. హైదరాబాదు | 1, 085, 722 | 989 |
| 2. వరంగల్లు | 133, 130 | 954 |
| **మధ్యభారత్** | | |
| 1. ఇండోర్ | 310, 859 | 851 |
| 2. గ్వాలియర్ | 241, 577 | 898 |
| 3. వుజ్జయినీ | 129, 817 | 888 |
| **మైసూర్** | | |
| 1. బెంగుళూరు | 778, 977 | 883 |
| 2. మైసూరు | 244, 323 | 947 |
| 3. కోలార్ గనులు | 159, 084 | 1,004 |
| **రాజస్థాన్** | | |
| 1. జయపూర్ | 291, 130 | 895 |
| 2. జోడ్‌పూర్ | 180, 717 | 875 |
| 3. బికనీర్ | 117, 113 | 935 |
| **సౌరాష్ట్రం** | | |
| 1. భావనగర్ | 137, 951 | 924 |
| 2. రాజకోట | 132, 069 | 964 |
| 3. జాంమ్‌నగర్ | 104, 419 | 942 |
| **ట్రావెన్‌కూర్ కొచ్చిన్** | | |
| 1. త్రివేండ్రమ్ | 186, 931 | 955 |
| 2. అలెప్పె | 116, 278 | 950 |

| | | |
|---|---|---|
| **అజ్మీర్ రాష్ట్రం** | | |
| 1. అజ్మీర్ | 196, 633 | 900 |
| **భూపాల్ రాష్ట్రం** | | |
| 1. భూపాల్ | 102, 333 | 894 |
| **ఢిల్లీ రాష్ట్రం** | | |
| 1. ఢిల్లీ | 914, 790 | 770 |
| 2 న్యూఢిల్లీ | 276, 314 | 764 |

# అనుబంధము 4

## 1951 సం॥ లో భారతజనాభా – వృత్తిలో వున్నవారు.

| వృత్తులు | స్వయం కృషివల్ల బతికేవారు | సంపాదన లేక ఇతరుల మీదఆధారపడిబతికేవారు | సంపాదన చేస్తునే ఇతరులపై ఆధారపడేవారు | మొత్తం | మొత్తం జనాభా శాతంలో |
|---|---|---|---|---|---|
| 1. స్వంతభూమిని వ్యవసాయం చేసేవారు | 45 7 | 100.1 | 21.5 | 167.3 | 46.9 |
| 2. కవులు చేసేవారు | 8.8 | 18 9 | 3.9 | 31.6 | 8.8 |
| 3 వ్యవసాయ కూలీలు | 14.9 | 24.7 | 5.2 | 44.8 | 12.6 |
| 4. కవులుకు స్వంతభూములిచ్చేవారు | 1.6 | 3.3 | 0.4 | 5.3 | 1.5 |
| మొత్తం వ్యవసాయం మీద బతికేవారు | 71.0 | 147.0 | 31.0 | 249.0 | 69.8 |
| 5. పరిశ్రమలవల్ల బతికేవారు | 12.2 | 22.3 | 3.2 | 37.7 | 10.5 |
| 6. వ్యాపారం | 5.9 | 14.5 | 0.9 | 21.3 | 6.0 |
| 7. రహదార్లు | 1.7 | 3.7 | 0.2 | 5.6 | 1.6 |

| 8. విద్యాశాఖా, ఆరోగ్య. రెవెన్యూ మొదలైన శాఖల్లో వున్న వుద్యోగులు. | 13.6 | 26.8 | 2.6 | 43.0 | 12.1 |
|---|---|---|---|---|---|
| పరిశ్రమలవల్ల బతికేవారి మొత్తం | 33.4 | 67.3 | 6.9 | 107.6 | 30.2 |
| మొత్తం జనాభా | 104.4 | 214.3 | 37.9 | 356.6 | 100.0 |

# అనుబంధము 5

(1951) భారతప్రజల మత వివరణ సంఖ్యలు.

| మతం | మొత్తం మిలియన్లలో | శాతం |
|---|---|---|
| హైందవులు | 307.1 | 84.99 |
| మహమ్మదీయులు | 35.9 | 9.93 |
| క్రైస్తవులు [ప్రొటస్టేన్టులూ, కేథలిక్కులూ] | 8.3 | 2.30 |
| సిక్కులు | 6.3 | 1.74 |
| బౌద్ధులు | 0.22 | 0.06 |
| జైనులు | 1.6 | 0.45 |
| పార్శీలు | 0.11 | 0.03 |
| కొండజాతిమతాలు | 1.7 | 0.47 |
| ఇతరమతాలు | 0.11 | 0.03 |

సమాప్తం

